# చతుర

జనవరి 2002 ★ రూ. 7/-



# రంగుల కల

ఆదెళ్ల శివకుమార్

# చతుర ప్రపంచం

## కంప్యూటర్ కన్నా మెదడే మిన్న

కంప్యూటర్, హ్యూమన్ బ్రెయిన్ ఈ రెంటిలో ఏది గొప్ప? ఏది ఎక్కువ మెమరీని స్టోర్ చేసుకోగలదు? అని అడిగితే ఠక్కున కంప్యూటర్ అని చెప్పేస్తారుకదూ! అయితే మీరు పొరపడినట్టే. ఎందుకంటే కంప్యూటర్ కన్నా దాన్ని తయారుచేసిన మనిషి మెదడుకే పవర్ ఎక్కువ.

మరి మెదడు రహస్యాన్ని విప్పి చెప్పిన శాస్త్రజ్ఞులు ఏమంటున్నారంటే మనం నిజానికి మన మెదడులో పది శాతాన్ని కూడా వినియోగించుకోలేకపోతున్నామట. మన మెదడులో జ్ఞాపకశక్తిని కలిగి ఉండే న్యూరాన్‌లు దాదాపు 15 వందల కోట్లవరకు ఉంటాయట. ఒక్కో న్యూరాన్‌ని ఒక కంప్యూటర్ చిప్‌తో పోల్చి చూడండి. ఆ లెక్కన కంప్యూటర్ కన్నా ఎక్కువ సమాచారాన్నే మనం స్టోర్ చేసుకోగలం. ఒక మాటలో చెప్పాలంటే హ్యూమన్ బ్రెయిన్‌తో పోలిస్తే కంప్యూటర్ శక్తి పదోవంతు మాత్రమే. కాకపోతే మన శక్తిసామర్థ్యాలు సరిగా వినియోగించుకోలేక మనం కంప్యూటర్ల మీద ఆధారపడుతున్నామన్నమాట.

న్యూరాన్లు సంకేతాలను అందుకుని గమ్యస్థానానికి చేరుస్తాయి. ఇందుకుగాను ఇవి గంటకు 200 మైళ్లనుంచి 3 వేలమైళ్ళ వేగంతో పయనిస్తాయి. సమాచారం భద్రపరచడంతోపాటు ఆలోచించటం, కలలు కనడం కూడా చేస్తాయి. కల్పనాశక్తి కూడా వీటికుంది. మనలో కలిగే భావోద్వేగాలకు మెదడే కారణం. చాలామంది మనసనే పదం ఉపయోగిస్తుంటారు. నిజానికి మనసనేది లేదని, మెదడే అన్నింటికీ కారణమని శాస్త్రజ్ఞులు అంటున్నారు. మరి దీనిని ప్రశాంతంగా ఉంచుకుంటూ సరిగా వినియోగించుకోగలిగితే మీ బ్రెయిన్ ఓ కంప్యూటర్‌లా పని చేస్తుంది.



## జీవితమంతా ఆశ్చర్యమయమే...

ఫ్రాన్స్ ఎమిల్ నిలాన్‌ఫా సాహిత్యంలో చేసిన కృషికిగాను నోబెల్ ప్రైజు అందుకొన్నప్పుడు తన జీవితం అంతా ఆశ్చర్యకరమైన సంఘటనలతోనే గడిచిపోతోందని, అందులో ఇది ఒకటని అంటాడు. ఆయన రచనలలో కల్పనకన్నా వాస్తవం ఎక్కువగా ఉంటుంది. తాను అనుభవించిన స్థితిగతులనూ, తన చుట్టూ ఉన్న అంశాలను గ్రహించి ఆయన రచనలు చేస్తాడు. నిజాయితీగా సాగే ఫ్రాన్స్ రచనల్లో మానసిక విశ్లేషణకు కూడా ప్రాధాన్యం ఉంటుంది.

మనిషికి ప్రకృతి ఒడిని మించిన ఆనందకరమైన స్థలం మరోటి లేదంటాడాయన.

1888 సెప్టెంబరు 16న ఫిన్‌లాండులోని లసటకంటలో జన్మించిన ఫ్రాన్స్ సంచార విద్యాలయాల ద్వారా విద్యాభ్యాసం చేశాడు. బయాలజీ చదివిన ఆయన ఆర్థిక ఇబ్బందులవల్ల పరీక్షలు రాయకుండానే తిరిగి వచ్చాడు.

అనుకోకుండా ఒక పత్రికకు కథ రాసి పంపడం, అది అచ్చవడం, అందుకు పారితోషికం కూడా లభించడంతో ఫ్రాన్స్‌లోని రచయితకి ప్రోత్సాహం లభిస్తుంది. అక్కడినుంచి ఆయన రచనలు అచ్చుకావడం ఆరంభమైంది. ఫ్రాన్స్‌కి సంబంధించి ఇది ఆయన జీవితంలో జరిగిన ఓ అద్భుత ఘటన.




అలాగే ఆయన వివాహం కూడా జరుగుతుంది. జానపదనృత్యం చూద్దామని వచ్చిన ఫ్రాన్స్ అక్కడో అమ్మాయిని చూసి ఆమెని వివాహం చేసుకుంటాడు.

ఫ్రాన్స్ రచించిన 'ది మేడ్‌సిల్‌జా' దాదాపు అన్ని ప్రధాన భాషలలోకి అనువదించబడింది. లైఫ్ అండ్ సన్, మీక్ హెరిటేజ్, బిలౌడ్ ఫాదర్ లాండ్ ఆయన ప్రసిద్ధ రచనలలో కొన్ని.

'పీపుల్ ఇన్ ద సమ్మర్ నైట్' ఫ్రాన్స్ చివరి నవల. ఇందులో కట్టుబాట్లను, పరిమితులను వదిలి తన జన్మభూమి




స్వభావ స్వరూపాలను గురించి రాశారాయన. పరిపూర్ణమైన, అనంతమైన, స్వేచ్ఛాపూరిత ఆనందం కోసం చేసిన ఈ రచన ప్రతి ఒక్కరూ చదివితీరాలి.

---

## భవిష్యత్తులో ప్రపంచమంతా మగవాళ్ళే!

అమ్మాయి, అబ్బాయి ఎలా పుడతారని అడిగితే మీరేం సమాధానం చెప్తారోగాని అలెగ్జాండర్ లెర్చల్ అనే జర్మనీ శాస్త్రవేత్త మాత్రం ఓ ఆసక్తికరమైన విషయాన్ని చెప్తున్నాడు. అదేంటంటే వాతావరణం వేడిగా వుంటే ఆ కాలంలో అబ్బాయిలు, చల్లగా ఉంటే అమ్మాయిలు పుడుతున్నారట. అంటే ఏప్రిల్-జూన్ నెలలు అబ్బాయిల సీజన్ అయితే అక్టోబర్‌నుంచి జనవరి వరకు అమ్మాయిల సీజనన్నమాట.




1946 నుండి 1995 వరకు అంటే దాదాపు నలభైతొమ్మిది సంవత్సరాల కాలంలో జరిగిన జననాల రికార్డులు పరిశీలిస్తే లింగనిర్ధారణలో వాతావరణ ప్రభావం కూడా ఉంటుందని తెలుస్తోంది. మరి ఇందుకు శాస్త్రవేత్తలు చెప్తున్న కారణం ఏంటంటే వేసవి కాలంలో స్పెర్మ్‌లో ఉంటే ఎక్స్ క్రోమోజోములు 'వై' క్రోమోజోముల కంటే ఎక్కువగా డామేజ్ అవుతాయట. వాతావరణం వేడిగా ఉన్నప్పుడు ఎక్కువసార్లు సెక్స్‌లో పాల్గొనడం, వీర్యంలో ఉండే 'వై' క్రోమోజోమ్ 'ఎక్స్' క్రోమోజోమ్ కంటే వేగంగా అండాశయం వైపుగా ప్రయాణం చేయడం కారణంగా కూడా అబ్బాయిల సంఖ్య ఎక్కువ అవుతోందిట.

శాస్త్రవేత్తలకి ఆందోళన కలిగిస్తున్న విషయం ఏంటంటే గ్లోబల్‌వార్మింగ్ కారణంగా భవిష్యత్తులో ఇక ప్రపంచమంతా మగవాళ్ళతోనే నిండిపోతుందేమోనని.

ఇప్పటికే స్కానింగ్‌లో ఆడపిల్ల అని తెలియగానే పిండదశలోనే ఆమె గొంతు పిసికేసి, పురుషుల సంఖ్య పెంచే కార్యక్రమాలు చాలా చోట్ల జరుగుతున్నాయి కాబట్టి ఇదేమీ పెద్ద ఆందోళన కలిగించదు లెండి.



# చతుర

సంపుటి : 24 సంచిక : 12 జనవరి : 2002
288వ సంచిక

అదో రంగుల ప్రపంచం...!
అదో స్వప్నలోకం...!
కోట్లాది మంది ప్రేక్షకులను తన్మయత్వంలో మైమరిపించే సిన్మాప్రపంచం...
అందులోకి ప్రవేశించి తనకంటూ ఒక స్థానం సంపాదించుకోవాలన్న తపనతో ఇంట్లోంచి మాయమైపోయిన ఒక యువకుడు తన లక్ష్యసాధనలో ఎదుర్కొన్న సమస్యలేమిటి? తెరమీది అందమైన సినిమాలా కాక,తెరవెనుక రంగుల ప్రపంచంలోని వంచనలూ, హేళనలూ, కుట్రలూ, కుతంత్రాలూ, ఘర్షణ, మానసిక క్షోభ... ఆ యువకుడిని ఏవిధంగా ప్రభావితం చేశాయి?
అనేకమందిలాగే ఆ యువకుడు కూడా అనేకానేక అనుభవాల అనంతరం సినిమాలకు ఓ దండం పెట్టేసి నిరాశా, నిస్పృహలతో ఆ రంగంనుంచి తప్పుకున్నాడా? లేక పరాజయాలు పాఠాలుగా, ఓటమిని విజయంగా మలుచుకోగలిగాడా?
సినిమా ప్రపంచం తాలుకూ వివిధ కోణాలను సున్నితంగా స్పృశిస్తూ యువతను హెచ్చరించే...

## ఆదెళ్ల శివకుమార్ రచన

# రంగులకల



**ఈ నెల చతుర
సమగ్ర నవల**

బ్రహ్మాండమైన స్టేజ్...

విద్యుద్దీపాలతో ధగధగమంటూ మెరిసి పోతోంది...

ప్రపంచ సిన్మాకు సంబంధించి అద్భుత మైన సంరంభం... ఆస్కార్ అవార్డ్స్ ఫంక్షన్...

కోట్లాదిమంది ప్రేక్షకులు ప్రపంచవ్యాప్తంగా టీవీలముందు కూర్చుని లైవ్ టెలీకాస్ట్ తన్మయంగా చూస్తున్నారు... ఆకాశం నుంచి కిందకు దిగి వచ్చిన నక్షత్రాల్లా మెరుస్తున్నారు హాలీవుడ్‌స్టార్స్... హీరోలు, హీరోయిన్లు, దర్శకులు, టెక్నీషియన్స్ సిన్మా ప్రపంచం అంతా దాదాపుగా అక్కడే వుంది.

ఆ వైభవం, గ్లామర్ చూసేందుకు రెండు కళ్ళూ చాలటంలేదు.

బెస్ట్ హీరో, హీరోయిన్ అవార్డుల ప్రదానం అయిపోయింది. ప్రస్తుతం బెస్ట్ డైరెక్టర్... ఎవరికి రాబోతోంది?

వీక్షిస్తున్న అందరూ ఉత్కంఠతో ఊపిరి బిగపట్టారు.

స్టేజ్‌మీదనుంచి షరాన్‌స్టోన్ హాలీవుడ్ డైరెక్టర్ స్పీల్‌బర్గ్‌ను ఆహ్వానించింది. "మిస్టర్ స్పీల్‌బర్గ్ ఈసారి ఆస్కార్ బెస్ట్ డైరెక్టర్ ఎవరో డిక్లేర్‌చేస్తారు" అంటూ ఎనౌన్స్ చేసింది.

స్పీల్‌బర్గ్ స్టేజీమీదకు వచ్చి అందరికీ చేయి వూపాడు. చిరునవ్వుతో ఓ నిమిషం సేపు మాట్లాడిన తర్వాత ఆస్కార్ బెస్ట్ డైరెక్టర్ పేరు ఎనౌన్స్ చేశాడు.

"మిస్టర్ శంకర్ ఫ్రమ్ ఇండియా... కోలవెన్ను ఆఫ్ కృష్ణాజిల్లా"

ఆకాశం దద్దరిల్లిపోయేలా చప్పట్లు మారుమోగాయి.

శంకర్ తను కూర్చున్న ఛెయిర్‌లోంచి పైకి లేచాడు. పక్కనే కూర్చుని వున్న ఆర్నాల్డ్‌ష్వాజ్‌నెగ్గర్ షేక్‌హాండ్ ఇచ్చాడు. హుందాగా నడిచి స్టేజ్ ఎక్కాడు.

కెమేరా ఫ్లాష్‌లు తళతళమంటూ మెరుస్తున్నాయి. వందలాది వీడియో, మూవీ కెమేరాలు ఆ దృశ్యాన్నంతా చిత్రీకరిస్తున్నాయి. ఆహూతులు ఆపకుండా కరతాళ ధ్వనులు చేస్తూనే వున్నారు.

"కంగ్రాట్యులేషన్స్" అన్నాడు స్పీల్‌బర్గ్ చిరునవ్వుతో... అదే సమయంలో మెరుపులా స్టేజ్‌మీద జూలియారాబర్ట్ ప్రత్యక్షమయింది.

ఆస్కార్ బెస్ట్ డైరెక్టర్ ప్రదానం జరిగింది.

తనకు ఇచ్చిన ఆస్కార్ అవార్డును కుడిచేతి పిడికిటిలో బిగించి గాలిలోకి ఎత్తాడు శంకర్. ఫ్లాష్‌లు తళతళమంటూ నిర్విరామంగా మెరుస్తూనే వున్నాయి. .

"ఈ అవార్డ్ నాది కాదు. నా దేశానిది. నా భారతదేశానికి దక్కిన అరుదైన గౌరవంగా భావిస్తున్నాను"

అది విని చూస్తున్న భారతీయ ప్రేక్షకులు ఆనందభాష్పాలు రాల్చారు.

"శంకర్ ది గ్రేట్ డైరెక్టర్..." ప్రేక్షకులు ఆనందోత్సాహాలతో అరుస్తున్నారు. సందడి... సంతోషం... ఆనందం.

జూలీయారాబర్ట్ షేక్‌హాండ్ ఇచ్చి అతన్ని హగ్ చేసుకుని చెవిలో లోగొంతులో చెప్పింది "యువార్ ది రియల్ గై". అతను ఆమె శరీర పరిమళాన్ని ఆస్వాదిస్తుండగా కోట్లాది మంది చూస్తుండగా జూలియారాబర్ట్ అతని పెదవులమీద చుంబించింది.

ది గ్రేటెస్ట్ బ్యూటీ ఆన్ ది ఎర్త్ జూలియారాబర్ట్ తనను అంతమంది ముందు ముద్దుపెట్టుకోవటం... వావ్... రియల్లీ థ్రిల్లింగ్. శంకర్ తన్మయంగా జూలీయారాబర్ట్‌ను మరింత గట్టిగా హగ్ చేసుకున్నాడు.

భౌ... భౌభౌ...భౌ... మూలుగులు... కుయ్... కుయ్.

అతనికి హఠాత్తుగా మెలుకువ వచ్చింది.

అతని కౌగిట్లోంచి తప్పించుకునేందుకు గింజుకుంటున్నది జూలీయారాబర్ట్ కాదు, గజ్జికుక్క.





ఉలిక్కిపడి దాన్ని వదిలేశాడు.

అది వెనక్కు తిరిగి చూడకుండా 'బతుకు జీవుడా' అంటూ పారిపోయింది.

అయోమయంగా తలతిప్పి చూశాడు. ఆస్కార్ స్టేజ్ కాదు. శిథిలమవుతున్న మేడ తాలూకు మొండిగోడలు దర్శనమిచ్చాయి.

తెల్లగా తెల్లవారిపోయింది.

అంటే తను కలకన్నాడా?

రాత్రి మేడమీద పడుకుని పైన ఆకాశంలో చుక్కల్ని చూస్తూ తన భవిష్యత్తును ఊహించుకుంటూ ఈ అందమైన కల కన్నాడా? మరి ఈ కుక్క ఎక్కడినుంచి వచ్చినట్లు! అర్ధరాత్రి అంతా సద్దుమణిగిన తర్వాత చల్లగా వచ్చి తన పక్కన చేరి వుంటుంది. తను కలలో జూలియారాబర్ట్‌అనుకుని కుక్కను వాటేసుకున్నాడు.

"థూ...." అనుకుంటూ మూతి తుడుచుకున్నాడు. ఎందుకో అనుమానం వచ్చి మళ్ళీ తలతిప్పి చూశాడు.

మెట్లమీద నిలబడి యాభైఏళ్ళ ఆయన అతనివంకే తదేకంగా చూస్తున్నాడు. ఆయన్ని చూడగానే అతను మళ్ళీ ఉలిక్కిపడ్డాడు. పైకి లేచి దుప్పటి మడిచి దిండు, చాపా పట్టుకుని కిందకు దిగేందుకు మెట్ల దగ్గరకు వచ్చాడు. ఆయన ఇంకా అలాగే చూస్తున్నాడు.

ఆయన...

అతని తండ్రి పురుషోత్తమరావు.

"ఏరా... మళ్ళీ కలొచ్చిందా? "

ఏం మాట్లాడకుండా మౌనంగా వుండిపోయాడు.

"ఆస్కార్ అవార్డొచ్చినట్లు కలొచ్చిందా? "

శంకర్ తండ్రివైపు ఆశ్చర్యంగా చూశాడు. "మీకెలా తెలుసు"

"నేను నీ తండ్రినిరా... నువ్వెంత బేవార్సు కలలు కంటావో నాకు ఆ మాత్రం తెలీదంట్రా"

"ఆస్కార్ అవార్డు వచ్చినట్లు కల రావటం బేవార్సుతనమా? " ధైర్యం తెచ్చుకుని అన్నాడు.

"ఆస్కార్ కల రావటం కాదురా... నువ్వు తీసిన తెలుగు సిన్మాకి ఆస్కార్ అవార్డు వచ్చినట్లుగా కలకన్నావు చూడూ అదే బేవార్సుతనమంటే... మన తెలుగు సిన్మాకి ఆస్కార్ కాదు జాతీయ అవార్డయినా వచ్చిందంట్రా? "

"నాలాంటివాళ్ళు ఇట్టా పల్లెటూర్లో మగ్గిపోతుంటే వచ్చినట్లే..." ఉక్రోషంగా అన్నాడు శంకర్.

"సరే... నువ్వు ఇక్కడుండి కొంపను ఉద్ధరించావు ఇక దేశాన్ని ఉద్ధరించటానికి. పగటి కలలు కనటం మానుకుని కాస్త భూమ్మీద బతికే ఆలోచన చేయి"

"నా గొప్పతనం నీలాంటి సగటు మనిషికి అర్థంకాదు" పైకి అన్లేదు మనసులో అనుకున్నాడు. పైకి అనే ధైర్యంలేక.

"ఏరా విన్పిస్తోందా? "

బుద్ధిగా తల ఆడించి మెట్లు దిగుతున్న కొడుకువంక ఆయన నిస్సహాయంగా చూస్తుండిపోయాడు. ఆ వయస్సు అలాంటిది. భ్రమలకూ, వాస్తవానికీ మధ్య తేడా తెలీదు. తెలిసేసరికల్లా జీవితం చేజారిపోతుంది.

★ ★ ★

"రోజూ ఇడ్లీనేనా? "

"ఇడ్లీ వంటికి మంచిదిరా... ఆవిరిమీద వుడుకుతుందిగదా"

"ఆ... ఇడ్లీ ఆవిరిమీద వుడుకుతుంది, మీ ఆయన నూనె లేకుండా నన్ను ఫ్రై చేస్తాడు. రెండూ మంచివే"

శారదమ్మ కొడుకు ఉక్రోషం చూసి నవ్వింది "మళ్ళీ మీ నాన్నగారు తిట్టారేంట్రా? "

"ఆ... నాకు క్లాసులు పీకటంకంటే మీ ఆయనకు వేరే పనేముంది? "

"మీ ఆయనేంట్రా పిచ్చివెధవా..." కొడుకుని సున్నితంగా మందలిస్తూ అంది. "ఆయన మీ నాన్నగారు. ఆయన్ని గౌరవిం

చటం నేర్చుకో"

తల వంచుకుని టిఫిన్ తింటున్నవాడు మరింత ఉక్రోషంగా తల్లివైపు చూశాడు. "అదే చెప్పేది. ఆ గౌరవం ఎక్కువై భయంగా మారింది... నేను ఆయనకు ఎదురు చెప్పలేని బడుద్ధాయినయ్యాను"

"నువ్వు బడుద్ధాయివేంట్రా... నా బంగారు కొండవి..." శారదమ్మ ప్రేమగా అంటూ మరో రెండు ఇడ్లీలు వడ్డించింది.

"ఆ... నీకు బంగారు కొండనే, మీ ఆయనకే అనకొండలా కనబడుతున్నాను" అంటూ ఇంకా ఏదో అనబోతూ తండ్రి రావటంతో మాటలు ఆపేసి బుద్ధిగా టిఫిన్ తినసాగాడు.

"ఏరా... ఇంకా తినటం కాలేదా. పొలం దాకా వెళ్ళొస్తావా?" అంటున్న భర్తవైపు చిరుకోపంగా చూస్తూ అంది శారదమ్మ.

"వాడ్ని కాస్త ప్రశాంతంగా తిననీయండి. అయినా మాట్లాడితే వాడిమీద ఒంటికాలి మీద లేస్తారేమిటి?"

"సరే... కొడుకుని వెనకేసుకొచ్చావు. వాడి డిగ్రీ అయిపోయి మూడేళ్ళవుతోంది. ఉద్యోగం తప్ప పొలంకెళ్ళనంటాడు. పోనీ ఆ ఉద్యోగాలు కూడా కలెక్టర్ లెవెల్‌కి తక్కువయితే వీడికి ఆనవు. దీనికి తోడు ఆ సినిమా పిచ్చొకటి... ఎప్పుడూ థియేటర్ల దగ్గర తిరగటం, సితారలు, శివరంజనిలు చదవటం తప్ప చేసే పనేమైనా వుందా?"

"మరీ బెదరకొట్టమాకండీ వాడే దార్లోపడతాడు"

"ఎప్పుడు పడతాడే దార్లో.. ఈ కలియుగం పూర్తయ్యే లోపల పడతాడంటావా? రాత్రిళ్ళు సెకండ్‌షోలకి తిరగటం, బారెడు పొద్దెక్కేదాకా ఆ మేడమీద చేరి పగటికలలు కనటం... ఆ వయస్సులో మేమూ కన్నామే కలలు. ఎంచక్కా ఏ జ్యోతిలక్ష్మినో, జయమాలినో కలల్లోకి వచ్చేవాళ్లు. నీ సుపుత్రుడూ కంటున్నాడు కలలు ఆస్కారంట... ఆస్కార్"

"ఆసుకారా... అదేం కారండీ?" అర్థంకాక దీర్ఘం తీసింది శారదమ్మ.

"ఆసుకారు, పట్టకారు కాదే, ఆస్కార్. అది ప్రపంచంలో గొప్ప సిన్మాలు తీస్తే ఇస్తార్లే ఆ అవార్డు. నీ కొడుకు ఆ అవార్డొచ్చినట్టు కలలుగంటూ గజ్జికుక్కను వాటేసుకుని దాని మూతి నాకుతున్నాడు"

"ఏరా... మీనాన్నగారు చెప్పేది నిజమా?" అంటూ శారదమ్మ భర్తతో మాట్లాడుతున్నదల్లా కొడుకువైపు తిరిగింది. ఎక్కడున్నాడు? కుక్కటాపిక్ వచ్చేసరికే మాయంఅయిపోయాడు.

★ ★ ★

అది ఆంధ్రప్రదేశ్‌లోని లక్షలాది గ్రామాల్లో ఒకటి.

వ్యవసాయం చుట్టూ మనుష్యుల జీవితాలు గాఢంగా అల్లుకున్న ఆ వూర్లో రెండు సిన్మా థియేటర్లున్నాయి. కేబుల్ టీవీలు ఇంకా ఆ వూర్లోకి విస్తృతంగా ప్రవేశించలేదు కాబట్టి ఆ వూరి జనానికి సిన్మానే ఏకైక వినోదం. తెరమీద బొమ్మలు నవ్వితే నవ్వుతారు, ఏడిస్తే కంట తడిపెట్టుకుంటారు.

పెద్దవాళ్ళు రాజకీయాల గురించీ, కుర్రకారు సిన్మాల గురించీ నిరంతరం చర్చించుకుంటూనే వుంటారు. రెండు రంగాలూ జనాలను ఎంటర్‌టైన్ చేసేవే కాబట్టి చర్చలు రసవత్తరంగా సాగుతూ వుంటాయి.

అదే వూర్లో పురుషోత్తమరావు ఓ పదెకరాల రైతు.

పదెకరాల పొలంతో గౌరవప్రదంగా బతుకుతూ వస్తున్న పురుషోత్తమరావుగారికి ఇద్దరే పిల్లలు. శంకర్, భారతి. శంకర్ డిగ్రీ పూర్తయి మూడేళ్ళు దాటుతోంది. ఎన్నో పరీక్షలు రాస్తున్నాడు కానీ ఉద్యోగం మాత్రం రాలేదు. చిన్నతనం నుంచే శంకర్ సిన్మాలవైపు ఆకర్షితుడయ్యాడు. మొదట్లో అందరిలాగానే సిన్మాలు చూసేవాడు కానీ వయస్సు వచ్చేకొద్దీ ఏదో బలమైన ఆకర్షణ




అతన్ని మరింతగా సిన్మాలవైపు ప్రభావితం చేసింది. ఇంటర్మీడియట్ చదువుతున్న కాలంనుంచే అతను సిన్మాలను ఎనలైజ్ చేయటం ప్రారంభించాడు. కథ, దర్శకత్వం, నటన ఇలా కాకుండా ఇంకోవిధంగా ఎందు కుండకూడదు. దాదాపుగా అన్ని సిన్మాలూ మూసలో పోసినట్లే ఎందుకుండాలి అనుకు నేవాడు. అదే విషయం తరచుగా స్నేహితు లతో చెప్పేవాడు.

"నువ్వు అలాంటి వెరైటీ సిన్మాలు తీద్దువు గానిలే" అనేవాళ్ళు స్నేహితులు హేళనగా.

విజయవాడలో డిగ్రీ చదువుతున్న సమ యంలో అతను విపరీతంగా సిన్మాలు చూసేవాడు. సంవత్సరాల తరబడి విస్తృ తంగా చదువుతున్న పాఠకుడికి దాంట్లోని డెప్త్ ఏవిధంగా అర్థమైపోతుందో అదేవి ధంగా విపరీతంగా సిన్మాలు చూసే శంక ర్‌కు ఆ సిన్మాల్లో ఎక్కువగా లోపాలు కన బడటం ప్రారంభమయ్యింది.

క్రియేటివిటీ అనేది గొప్ప దాహం. ఆ దాహం రోజురోజుకూ పెరిగేదే కానీ తీరేది కాదు.

శంకర్ బాగానే చదివేవాడు. ఫస్ట్‌క్లాస్ వచ్చేది. బాగా పుస్తకాలు చదివేవాడు, సిన్మాలు చూసేవాడు. విజయవాడలో చది విన మూడేళ్ల సమయంలో అతని లోకం విశాలం అయ్యింది. అది మరింతగా పెరిగే సమయంలో తిరిగి తన వూరికి రావాల్సిన పరిస్థితి వచ్చింది. పురుషోత్తమరావుకు ట్రాక్టర్‌మీదనుంచి పడటంతో కాలు విరి గింది. దాంతో శంకర్ విజయవాడ వదిలి వూరు చేరాడు.

ఈ మూడేళ్ల కాలంలో అతను కాంపిటీ టివ్ ఎగ్జామ్స్ రాస్తూనే వున్నాడు, కానీ ఫలి తంలేదు. అతని మనస్సు ఎప్పుడూ సిన్మాల చుట్టూ తిరుగుతూ వుంటుంది.

ఏనాటికయినా అద్భుతమైన సిన్మాలు తీయాలన్నది అతని జీవితాశయం.

తండ్రిమాత్రం ముందు పదవతరగతి చదువుతున్న కూతురు పెళ్ళి చేసేసి ఆ తర్వాత శంకర్‌కు కూడా పెళ్ళిచేసి వ్యవ సాయం అప్పగించి ప్రశాంతంగా కాలం గడ పాలని కోరుకుంటున్నాడు. తండ్రికి ఎదురు చెప్పేంత ధైర్యం అతనికి లేదు. అందుకే తల్లి దగ్గర గొణుగుతూ వుంటాడు. కొడుకు వ్యవసాయంలోకి దిగుతాడని తండ్రి ఆశ. తండ్రి తను సిటీ వెళ్ళేందుకు అంగీకరిస్తా డని కొడుకు ఆశ. ఈవిధంగా రెండు జన రేషన్లమధ్య ఆశలు, ఆశయాల గ్యాప్ గత మూడేళ్ళుగా కొనసాగుతూ వస్తోంది.



"ఏరా శంకర్ అట్లా వున్నావు? "

"ఏం లేదురా"

"నాకు తెలుసు. ఈ పల్లెటూర్లో బోర్ కొడుతోంది కదూ. సిన్మా డైరెక్టర్‌వి కావాల్సి నవాడిని బలవంతంగా పల్లెటూర్లో బంధిస్తే ఎలా వుంటుందో నాకు తెలుసులేరా"

నీళ్ళు నిండిన కళ్ళతో స్నేహితుడివంక చూశాడు శంకర్. ఎంత బాగా తనను అర్థంచేసుకున్నాడు? తల్లితండ్రులకు మాత్రం అర్థంకాదు. సూర్యోదయం, పొలాలు, వెన్నెల, సూర్యాస్తమయాలు ఇవన్నీ ఎంత అద్భుతంగా వుంటాయి? వీటన్నింటినీ తాను అద్భుతమైన

హ్యూమన్ డ్రామాతో ఏనాటికయినా తెర మీద కెమెరాతో చిత్రీకరించగలడా? తన కంత అదృష్టం వుందా?

"ఏరా మళ్ళీ ఆలోచనల్లో పడ్డావు?" శంకర్ స్నేహితుడు చందు అడిగాడు.

ఇద్దరూ వూరికి దూరంగా కాలవ బ్రిడ్జీ మీద కూర్చుని వున్నారు. సాయంత్రం ఐదు దాటుతుంది. సూర్యుడు పశ్చిమంవైపుగా కనుమరుగయ్యేందుకు సిద్ధమవుతున్నాడు. పంటపొలాలమీదనుంచి చల్లటి గాలి వీస్తోంది. పక్షులు గూళ్లవైపుగా సాగిపోతున్నాయి.

ఆ పల్లె వాతావరణం అంతా అద్భుతమైన పెయింటింగ్‌లా వుంది.

అతని మనస్సు మాత్రం సముద్రమంత అల్లకల్లోలంగా వుంది. లేవటం, తినటం, పడుకోవటం, అంతకంటే తను చేస్తున్నది ఏమైనా వుందా? తనలో నిరంతరం రగులుతున్న ఆశయాన్ని ఫలవంతం చేసుకునేందుకు తను ఏమైనా కృషి చేస్తున్నాడా? లేదు.

తన భావావేశం అంతా రాత్రిళ్ళు కలల రూపంలో వ్యక్తం అవుతూంది. అద్భుతమైన సిన్మాలు తీసినట్లు, అవార్డులు వచ్చినట్లు. వాస్తవంలోమటుకు ఈ పల్లెటూర్లో గోళ్లు గిల్లుకుంటూ గడుపుతున్నాడు. తల్లిదండ్రులు పిల్లల కోర్కెలను ఎందుకు అర్థం చేసుకోరు? వాళ్ళేం చెబితే అదే చేయాలి.

తన తండ్రి తనచేత వ్యవసాయం చేయించాలనుకుంటున్నాడు. తనకు వ్యవసాయం ఇష్టంలేదు. అందుకే తను భ్రష్టుడైపోయినట్లుగా తండ్రి బాధపడుతూ వుంటాడు. చెప్పులు కుట్టేవాడి కొడుకు కూడా చెప్పులే కుట్టుకోవాలంటే అబ్రహాంలింకన్ అమెరికా అధ్యక్షుడు అయివుండేవాడా?

"ఒరేయ్ శంకర్"

అతను ఆలోచనల్లోంచి తేరుకుని మిత్రుడివైపు చూశాడు.

"బాధపడొద్దురా... నువ్వు అనుకున్నది జరుగుతుంది"

"నాకు ఆ నమ్మకం లేదు. నా బతుకు ఈ వూర్లోనే ముగిసిపోతుంది" శంకర్ నిరాశగా అన్నాడు.

"పిచ్చోడా! నీ రాతలో వుంటే ఎవ్వరూ తప్పించలేరు"

"నేను తల రాతల్ని నమ్మను"

"పోనీ నీ స్నేహితుడి మాటలు నమ్ము" చందు ఓదార్పుగా అతని భుజంమీద చేయి వేశాడు.

"ఒరే శంకర్... మనందరం కల్సి చదువుకున్నాం. మాకు చదువు అబ్బలేదు. వ్యవసాయంలోకి దిగిపోయాం. కానీ నువ్వు గొప్పవాడివి అవుతావురా. ఆరోజు ఈ చందూగాడి మాటలు గుర్తుకొస్తాయి. నువ్వు ఈ వూరికే పేరు తెస్తావు. నిరాశపడమాకు"

శంకర్ కళ్ళు తడి అయ్యాయి.

ఏంటో ఈ మనుష్యులు అర్థంకాదు.

యన్‌టీఆర్, యస్వీరంగారావులకు మహానటులంటూ బ్రహ్మరథం పడతారు. కేవీ రెడ్డి, బాపు, ఆదుర్తి మహాదర్శకులని పొగడ్తల్లో ముంచెత్తుతారు. అదే తమ కొడుకు ఉత్సాహపడితే మాత్రం సిన్మా ఫీల్డు దరిద్రం, అక్కడున్నవాళ్ళంతా భ్రష్టులంటూ స్టేట్‌మెంట్ ఇస్తారు. ద్వంద్వప్రవృత్తికి ఇంతకంటే పరాకాష్ట ఏముంటుంది గనుక!

★ ★ ★

పది రోజులు గడిచిపోయాయి.

ఓరోజు మధ్యాహ్నంపూట చందు శంకర్ వాళ్ళ ఇంటికి వచ్చాడు. ఏదో పుస్తకం చదువుకుంటున్న శంకర్ చందును ఆహ్వానించాడు.

"ఏరా పొలం పోలేదా?"

"పోయి ఇపుడే వస్తున్నారా"

"ఎంట్రా మరి ఈ వేళప్పుడు వచ్చావు?"

చందు కూర్చున్నవాడు అటుఇటూ చూసి గొంతు తగ్గించి రహస్యం చెబుతున్నట్లుగా అన్నాడు.





"దేవీగాడు ఉత్తరం రాశాడు"

శంకర్ ఆ మాట వినగానే ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు "ఎవరూ... మన దేవీగాడేనా? "

"ఆ... వాడే... నీకే రాశాడు" అంటూ రహస్యంగా దాచుకున్న ఉత్తరం అందించాడు.

శంకర్ ఉత్తరం అందుకుని చదవటం ప్రారంభించాడు.

"డియరెస్ట్ శంకర్

మీరంతా బాగున్నారా? నేను చాలా బాగా వున్నాను. ఈమధ్యనే వెంకటేష్ సిన్మాకి అసిస్టెంట్ డైరెక్షన్ చేశాను. త్వరలో చిరంజీవి సినిమా ఆఫర్ రావచ్చు నువ్వు నాకు ఎన్నో ఉత్తరాలు రాస్తున్నావు. బిజీవల్ల సమాధానం రాయలేకపోయాను. ఇక్కడ సిన్మాఫీల్డులో కాంపిటీషన్ చాలా ఎక్కువగా వుంటుంది. నాలాంటి టాలెంట్ వున్నవాళ్లే ఎంతో కష్టపడుతున్నారు. నువ్వు డైరెక్షన్ ఫీల్డులోకి రావాలనుకుంటున్నట్లు రాశావు. నాలాంటి టాలెంట్ వున్నవాళ్ళే తట్టుకోలేకపోతున్నాం. నువ్వెలా తట్టుకుంటావో. సరే... ఒకే వూరివాళ్ళం కాబట్టి నాకు మనవాళ్ళంటే ఫీలింగ్ ఎక్కువ. ఎవరేం అడిగినా కాదనలేను. నువ్వు వెంటనే బయలుదేరివస్తే ఏ రాఘవేంద్రరావు దగ్గరో, రామ్‌గోపాల్‌వర్మ దగ్గరో చేర్పిస్తాను. నేను చెబితే వాళ్ళు కాదనలేరు. వాళ్లు నాకు చాలా క్లోజ్. నా అడ్రస్ కింద రాస్తున్నాను. వీలయినంత తొందరగా రాగలవు.

నీ ఫ్రెండ్
దేవీబాబు"

తన కళ్లను తానే నమ్మలేకపోయాడు శంకర్.

అణగారిపోతున్న ఆశలు మళ్ళీ ఒక్కసారిగా పురివిప్పుకున్నాయి. సంతోషంగా చందువైపు చూశాడు.

"ఇక్కడ కాదు. సాయంత్రం మాట్లాడుకుందాం. నేను వెళ్తొస్తాను" అంటూ చందు బయలుదేరాడు.

యాంత్రికంగా తల ఆడించాడే కానీ మనస్సంతా ఆ ఉత్తరంమీదే వుంది. మధ్యాహ్నం సాయంత్రం అయ్యేందుకు అసహనంగా నిరీక్షించసాగాడు.

★ ★ ★

శంకర్‌కు ఉత్తరం రాసిన దేవీబాబు శంకర్ వూరివాడే. శంకర్‌తోపాటు పదోతరగతివరకూ చదువుకున్నాడు. తల్లీతండ్రీ యాక్సిడెంట్‌లో మరణించటంతో వాళ్ళ మేనమామ వచ్చి దేవీబాబును పట్నం తీసుకుపోయాడు.

చాలా సంవత్సరాలవరకూ దేవీబాబు ఏమయ్యాడో, ఎక్కడున్నాడో ఎవ్వరికీ తెలీదు.

సంవత్సరం క్రితం శంకర్‌కు దేవీబాబు నుంచి మొదటిసారిగా ఉత్తరం వచ్చింది. బాల్యమిత్రుడినుంచి ఉత్తరం వచ్చిన ఆనందం ఓ వైపయితే మరో ఆనందం అతను సిన్మాఫీల్డులో వున్నాడని తెలియటం.

శంకర్ వెంటనే ఉత్తరం రాశాడు. అయితే రెండు నెలలవరకూ జవాబురాలేదు. శంకర్ చాలా నిరుత్సాహపడ్డాడు. అయితే ఒకరోజు మధ్యాహ్నం పోస్ట్‌మేన్ దేవీబాబు ఉత్తరం తెచ్చిచ్చాడు.

తను సిన్మాలకు అసిస్టెంట్ డైరెక్టర్‌గా పని చేస్తున్నాననీ చాలా బిజీగా వుంటాననీ అందుకే వెంటనే జవాబు రాయకపోతే వేరేగా భావించవద్దనీ ఉత్తరంలో రాశాడు.

దాంతో శంకర్ ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి.

తను కూడా సిన్మాల్లో డైరెక్షన్ శాఖలో చేరాలని తహతహలాడుతున్నాననీ తన ఫీలింగ్స్ గురించి వివరిస్తూ శంకర్ చాలా పెద్ద ఉత్తరం దేవీబాబుకు రాశాడు.

ఈవిధంగా ఇద్దరికీ మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు నడుస్తూ వుండేవి.

★ ★ ★

సాయంత్రమయ్యింది.

పశువులు ఇల్లు చేరుతున్నాయి. శంకర్, చందు ఇద్దరూ తాము తరచూ కలుసుకునే బ్రిడ్జీ దగ్గర సమావేశమయ్యారు. చందు బ్రిడ్జీ మీద కూర్చునివుంటే శంకర్ రెయిలింగ్‌కు ఆనుకుని నిలబడివున్నాడు.

"ఏం ఆలోచించుకున్నావురా? "

"అదే అర్థం కావటంలేదు"

"ఇందులో అర్థం కాకపోవటానికి ఏముందిరా. నీకు మంచి అవకాశం... రాఘవేంద్రరావు, రామ్‌గోపాల్‌వర్మ అంటే మాటలా ఏంటీ? సంవత్సరం తిరిగేసరికల్లా నువ్వు పెద్ద డైరెక్టరయిపోతావు"

"కానీ మా నాన్న పంపుతాడంటావా? " దిగులుగా అడిగాడు శంకర్.

"ఖచ్చితంగా పంపడు. మీ నాన్న పంపుతాడని నువ్వెట్లా అనుకుంటున్నావురా? "

"మరేం చెయ్యాలిరా? "

"నీకు ఎన్నేళ్లురా? "

అసంబద్ధమైన ఆ ప్రశ్నకు శంకర్ ఆశ్చర్యపోయాడు "ఇరవై మూడేళ్లు"

"ఇరవై మూడేళ్లొచ్చాయిగా మాలాగా పెళ్లి చేసుకుని వ్యవసాయంలోకి దిగిపోరాదూ!"

"చందూ"

"లేకపోతే ఏమిట్రా..." మందలిస్తున్నట్లుగా అన్నాడు చందు. ఇంత వయసొచ్చినా ఇంకా చిన్న పిల్లాడి మాదిరిగా మాట్లాడతావు. మా నాన్న పంపుతాడా అని అమాయకంగా అడుగుతావు. పంపేవాడైతే ఎప్పుడో పంపేవాడు. ఏదో ఒకటి గట్టిగా అనుకుని అడుగు ముందుకెయ్యి అంతేగానీ త్రిశంకు స్వర్గంలో బతకమాకు"

"నన్నేం చేయమంటావురా? "

"ఇంట్లోంచి పారిపో"

శంకర్ అదిరిపడ్డట్టుగా చందువైపు చూశాడు. "ఏమిట్రా నువ్వు చెప్పేది? "

"అవున్రా... నువ్వు ఈ వూర్లో వ్యవసాయం చేస్తూ బతకలేవు. నీ మనస్సుంతా సిన్మాఫీల్డుమీద వుంది. ఇన్నాళ్లకు నీకో అవకాశం వచ్చింది. ఇంకా ఎందుకు భయపడుతున్నావో నాకు అర్థం కావటంలేదు"

"భయంకాదురా... అమ్మానాన్నా, చెల్లిని వదిలిపెట్టి ఎట్లా వెళ్లను? "

"వెళ్లమాకు ఇక్కడే వుండిపో"

సమాధానం చెప్పలేనట్లుగా శంకర్ మౌనంగా వుండిపోయాడు.

చాలాకాలంగా అతను మథనపడుతూనే వున్నాడు. ఇన్నేళ్లు వచ్చినా కుటుంబానికి సాయపడకుండా తండ్రిమీద ఆధారపడి బతకటం అతనికీ కష్టంగానే వుంది. యాభై దాటుతున్నా కూడా ఆ వయసులో తండ్రి పడుతున్న కష్టం చూస్తుంటే బాధగా అన్పించేది. వాళ్లు మాత్రం ఏం కోరుకుంటున్నారు? ఉన్న ఒక్కగానొక్క కొడుకు తమ కళ్లముందే వుంటే చాలనుకుంటున్నారు. కానీ తను మాత్రం ఇక్కడ ఇమడలేకపోతున్నాడు.

ఏం చేయాలి? తండ్రి మాట వినాలా? తెగించి అడుగు ముందుకు వేయాలా? ఇలా ఎంతకాలం ఏమీ చేయకుండా కూర్చోటం? కలలుకంటూనే తను ముసలాడైపోతాడు. తను అందరిలాగ ఎందుకు వుండలేకపోతున్నాడు? అందరిలాగా ఎందుకు ఆలోచించలేకపోతున్నాడు? సుఖంగా ఇంటి పట్టున వుండక అందని ఆశల కోసం పాకులాడుతున్నాడా? కానీ వంటరిగా వున్నపుడు... రాత్రి మేడమీదకు చేరి చుక్కలవంక చూస్తున్నప్పుడు, సాయంత్రాలు ఏకాంతంగా ఊరి బైట కూర్చున్నపుడు... ఏదో దిగులు.. అదేంటో తెలీదు... కానీ ఏదో సాధించాలన్న తపన, ఆర్తి... ఈ ప్రపంచంలో సిన్మా అన్న ఒక్క విషయం తప్ప తనను ఏదీ ఆకర్షించలేకపోతోంది.

చాలాకాలం తర్వాత తనకు ఓ మంచి అవకాశం వచ్చింది. హైదరాబాద్ వెళ్లేందుకు తండ్రి ఎటువంటి పరిస్థితుల్లోనూ ఒప్పుకోడు. తను ఇక్కడ నిరంతరం కుళ్లిపోతూ జీవచ్ఛవంలా బతకలేడు.

స్నేహితుడిలో జరుగుతున్న అంతర్మథ





నాన్ని గమనించినట్లుగా చందు ఓదార్పుగా అతని భుజం తట్టాడు.

"ఒరే శంకర్... నేను నీ అంత చదువు కోలేదు. అసలు నాకు చదువు అబ్బిందే లేదు. నువ్వు మాత్రం కష్టపడి చదవకపో యినా మంచి మార్కులు తెచ్చుకునే వాడివి. అంటే నువ్వు ఒకసారి చదివితే చాలు గ్రహింపుకొచ్చేస్తుందన్నమాట. ఆ విధంగా చూస్తే నువ్వు మా అందరికంటే తెలివైనవాడివి. నువ్వు ఎక్కడున్నా రాణి స్తావు. నా మాట విని ఈ అవకాశం వదు లుకోకు. హైదరాబాద్ వెళుతున్నావా లేదా? "

"వెళతాను" శంకర్ స్థిరంగా అన్నాడు.

చందు ముఖం వికసించింది. "అదీ మొగోడి మాటంటే. మీ అమ్మానాన్న, చెల్లి నాలుగు రోజులు బాధపడతారు. నువ్వు ఇక్కడుండి వాళ్లనేం సంతోషపెట్టనపుడు నువ్వు అనుకున్న వైపుకెళ్లి గెలిచావనుకో వాళ్లకంటే సంతోషించేవాళ్లెవరుంటారు? నువ్వు పెద్ద డైరెక్టర్‌వయితే వాళ్లెంత సంతో షిస్తారో ఆలోచించు. నువ్వు హైదరాబాద్ వెళ్లరా... వెళ్లు..."

"కానీ"

"ఏంటో చెప్పరా? "

"హైదరాబాద్ వెళ్లటం అంటే..." బిడి యంతో పూర్తి చేయకుండా ఆపిన శంకర్ వంక చూసి నవ్వాడు చందు.

"డబ్బు సంగతేనా" అంటూ లుంగీ కాస్త పక్కకు జరిపి క్రింద వేసుకున్న నిక్కర్ లాంటి డ్రాయర్‌లోంచి నోట్లు బైటకు తీశాడు.

"రెండు వేలు మా నాన్నకు తెలీకుండా సేటు దగ్గర దాచుకున్నాను, తీసుకో" అతని కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఏం చేసి నీ ఋణం తీర్చుకోనురా చందూ"

"నిజంగా చేస్తావా? "

"చెప్పు తప్పకుండా చేస్తాను"

"నువ్వు పెద్ద డైరెక్టర్‌వి కాగానే నన్ను హీరోగా పెట్టి సిన్మా తీయి"

చాలాకాలం తర్వాత శంకర్ మనస్ఫూ ర్తిగా నవ్వాడు. "నువ్వు చేస్తున్న ఈ సాయం ఎప్పటికీ మర్చిపోలేను"

"సాయం ఏమిట్రా పిచ్చోడవా... నా స్నేహితుడు పెద్ద డైరెక్టర్ అని చెప్పుకుని మీసాలు మెలేసుకునేందుకు ఏమైనా చేస్తాను. నువ్వు మాత్రం మన వూరి పరువు కాపాడు"

"తప్పకుండా... ఆ విషయం ఎప్పుడూ మర్చిపోను"

"ఇంతకీ ఎపుడు బయలుదేరుతున్నావు హైదరాబాదు? "

"ఈ రోజు రాత్రికే" ఆ మాటలు అంటున్న సమయంలో అతని ముఖంలో దృఢ సంకల్పం తళుక్కున మెరిసింది.

★ ★ ★

సికిందరాబాద్ రైల్వేస్టేషన్...

మధ్యాహ్నం ఒంటిగంటవుతుంది. ఎండ దారుణంగా మాడ్చేస్తోంది. విజయవాడ నుంచి వచ్చిన శాతవాహనా ఎక్స్‌ప్రెస్ స్టేష న్‌లో ఆగింది. పది నిమిషాల తర్వాత శంకర్ స్టేషన్‌లోంచి బైటకు వచ్చాడు. భుజానికి చిన్న బ్యాగ్ వేలాడుతోంది. బైట ట్రాఫిక్ రణగొణధ్వనులతో గందరగోళంగా వుంది.

ఒక్కసారిగా ఆ వాతావరణం, మను ష్యులు, ట్రాఫిక్ చూసేసరికి అంతా కంగా రుగా అన్పించింది. అతనికి విజయవాడ తెలుసుకానీ హైదరాబాద్ తెలీదు. అదే మొదటిసారి రావటం.

రాత్రంతా నిద్రలేకపోవటం వల్ల కళ్లు మండుతున్నాయి. అర్ధరాత్రి ఇంట్లోంచి బయలుదేరి విజయవాడ చేరుకుని తెల్ల వార్లూ ఫ్లాట్‌ఫారం మీదే జాగారం చేసి ఐదున్నరకు శాతవాహనా ఎక్స్‌ప్రెస్ ఎక్కి సికింద్రాబాద్‌లో దిగాడు. ప్రయాణం



తాలూకు అలసట, కొత్త వాతావరణం, ఆకలి... అన్నింటికంటే ముఖ్యంగా బెంగ.

మొత్తానికి గంటన్నర తర్వాత కృష్ణానగర్‌లో సిటీ బస్సు దిగాడు. అడ్రస్ కాగితం దగ్గర పెట్టుకుని వెతకటం ప్రారంభించాడు. అరగంట తర్వాత పధ్నాలుగు మందిని అడిగిన తర్వాత ఆ అడ్రస్ దొరికింది.

రెండంతస్థుల పాత ఇల్లు. వెళ్లి తలుపు కొట్టాడు. నలభై ఏళ్ల స్త్రీ వచ్చి తలుపు తీసింది.

"ఎవరు కావాలి? "

"దేవీబాబు"

"దేవ్‌బాబా? "

అడ్రస్‌వున్న కాగితం ఆమెకు చూపించాడు. "ఆ ఇంటి నెంబరు ఇదే. నువ్వు అడిగేది నాలుగో వాటాలో వున్న దేవీ గురించా? "

"అవును... దేవీబాబు"

"దేవీనో దేవీబాబో కాని ఇప్పుడు లేడు"

"ఏమయ్యాడు? "

"నెలరోజుల కింద రూమ్ ఖాళీ చేశాడుగా... ఇక్కడెందుకుంటాడు? "

"ఖాళీ చేశాడా? "

"ఖాళీ చేయలా... రెండు నెల్లనుంచీ అద్దె ఇవ్వకపోయేసరికి మేమే ఖాళీ చేయించాం" అని చెప్పి ఆమె తలుపు వేసుకుంది.

నడుస్తూనడుస్తూ వుండగా ముందు దారి మాయమైపోయి అకస్మాత్తుగా ఓ పెద్ద అఘాతం ఎదురయినట్లుగా వుంది శంకర్‌కు. నీరసంగా ఇంటి ఎదురు మెట్లమీద కూర్చుండిపోయాడు.

విపరీతమైన ఎండ, కడుపులో ఆకలి, అలసట... ఏంచేయాలి? దేవీబాబు ఉత్తరాన్ని నమ్ముకుని తను ఇంట్లోంచి పారిపోయి వచ్చేశాడు. తను రావటమే ఆలస్యం అలా తీసుకెళ్లిపోయి ఏ రాఘవేంద్రరావు దగ్గరో రామ్‌గోపాల్ వర్మ దగ్గరో అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేర్పించేస్తాడనుకున్నాడు.

ఇంత పెద్ద మహానగరంలో దేవీబాబును ఎక్కడ వెతకాలి?

తను ముందుగా లెటర్ రాసి బయలుదేరాల్సింది. ఆత్రంతో ఉత్తరం రాగానే రైలెక్కేశాడు. దేవీబాబు ఈ పాత అడ్రసే ఎందుకు ఇచ్చాడు? కొత్త అడ్రస్ ఎందుకు ఇవ్వలేదు? పైగా రెండు నెలలనుంచీ అద్దె కట్టకపోతే ఖాళీ చేయించారంటుంది ఇంటి ఓనర్. తను ఇంటికి తిరిగి వెళితే తల్లీతండ్రి ఎంత అసహ్యించుకుంటారు? చందు ఎంత బాధపడతాడు?

ఎనిమిదేళ్ల క్రితం వూర్లో నుంచి వెళ్లిపోయిన దేవీబాబు తప్ప తనకు ఈ నగరంలో ఎవ్వరూ తెలీదు. ఎంత తప్పు చేశాడు తను? అతని మనస్సంతా దుఃఖంతో నిండిపోయింది.

ఎంతసేపు ఆవిధంగా ఆలోచనల్లో మునిగి వున్నాడోకానీ హఠాత్తుగా ఆ కంఠం విని తేరుకున్నాడు.

"ఇంకా ఇక్కడే కూర్చున్నావా? "

శంకర్ లేచి నిలబడ్డాడు. ఇంటి ఓనర్ ఎందుకో బయటకు వచ్చి మెట్లమీద శోష వచ్చి పడిపోయినట్లుగా కూర్చున్న అతన్ని చూసి ఆశ్చర్యంగా అడిగింది.

"ఏ ఊరుమీది? "

"విజయవాడ"

"దేవీ ఏమౌతాడు? "

"ఫ్రెండ్"

"దొంగ సచ్చినోడు రూమ్ మారుతున్న విషయం చెప్పలేదా? "

శంకర్ మౌనంగా వుండిపోయాడు.

"ఏం పనిమీదొచ్చినావు? సిన్మాల్లో వేషాలిప్పిస్తానన్నాడా? "

"లేదు... ఊరికే వచ్చాను"

ఆమె శంకర్‌వంక ఆశ్చర్యంగా చూసింది. ఆ వాలకం చూస్తుంటే శుద్ధ అమాయకుడని అర్థం చేసుకుంది. "ఊరకనే విజయవాడ నుంచి వచ్చినావా? ఆ దేవీగాడు కంత్రీ ముండాకొడుకు జాగ్రత్త"

దేవీబాబు మీద ఆమెకున్న అభిప్రా





యంతో తనకు సంబంధంలేదు. కానీ ఆ దేవీబాబు ఎక్కడున్నట్లు?

"ఇప్పుడేం చేస్తావు? ఎవరన్నా తెలిసినవా ళ్లున్నారా?"

శంకర్ తల అడ్డంగా వూపాడు.

"విజయవాడ తిరిగెళ్లిపోతావా?"

శంకర్ మళ్లీ మౌనాన్ని ఆశ్రయించాడు. ఏ ముఖం పెట్టుకుని తిరిగి వెళతాడు?

"నీ వాలకం చూస్తే ఇంట్లోంచి పారిపోయి వచ్చిన బాపతులాగుందే?"

అతను అదిరిపడి ఇంటి ఓనర్ వంక చూశాడు. లేడీ డిటెక్టివ్‌లా ఎంత కరెక్టుగా కనిపెట్టింది? అనుకున్నాడు మనసులో. ఆమె శంకర్‌వైపు చూసి చిద్విలాసంగా నవ్వింది. "ఇక్కడకు నూటికి తొంభైమంది ఇళ్లలోంచి పారిపోయే వస్తారు. చిరంజీవంత హీరో అయిపోదామనుకుంటారు. ఆఖరుకు బాబూరావు హోటల్లో కప్పులు కడుగుతారు. నిన్ను చూస్తుంటే అమాయకుడిలాగా వున్నావు. జాలేస్తోంది. నా మాట విని ఇంటికెళ్లిపో" అంది.

శంకర్ చెవులకు ఆమె చెబుతున్నదేమీ వినబడటంలేదు. దేవీబాబును ఎక్కడ వెతికి పట్టుకోవాలన్నదే జీవిత సమస్య అయిపోయింది.

ఇంతలో ఇంటిఓనర్ "ఓయ్ వలీ" అంటూ కేకేసింది.

రోడ్డుమీద నడుచుకుంటూ వెళుతున్న సన్నటి వ్యక్తి వెనక్కు తిరిగి చూశాడు "నన్నేనా?"

"నిన్నే ఇట్రా"

ఆ వ్యక్తి వాళ్లను సమీపించాడు. "ఏంటీ బంగారమ్మా పిలిచావు?" అన్నాడు.

"నీకు దేవీ తెల్సుగా?"

"ఏ దేవీ?"

"అదే మా ఇంట్లో ఆ వాటాలో వుండిపోయాడు. దేవీగాడు... వాడికోసం నువ్వొచ్చేవాడివిగా?"

"ఆ దేవీనా... తెలుసు... అయితే ఏంటీ?"

"వాడిరూము తెలుసా నీకు?"

"తెలీదు"

ఈ కుర్రాడెవరో విజయవాడ నుంచొచ్చాడు. వాడి రూము చూపించరాదూ పాపం"

"రూము నాకూ తెలీదు బంగారమ్మా" అని వలీ అనే వ్యక్తి శంకర్‌కేసి తేరిపారా చూశాడు. "దేవీ నీకేమౌతాడు?"

"ఫ్రెండ్"

"ఇంతకు ముందు హైదరాబాద్ వచ్చావా?"

"రాలేదండీ... ఇదే మొదటిసారి"

శంకర్ వంక చూస్తూనే అతను ఆలోచనల్లోపడ్డాడు. నిమిషం తర్వాత "ఆ గుర్తొచ్చింది... దేవీ వెంకటేశ్వరా ఆర్ట్స్ షూటింగ్‌లో వుండివుంటాడు"

పోయిన ప్రాణం లేచివచ్చినట్లయ్యింది. అమ్మ ఎంత చల్లటి వార్త చెప్పావు నాయనా వలీ అనుకున్నాడు మనసులో.

"అన్నపూర్ణా తెల్సుగా... డైరెక్టుగా ఆడకెళ్లిపో... దొరుకుతాడు"

'ఎంత సింపుల్‌గా చెప్పావు నాయనా వలీ! అన్నపూర్ణా దగ్గరకు నన్నెవరు రానిస్తారు?' మళ్లీ మనసులో అనుకున్నాడు. అతని మనసులో మాట గ్రహించినట్లుగా ఇంటి ఓనర్ బంగారమ్మే మళ్లీ ఆదుకుంది. "నాకు తెలీకడుగుతాను. నీకేమన్నా పిచ్చా ఏంటి వలీ? ఆ కుర్రాడికి వూరు కొత్త. ముఖం చూడు ఎలా బెదిరిపోతున్నాడో. కాస్త తీసుకెళ్లి చూపీరాదా పుణ్యాం వస్తుంది"

"పుణ్యాం ఎక్కువైపోయింది బంగారమ్మా! నేనేం చేసుకునేది" అంటూ జోకాడు వలీ అనబడే శాల్తీ. "అర్జంటు పనుందే... సర్లే పద తీసుకెళతా"

శంకర్ మనసులోనే బంగారమ్మకు దండం పెట్టుకున్నాడు "వెళ్లొస్తానండీ" అన్నాడు.

"జాగ్రత్తగా వెళ్లు. చూస్తుంటే అమాయకు



డిలాగా వున్నావు. వచ్చీచ్చి ఈ కంట్రీలో కంలో పడ్డావు. జాగ్రత్త" అంది సానుభూతిగా.

బుద్ధిగా తల ఆడించి దేవీబాబును కలుసుకునేందుకు వలీ వెంట బయలుదేరాడు శంకర్.

"ఆర్టిస్ట్ అవుదామని వచ్చావా? "

"నాకు బొమ్మలేయటం రాదండీ"

వలీ ఫెళ్లున నవ్వాడు... "ఆర్టిస్ట్ అంటే బొమ్మలు వేసేవాడు కాదయ్యా! సిన్మాల్లో వేషాలు వేసేవాళ్లను ఆర్టిస్టులంటారు. ఇంతకీ దేవీతో ఏమిటంత అర్జంటు పని? "

చెబుదామా వద్దా అని తటపటాయించాడు. వాళ్లిద్దరూ ఎక్కిన ఆటో అన్నపూర్ణా స్టూడియో వైపుగా వెళుతోంది. వాస్తవానికి కొంచెం నడిచి అడ్డదారిలో స్టూడియో చేరుకోవచ్చు. కానీ తనది కాకపోతే రామేశ్వరం దాకా దేకమన్నాడట ఎవరో... వలీ అనే బడే శాల్తీ ఆ టైపు కాబట్టి ఆటో ఎక్కించాడు.

"ఏంటీ ఆలోచనల్లో పడ్డావు. సీక్రేట్ అయితే చెప్పొద్దులే"

"అబ్బే ఇందులో సీక్రేట్ ఏముందండీ... దేవీ నన్ను డైరక్షన్‌లో చేర్పిస్తానన్నాడు"

"డైరక్షన్‌లోనా? "

"అవును. రాఘవేంద్రరావు లేకపోతే రామ్‌గోపాల్‌వర్మ దగ్గరన్నా డైరెక్షన్‌లో చేర్పిస్తానన్నాడు"

"ఎవరి దగ్గరన్నావూ? "

"రాఘవేంద్రరావండీ. 'జగదేకవీరుడు అతిలోక సుందరి' తీయలా ఆయన దగ్గర. వీలుకాకపోతే 'శివ' సిన్మా డైరెక్ట్ చేసిన రామ్‌గోపాల్‌వర్మ దగ్గర..."

"వాళ్లిద్దరూ వీడికి తెలుసంటనా? "

"చాలా బాగా తెలుసంటండీ"

"వాళ్లు అందరికీ తెలుసులే. వీడు వాళ్లకి తెలుసంటా? "

ఆ ప్రశ్నలోని అంతరార్థం తెలీని శంకర్ అతనివైపు అయోమయంగా చూశాడు. దాన్ని పట్టించుకోకుండా వలీ మళ్లీ అడిగాడు.

"దేవీ ఏం చేస్తాడో నీకు తెలుసా? "

"తెలుసండీ... అసిస్టెంట్ డైరెక్టర్. మొన్నే వెంకటేష్ సిన్మా చేశాడంట కదండీ"

"అట్టాగా..." పొడిగా అని వూరుకున్నాడు వలీ.

ఆటో అన్నపూర్ణా స్టూడియో ముందు ఆగింది. ఇద్దరూ కిందకు దిగారు. డబ్బులిచ్చేయమన్నట్లు వలీ సైగ చేశాడు. శంకర్ మీటర్ చూసి ఆటో డబ్బులిచ్చేశాడు.

వలీ వెళ్లి సెక్యూరిటీ వాళ్లతో ఏదో మాట్లాడాడు. తర్వాత శంకర్ దగ్గరకు వచ్చి "పద... వెళదాం" అన్నాడు.

విశాలమైన రోడ్డుకు ఇరువైపులా చెట్లు, ఓ వైపు పచ్చటిలాన్... ఇంకా ముందుకు వెళితే అద్దాలతో కట్టిన నిర్మాణం...ఎత్తైన కొండమీద వుండటంవల్ల గాలి చల్లగా వీస్తోంది. పైనుంచి సిటీ చిన్న బొమ్మరిల్లులా కన్పిస్తోంది.

ఆ వాతావరణంలోనే అదోలాంటి మత్తు వుంది.

"సార్"

ముందుగా నడుస్తున్న వలీ ఆగాడు. "ఏంటీ? "

"ఇది అక్కినేని నాగేశ్వరరావుగారిదా? "

"అవును... ఏం అలా అడిగావు? "

"ఆయన కన్పిస్తారా? " అతని కంఠంలో ఆశ తొంగి చూసింది.

"ఆయన ఇక్కడెందుకుంటారు? ప్రొద్దున్న వస్తారనుకుంటాను. నాకూ సరిగ్గా తెలీదు"

వాళ్లు ఇంకొంచెం ముందుకు వెళ్లగానే షూటింగ్ సందడి ఎదురయ్యింది. చాలా మంది జనం... లైట్లు, రిఫ్లెక్టర్స్, ట్రాలీక్రేన్, నీడకోసం పాతిన పెద్ద గొడుగులూ, కుర్చీలు, అరుపులూ, విజిల్ సౌండ్స్, దూరంగా ఎక్కడినుంచో నడుస్తున్న జనరేటర్ సౌండ్, కేబుల్‌వైర్స్, హడావుడిగా తిరుగుతున్న జనం అంతా కోలాహలంలా





తిరునాళ్లు జరుగుతున్నంత సందడిగా వుంది.

ఒక్కసారిగా శంకర్ ఒళ్లు ఉప్పొంగింది.

తన ప్రపంచంలోకి వచ్చేశాడు. తను కల లుకన్న లోకంలోకి ప్రవేశించాడు. ఇక్కడే నా జీవితం. . దృఢంగా మనసులో అనుకున్నాడు.

ఏదో ట్రాన్స్‌లో వున్నట్లుగా అటే చూస్తుండిపోయాడు.

లవ్ సన్నివేశం చిత్రీకరణ జరుగుతోంది. జగపతిబాబు, రచనలకు క్యాప్ పెట్టుకున్న ఓ వ్యక్తి సన్నివేశాన్ని వివరిస్తున్నాడు.

ఆ డైరెక్టర్ ఎవరన్నది ఎంత ఆలోచించినా గుర్తుకు రావటంలేదు.

నలభైనిమిషాలు పట్టింది ఆ షాట్ తీయటానికి.

ఆరో టేక్ ఓకే అయింది. 'ఇంత కష్టపడతారన్నమాట' అనుకున్నాడు. తాము ఐదు రూపాయలు పెట్టి టిక్కెట్ కొని లక్షాతొంభై కామెంట్స్ చేస్తారు. ఓ షాట్ కోసమే ఇంత కష్టమైతే మొత్తం సిన్మా తీయటం అంటే మాటలు కాదు.

ఈలోగా టీ బ్రేక్ ఇచ్చాడు. హీరోయిన్ జ్యూస్ తాగుతోంది. జగపతిబాబు ఛాంబర్‌లో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఆయన ఎవరో గుర్తుకురావటం లేదు కానీ తరచూ సినిమా పత్రికలో చూసే ముఖమే.

"దేవీని చూశావా?"

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు శంకర్. వలీ అడుగుతున్నాడు "దేవీని పిలవనా?"

"ఎక్కడ?"

"అదిగో చూడు. వెళుతున్నాడుగా..."

వలీ చూపించిన వైపు చూశాడు. సన్నగా వున్న కుర్రాడు భారంగా నడుస్తూ వెళుతున్నాడు. అతని భుజంమీద బరువైన డేలైట్ వుంది.

తర్వాత షాట్ తీయబోతున్న స్పాట్ దగ్గరకు దాన్ని మోసుకెళుతున్నాడు.

శంకర్ అయోమయంగా వలీవైపు చూశాడు.

"దేవీబాబా?"

"అవును దేవీనే. నీ ఫ్రెండ్‌ను గుర్తుపట్టలేదా?"

"లైటు మోస్తున్నాడేంటీ తాను డైరెక్టర్ కదా?"

"డైరెక్టరా? ఏ సిన్మాకి డైరెక్టర్ బాబూ! టైటానిక్కా, కుచ్‌కుచ్ హోతాహైనా?"

"డైరెక్టరంటే... అసిస్టెంట్ డైరెక్టర్‌కదా?"

"దేవీగాడు అసిస్టెంట్ డైరెక్టరా?" వలీ ఫెళ్ళున నవ్వాడు. "వాడూ, నేనూ లైట్ బాయ్స్. లైట్‌బాయ్ అంటే లైట్లే మోస్తారు."

"దేవీబాబు లైట్‌బాయా? అసిస్టెంట్ డైరక్టర్ కాదా?" దిగ్భ్రాంతిగా అడిగాడు శంకర్.

మళ్ళీ కళ్లు గిర్రున తిరుగుతున్న ఫీలింగ్ మొదలయ్యింది.

తలలో హోరుమనే బ్రహ్మాండమైన శబ్దం... యుద్ధవిమానాలు ఎగురుతున్నట్లుగా.

కళ్ళముందున్న స్టూడియో మాయం అయిపోయి పెద్ద అఘాతం ప్రత్యక్షమయ్యింది.

అతను అఘాతం అంచున నిలబడివున్నాడు.

చుట్టూ మనుష్యులు... రకరకాల జంతువుల మాస్కులు ధరించివున్నారు. కోతి, నక్క, చింపాంజీ, ఎలుగ్గొడ్డు ముఖాలు పెట్టుకుని నవ్వుతున్నారు. హేళన చేస్తున్నారు. పరిహసిస్తున్నారు.

"హల్లో..." వలీ భుజాలు పట్టి కుదపటంతో మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాడు.

"ఏంటీ షాకైపోయావా?"

"దేవీబాబు నిజంగానే లైట్‌బాయా? మీరు జోక్ చేయటం లేదుకదా?"

వలీ ముఖం ముడుచుకుపోయింది. "నీతో జోకులేంటి? దేవీగాడినే పిలుస్తాను.

వాడినే అడుగు..." అంటూ "దేవీ ఇట్రా..." అని కేకేశాడు.

లైటు దింపేసి రిఫ్లెక్టర్ మోసుకువెళు తున్న ఆ సన్నటి కుర్రవాడు వీళ్ళను సమీపించాడు. ఐదున్నర అడుగులు, నల్లగా వున్నాడు. జీన్స్ టీషర్టు, కాళ్ళకు చౌకబారు షూస్... మెడలో నల్లటి రంగుతాళ్లు. కళ్లలో నిర్లక్ష్యం.

"ఏంటి వలీ? "

"నీ కోసం ఎవరొచ్చారో చూడు..."

"ఎవరూ? "

ఎనిమిది సంవత్సరాల క్రితం వాళ్ళిద్దరూ ఆ పల్లెటూళ్ళో విడిపోయారు. యవ్వనం ఎన్నో మార్పులు తెస్తుంది కాబట్టి పోల్చుకోవడం కష్టం.

"ఎవరు వలీ? " మళ్ళీ అడిగాడు.

"శంకరంట"

"శంకరా? "

"విజయవాడనుంచి వచ్చాడంట నీ ఫ్రెండ్ శంకర్..."

అర్థం కానట్లుగా చూస్తున్న దేవీ ముఖం విప్పారింది. ఏవో గతస్మృతులు చకచకా కదలాడాయి. "నువ్వు... నువ్వు శంకరా? "

శంకర్ తలవూపాడు.

"ఎప్పుడొచ్చావు? "

"మధ్యాహ్నం వచ్చాడు. నీ పాత రూమ్ కెళితే మీ మాజీ ఓనరమ్మ నాకు అప్పచెప్పింది. మొన్న చెప్పావుగా అన్నపూర్ణాలో అని. గుర్తుంది. అందుకే డైరెక్టుగా ఇక్కడికే తెచ్చేశాను"

"మంచి పన్జేశావురా వలీ..."

శంకర్ కన్నార్పకుండా అతన్నే చూస్తుండిపోయాడు. ఎండల్లో తిరగటంవల్ల చర్మం బాగా నల్లబారింది. వంటిమీద చెమటతో టీషర్టు తడిచివుంది. దవడలు ఆడిస్తున్నాడు. బహుశా గుట్కాలాంటిది నములుతుండవచ్చు. భుజంమీద రిఫ్లెక్టర్, కళ్లలో నిర్లక్ష్యంలాంటి పొగరు.

"వుంటున్నావుగా? "

అర్జంటుగా రమ్మని ఉత్తరం రాసి వుంటున్నావుగా అంటే ఏం సమాధానం చెప్పగలడు? నిన్ను నమ్ముకుని ఇంట్లోంచి పారిపోయివచ్చాను. నువ్వేమో లైట్లు మోస్తున్నావు అని ఏం చెప్పగలడు?

శంకర్ ఏదో సమాధానం చెప్పేలోగా వెనకనుంచి ఎవరో పెద్దగా అరిచారు. "ఒరేయ్ దేవీగా... మీటింగులేంట్రా కొడకా... రారా నీయమ్మా..."

"బాస్ పిలుస్తున్నాడు. ఇక్కడే వుండు. షూటింగైపోయాక మాట్లాడుకుందాం..." అనేసి రిఫ్లెక్టర్ భుజానేసుకుని పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు దేవీబాబు.

అటే చూస్తుండిపోయాడు శంకర్.

ఎవరో లావుపాటి వ్యక్తి దేవీబాబుని తిడుతున్నాడు. అతను వినయంగా నవ్వుతూనే సమాధానం చెబుతున్నాడు. రిఫ్లెక్టర్ దింపేసి ఇంకోలైట్ భుజానేసుకుని పరుగులు పెడుతున్నాడు.

శంకర్‌కు భరించలేనంత నిస్పృహ కలిగింది.

రాఘవేంద్రరావు, రామ్‌గోపాల్ వర్మల దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేర్పిస్తాను వచ్చేయ్ అంటూ లెటర్స్ రాసిన దేవీబాబు ఓ లైట్‌బాయ్. అతని స్థాయి ఏమిటన్నది ప్రత్యక్షంగా కళ్ళముందు కన్పిస్తూనే వుంది.

అతన్ని నమ్ముకుని పెద్ద డైరెక్టరయిపోదామని ఇంట్లోంచి పారిపోయి వచ్చాడు చూడూ తను. చెప్పుకు పేడరాసి కొట్టాలి. తను ఏమయిపోతున్నాడు? భయంతో వళ్లు జలదరించింది.

"హ్హిహ్హిహ్హి... డైరక్టరయిపోతాడంట" మళ్ళీ వికృతధ్వనులు చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి.

★ ★ ★

సాయంత్రం ఏడు గంటలవుతుంది.

సిటీ మేకప్ చేసుకున్న సానిలా మెరిసిపోతోంది. స్టూడియోనుంచి ఇద్దరూ అడ్డదారిలో కిందకు దిగారు. ఈ మాత్రం దానికి

'వలీ' తనను ఆటోలో చుట్టూ తిప్పి తెచ్చాడని అర్థమయ్యింది. దేవీబాబు అడుగుతున్న ప్రశ్నలకు అన్యమనస్కంగా సమాధానాలు చెబుతున్నాడు. కానీ మనస్సంతా తీవ్ర ఆందోళనతో నిండివుంది.

ఏవో షాపులముందు ఆగి దేవీబాబు రకరకాల సరంజామా కొన్నాడు. ఆ తర్వాత సందుగొందులు తిప్పి తన రూమ్‌కు తీసుకువెళ్ళాడు.

రూమంటే పాతకాలపు ఇంటిమీద నాలుగురేకులు వేసిన రేకులషెడ్డు... లోపలకు ప్రవేశించిన తర్వాత పెద్దగా సామాన్లు ఏవీ కన్పించలేదు. పాతచాప, దుప్పటి, దిండు, గోడకు వేలాడుతున్న అర్ధనగ్న సుందరీమణుల కాలెండర్లు, ఓ కుండ, గ్లాసు, దండెం మీద అస్తవ్యస్తంగా పడివున్న రెండు మూడు జతల బట్టలు, రూమంతా దొర్లుతున్న మినరల్‌వాటర్ బాటిల్స్, సిగరెట్ పీకలు... పెద్దగా పిండిమిల్లులా శబ్దం చేస్తూ తిరుగుతున్న సీలింగ్‌ఫ్యాన్.

"రూమ్ బాగుందా? "

బాగుందన్నట్లుగా తల వూపాడు.

"సిటీలో ఈమాత్రం దొరకటమే గొప్ప. స్నానం చేస్తావా? "

చేస్తానన్నట్లుగా తలవూపాడు.

అరబక్కెట్టు నీళ్ళతో స్నానం ముగించాడు. ఊరిలో గాబు దగ్గర తనివితీరా చేసే స్నానం గుర్తుకువచ్చింది. ఈలోగా దేవీబాబు కూడా స్నానం అనే కార్యక్రమం పూర్తిచేసివచ్చాడు. లుంగీ కట్టుకుని చాపపరిచి తాను కొనితెచ్చిన సరంజామా అంతా బైటకు తీశాడు. శంకర్‌కు విషయం అర్థమైంది. రెండు గ్లాసుల్లో ఆ ద్రవాన్ని వంపి సోడా కలిపి అన్నాడు.

"తీసుకో..."

"వద్దు..."

"ఏం? "

"నాకు అలవాటులేదు"

ప్రపంచంలోని ఎనిమిదో వింతను చూస్తున్నంత ఆశ్చర్యంగా చూశాడు. "నిజంగానే అలవాటు లేదా? "

"లేదు"

"లైట్‌గా ఓ పెగ్గు తీసుకో పర్లేదు"

"వద్దు"

"పోనీ బీరు తాగుతావా? తెప్పించనా? "

"వద్దు..."

"బీరు కూడా తీసుకోవా నువ్వు? "

"అవును"

"ఈ రోజుల్లో కూడా నీలాంటివాడున్నాడా? "

శంకర్ మౌనంగా వుండిపోయాడు.

విపరీతమైన అలసట, నీరసం, కళ్ళు మూసుకుంటే చాలు వచ్చేస్తానంటున్న నిద్రాదేవత...కడుపులో ఆకలి... అన్నింటికంటే ముఖ్యంగా కంపరం తెప్పిస్తున్న వాతావరణం.

"మన ఊరిలో వుండి నువ్వు పాడయిపోయావని అర్థం అవుతోంది. నాకు తెలీక అడుగుతాను. ఇంతవరకూ నువ్వు మందు కొట్టలేదా? "

"ఒక్క చుక్క కూడా తాగలేదు"

"సారీ భయ్యా... నేనుండలేను. ఛీర్స్" అంటూ తన గ్లాసు ఎత్తిపట్టుకుని గటగటమంటూ తాగేశాడు. మళ్ళీ గ్లాసు నింపుకున్నాడు.

పొట్లాలు విప్పాడు. మిక్చర్, చేగోడీలు శంకర్ ముందుపెట్టి-"ఇవైనా తింటావుగా" అన్నాడు.

"వద్దు" అందామనుకుని మరీ బాగుండదని రెండు చేగోడీలు అందుకున్నాడు.

"ఇప్పుడు చెప్పు మన వూరెలా వుంది? "

"బాగుంది"

"చందూగాడు బాగున్నాడా? "

"ఆ... బాగున్నాడు"

"మీవాళ్ళు ఎలా వున్నారు? "

"బానేవున్నారు"

"ఏంటీ వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను. అదోలా వున్నావు. కొంపదీసి లవ్‌లో

ఫెయిలా? "
"అదేంలేదు..."
"అంటే ఎవర్నీ లవ్ చేయలేదా? "
"లేదు"
"ఇంత వయస్సొచ్చినా ఇంకా ఎవర్నీ లవ్ చేయలేదా? పోనీ ఐశ్వర్యారాయ్‌నో, ప్రీతి జింతానో కూడా లవ్ చేయలేదా? "
శంకర్ ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు. ఏం మాట్లాడుతున్నాడు? మందు ఎక్కువయిపోయి పిచ్చివాగుడు వాగుతున్నాడా ఏమిటీ అనుకున్నాడు. చాలామంది రెండు పెగ్గులు కడుపులోకి వెళ్ళగానే లింకులు లేని సంభాషణ మొదలుపెడతారన్నంత పరిజ్ఞానం అతనికి లేదు.
చేగోడీలు తింటూ మౌనంగా దేవీబాబు వంకే చూడసాగాడు. అతను రెండో క్వార్టర్ బాటిల్ తెరిచి ఓపెన్‌గ్లాసులో పోసుకుని సోడా కలుపుకున్నాడు. సగం తాగిన తర్వాత మళ్ళీ మొదలుపెట్టాడు.
"నువ్వు మందు తాగకపోవటం ఏమిటి భయ్యా? "
"నేను మందు తాగటం కోసం హైదరాబాద్ రాలేదు"
"పోన్లే ఏదో పనిమీదొచ్చావు. ఫ్రెండ్ వస్తే ఈ మాత్రం మర్యాదన్నా చెయ్యాలిగా భయ్యా"
"దీన్ని మర్యాద అంటారా? "
"ఏంటి భయ్యా సీరియస్‌గా వున్నావు? "
ఇక కంట్రోల్ చేసుకోవటం అతనివల్ల కాలేదు.
"నువ్వు నిజంగానే అమాయకుడివో, లేకపోతే అమాయకత్వం నటిస్తున్నావో నాకు తెలీదు దేవీబాబు. చిన్నప్పుడు విడిపోయిన బాల్యమిత్రుడి దగ్గరనుంచి లెటర్ వచ్చేసరికి నేను ఎంతో సంతోషించాను. ఆ మిత్రుడి మాటలు నమ్మి ఇంట్లోంచి పారిపోయివచ్చాను. నా అంత మూర్ఖుడు ఈ ప్రపంచంలో ఎవరూ వుండరు"

"ఏమిటీ నువ్వు ఇంట్లోంచి పారిపోయి వచ్చావా? "
"అవును... నీ కారణంగానే..."
"నేను ఇంట్లోంచి పారిపోయి రమ్మని చెప్పానా నీకు? "
"నన్ను డైరెక్షన్‌లో చేరుస్తానని ఉత్తరం రాశావా? లేదా? "
"నేను ఉత్తరం రాశానా? "
శంకర్ లేచివెళ్ళి బ్యాగ్‌లోంచి ఉత్తరం తీసి చూపించాడు. దేవీబాబు చాలాసేపు ఆ ఉత్తరం చదువుకున్నాడు. ఉన్నట్లుండి హఠాత్తుగా ఏడవటం ప్రారంభించాడు.
శంకర్ కంగారుపడ్డాడు.. ఇప్పటిదాకా బాగానే వున్నవాడు అంత అకస్మాత్తుగా ఎందుకు ఏడుస్తున్నదీ అర్థంకాలేదు. ఆల్కహాల్ తాలూకు మరో డైమన్షన్ తెలీదు కాబట్టి దేవీబాబును ఓదార్చే ప్రయత్నం చేశాడు.
"ఊరుకో దేవీ... ఎందుకు ఏడుస్తున్నావు... ఊరుకో"
"నా అంత దుర్మార్గుడు ఈ ప్రపంచంలో వుండడు శంకర్ భయ్యా"
ఆ పరిస్థితిలోనూ శంకర్ ఆశ్చర్యపోయాడు. తాగితే అంతా నిజమే మాట్లాడతారన్న విషయం విన్నాడేగానీ ఇప్పుడు దేవీబాబును చూస్తే అర్థమవుతుంది. తన మనసులో ఏదైతే అనుకుంటున్నాడో దాన్నే దేవీబాబు చెప్పటం మందు మహత్యమని అర్థమయ్యింది.
"నేను అనాధనైపోయాను శంకర్ భయ్యా... చిన్నప్పుడే అమ్మానాన్నా చచ్చిపోయారు. మామయ్య నన్ను తీసుకుని హైదరాబాద్ వచ్చాడు. కొన్నిరోజులకు అత్తయ్య కూడా చచ్చిపోయింది. మామయ్యకు నేను, నాకు మామయ్య తప్ప ఈ ప్రపంచంలో ఎవ్వరూ లేకుండాపోయారు. మామయ్య ప్రొడక్షన్ మేనేజర్ దగ్గర అసిస్టెంట్. ఆరునెలలకింద మామయ్య కూడా చచ్చిపోయాడు. నేను అనాధనైపోయాను. మామయ్య చచ్చిపోయాక నేను తాగటం




ఎక్కువైపోయింది. తాగినప్పుడల్లా నాకు అమ్మానాన్నా, మన వూరు గుర్తుకువస్తుంది. ఆ బాధ మర్చిపోయేందుకు నీకు ఉత్తరాలు రాసేవాడిని. తాగుడు మత్తులో ఏం రాసేవాడినో, ఎన్ని ఉత్తరాలు రాశానో నాకు గుర్తేలేదు. నువ్వు ఈ ఉత్తరం చూపించేంతవరకూ నాకు ఉత్తరం రాసిన సంగతే గుర్తుకులేదు. నన్ను క్షమించు శంకర్ భయ్యా" అంటూ భోరుమంటూ ఏడవటం ప్రారంభించాడు.

శంకర్‌కు ఒక్కసారిగా జాలి కలిగింది.

దేవీబాబును కలిసినప్పటినుంచీ అతను అసహ్యించుకుంటూనే వున్నాడు. తనకు ఆశ కల్గించే ఉత్తరాలు రాసి ఇంట్లోంచి పారిపోయి వచ్చేలా ప్రేరేపించి తన రూమ్ కరెక్ట్ అడ్రస్ ఇవ్వకుండా ఇబ్బంది పెట్టి, అసిస్టెంట్ డైరెక్టరని అబద్ధం చెప్పి ఆఖరుగా నేనెక్కడ ఉత్తరం రాశాను? అని ప్రశ్నించేసరికి పీక పిసికి చంపేయాలన్నంత కోపం వచ్చింది. కానీ మామయ్య చచ్చిపోయిన దుఃఖంలో ఓదార్పుకోసం ఉత్తరాలు రాసేవాడన్న విషయం. అది కూడా మందు మత్తులో రాసేవాడన్న విషయం తెలిసేసరికి అతనిమీద జాలి కలిగింది.

"జరిగిందేదో జరిగింది ఊరుకో దేవీ..." అన్నాడు సానుభూతిగా.

"లేదు భయ్యా... నా అంతటి నీచుడు ఎవడూ వుండడు" అంటూ మరో ఐదు నిమిషాలపాటు తననుతాను ఘోరంగా తిట్టుకున్నాడు మధ్యమధ్యలో తాగుతూనే వున్నాడు.

"ఓ విషయం అడిగితే కోపం రాదుగా దేవీ నీకు? "

"కోపం దేనికి అడుగు భయ్యా..."

"అసిస్టెంట్ డైరెక్టర్ అని నాకు అబద్ధం ఎందుకు చెప్పావు? "

"నీ ఫ్రెండ్ లైట్‌బాయ్ అని చెప్పుకోవటానికి సిగ్గుగా వుందా భయ్యా? "

"ఛఛ... అదేంలేదు. స్నేహానికి స్థాయితో సంబంధం లేదు. నువ్వు లైట్‌బాయ్ అయినా కూడా నా ఫ్రెండ్‌వే కానీ నాతో అబద్ధం చెప్పటమే నన్ను బాధిస్తోంది"

దేవీబాబు నవ్వాడు.

శంకర్ అతని వంక ఆశ్చర్యంగా చూశాడు. ఇప్పటిదాకా ఏడ్చాడు. మళ్ళీ అంతలోనే నవ్వుతున్నాడు. ఇదంతా మందు తాలూకు మహత్యం కాబోలు!

"చూడు శంకర్ భయ్యా... నేను నీకు అబద్ధం చెప్పినమాట వాస్తవమే. నేను ఓ లైట్‌బాయ్‌ని అయినా కూడా అసిస్టెంట్ డైరెక్టరని అబద్ధం చెప్పాను. ఎందుకు చెప్పానో తెలుసా! ఉదాహరణకు అమెరికా వెళ్ళేవాళ్ళ సంగతే తీసుకో. అష్టకష్టాలుపడి అప్పులుచేసి డాలర్లు సంపాదించి కోటీశ్వరులైపోదామని అమెరికా వెళతారు. అక్కడ ఉద్యోగం దొరకదు. ఏం చేస్తారు చెప్పు. తప్పదు కాబట్టి పెట్రోలు బంకుల్లో పెట్రోల్ కొడతారు. రెస్టారెంట్లలో పనిచేస్తారు. పార్ట్‌టైమ్ ఉద్యోగాలు చాలా చేస్తూ బతుకుతుంటారు. కానీ వాళ్ళు ఇండియాలో వుండేవాళ్ళకు ఏం చెబుతారనుకున్నావు. పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ ఉద్యోగమని చెబుతారు. ఇక్కడ వాళ్ళ తల్లిదండ్రులు, బంధువులు 'ఆహా! మావాడు అమెరికాలో పెద్ద ఇంజనీర్' అని మురిసిపోతూ డబ్బాలు కొట్టుకుంటారు. లక్షల కట్నం వచ్చే పెళ్ళి సంబంధాలు వెతుకుతుంటారు. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే స్వంత వూరు వదిలిపెట్టి వెళ్ళినవాడు తాను గొప్పవాడయిపోయానని తన వూరివాళ్ళను నమ్మించేందుకు ప్రయత్నిస్తాడు. నేను లైట్‌బాయ్‌గా బతుకుతున్నానని తెలిస్తే మన వూర్లో విలువ వుంటుందా? అందుకే అసిస్టెంట్ డైరెక్టరని ఉత్తరాల్లో రాస్తుంటాను. కానీ ఎప్పటికయినా నేను కూడా మణిరత్నం అంత పెద్ద డైరెక్టరయితీరుతాను..."

దేవీబాబు విశ్లేషణకు నవ్వాలో ఏడవాలో అతనికి అర్థం కాలేదు. ఎంతో సింపుల్‌గా

తననుతాను సమర్థించేసుకున్నాడు. పైగా మణిరత్నం అంత పెద్ద డైరెక్టర్ అయిపోతానని నమ్ముతున్నాడు.

"నన్నేం చేయమంటావు దేవీ? "

"నాతోపాటే వుండు. కృష్ణారెడ్డి దగ్గరో, కోదండరామిరెడ్డి దగ్గరో చేరుదువుగానీ..."

"వాళ్ళు నీకు తెలుసా? " సందేహం వ్యక్తం చేశాడు శంకర్.

"వాళ్లు నాకు తెలియక్కర్లేదు. వాళ్ళకు తెల్సినవాళ్ళు నాకు తెలుసు. నువ్వేం భయపడకు. ఆ సంగతి నేను చూసుకుంటాను. ఇదిగో ఈ బిర్యానీ తిను..." అంటూ పాకెట్ తెరిచాడు.

శంకర్ బిర్యానీ తింటూవుండగా దేవీబాబు మరో గంటసేపు నాన్‌స్టాప్‌గా మాట్లాడాడు. శంకర్ వింటూనే వున్నాడు.

మరో గంటన్నర గడిచింది.

బాగా అలసిపోయిన శంకర్ గోడకు అనుకునే నిద్రలోకి జారిపోయాడు. దేవీబాబు అర్థరాత్రిదాకా తాగుతూనే వున్నాడు. ఆ తర్వాత ఎప్పుడో మత్తు తలకు ఎక్కి పక్కకు జారిపోయి గుర్రుపెట్టడం ప్రారంభించాడు.

ఎండ చుర్రుమనిపించటంతో అతనికి మెలుకువ వచ్చింది.

హఠాత్తుగా కళ్లు తెరవటంతో రేకులు కన్పించాయి. ఒక్క క్షణం తాను ఎక్కడున్నదీ అర్థం కాలేదు. ఆ తర్వాత క్రమక్రమంగా అంతా గుర్తుకువచ్చింది. ఇంట్లోంచి పారిపోవడం, హైదరాబాద్ రావటం, దేవీబాబు అసిస్టెంట్ డైరెక్టర్ కాదు లైట్‌బాయ్ అని తెలియటం రాత్రి పొద్దుపోయేంతవరకూ దేవీబాబు తాగుతూ మాట్లాడుతుండటం.

శంకర్ పైకి లేచి మోకాళ్లమీద తల ఆనించి ఆలోచనల్లోకి జారిపోయాడు.

ఇప్పుడేం చేయాలి?

ఊరికి తిరిగి వెళ్లిపోవాలా? వద్దా? డైరెక్టర్ కావటం అన్న తన ఆశయాన్ని జీవితకాలంలో సాధించగలుగుతాడా?

అతనికి విపరీతమైన దుఃఖం కలిగింది... చాలాసేపటివరకూ అలాగే వుండిపోయాడు. మెదడును, మనసును ఛిద్రంచేసే ఆలోచనలు శరపరంపరలుగా వస్తూనే వున్నాయి.

గంట తర్వాత మనసు కుదుటపడింది. తలతిప్పి చూశాడు. దేవీబాబు లేడు. టైము ఎంతయ్యిందో తెలీదు. పైకి లేచాడు. రాత్రి తాలూకు పొట్లాలు కన్పించలేదు. కానీ సీసాలు మాత్రం దొర్లుతున్నాయి.

అద్దం దగ్గర దేవీబాబు రాసిన ఉత్తరం కన్పించింది.

"నాకు షూటింగ్ వుంది, వెళుతున్నాను. నిద్రలో వున్నావని లేపలేదు. ఇడ్లీ వుంది తిను. మధ్యాహ్నం మెస్‌వాడికి క్యారేజీ పంపమని చెప్పాను. సాయంత్రం కలుద్దాం..."

బాగా చల్లారిపోయిన ఇడ్లీ తింటూవుండగా తలుపు శబ్దమయింది.

తలుపు తెరిచాడు. ఇరవైఏళ్లకు మించిన వయస్సున్న సన్నగా వున్న కుర్రవాడు శంకర్‌వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"దేవీ లేడా? "

"షూటింగ్ కెళ్లాడు"

"అమ్మయ్య ఇంకా రూమ్ మార్చలేదన్నమాట. నువ్వు కన్పించేసరికి దేవీ రూమ్ మారిపోయాడేమోనని కంగారుపడ్డాను" అంటూ చొరవగా రూమ్ లోపలకు వచ్చి కూర్చున్నాడు. సగం తిన్న ఇడ్లీ పొట్లం చూసి "ఫర్లేదు నువ్వు తిను..." అన్నాడు.

ఇడ్లీ తిని, చేతులు కడుక్కుని మంచినీళ్లు తాగాక శంకర్ మొహమాటంగా చెప్పాడు.

"దేవీ సాయంత్రందాకా రాడనుకుంటానండీ"

"నాకు తెలుసు... అంటే నన్నెళ్ళిపోమంటావా ఏమిటీ? "

శంకర్ మొహమాటంగా నవ్వాడు. అతనెవరో తెలీదు. మొత్తమ్మీద దేవీబాబు ఫ్రెండ్ కావచ్చు

"నీ పేరేంటి? "

"శంకర్..."

"దేవీ రిలెటివ్వా? "

"కాదండీ... ఫ్రెండ్‌ని..."

"అయితే చేయి కలుపు" అంటూ షేక్ హాండ్ ఇచ్చాడు. "నేను దేవీ ఫ్రెండ్‌ని అంటే మనిద్దరం కూడా ఫ్రెండ్సన్నమాట"

శంకర్ బుద్ధిగా తలూపాడు.

"ఏం చేస్తావు నువ్వు? "

"డిగ్రీ అయిపోయిందండీ. డైరెక్షన్ నేర్చుకుందామని వచ్చాను"

"ఏ ఊరు మీది? "

"విజయవాడండీ..."

"మాది ఏలూరు. దగ్గర దగ్గరే. నేను కెమేరా అసిస్టెంట్‌ని..." అంటూ తన గురించి చెప్పుకొచ్చాడు. కాసేపయ్యాక, "మర్చేపోయాను నా పేరు చెప్పలేదుగా మహేష్... టీ తాగుదామా? " అన్నాడు.

రూమ్‌కి తాళంపెట్టి ఇద్దరూ ఇరానీ హోటల్ దగ్గరకు వచ్చారు.

హోటల్ జనంతో కిటకిటలాడుతూ వుంది. ఎవరికి వాళ్ళు సీరియస్‌గా మాట్లాడుకుంటున్నారు.

"దో చాయ్..." అంటూ ఆర్డర్ చేశాక "ఇంకేంటి విషయాలు? " అన్నాడు.

"ఏముంటాయండీ... నేను సిటీకి కొత్త. డైరెక్షన్ నేర్చుకుందామని వచ్చాను"

"సర్లే... చూస్తుంటే మంచివాడిలాగా వున్నావు. జాగ్రత్తగా వుండు. ఇక్కడ కంత్రీ నాకొడుకులు ఎక్కువ..."

ఇద్దరూ టీ తాగుతూ వుండగా ఇంకో కుర్రవాడు వీళ్లతో కలిశాడు.

"శంకర్ దేవీ ఫ్రెండ్. అశోక్ అసిస్టెంట్ డైరెక్టర్" మహేష్ ఇద్దరికీ పరిచయం చేశాడు.

"హల్లో..." అంటూ అశోక్ షేక్‌హాండ్ ఇచ్చాడు. మహేష్‌వైపు తిరిగి "ఏంటీమధ్య కన్పించటంలేదు" అని అడిగాడు.

"అవుట్‌డోర్ కెళ్ళాం బాసూ"

"ఏ సిన్మా? "

"ఏదో పేరు తెలీదు. రాజమండ్రి దగ్గర పల్లెటూరుకు పట్టుకెళ్ళారు. నిర్మాత పూరను కుంటాను. నాకయితే సిన్మా రిలీజవుతుందని నమ్మకం లేదు"

"అలాంటి సిన్మాలెందుకు చేస్తావు మహేష్ నువ్వు? "

"ఛా... నేనేం పెద్ద పీసీ శ్రీరాంనా? లైట్‌బాయ్‌ని. నాలుగు డబ్బులొస్తాయంటే లైట్లు పట్టుకుని పరిగెత్తటమే"

"నువ్వు చెప్పేదీ నిజమేలే. నాలుగు మంచి సిన్మాలు పడేంతవరకూ తప్పదు"

ఇద్దరూ ఈ విధంగా మాట్లాడుకుంటుండగా "హల్లో సోదరా!" అంటూ పిలుపు వినబడింది. ముగ్గురూ తలలు తిప్పిచూశారు. లావుగా పొట్టిగా వున్న ఓ మధ్య వయస్కుడు గునగునమంటూ నడుస్తూ వీళ్ళదగ్గరికి వచ్చాడు. కళ్ళు బాగా తాగినట్లుగా ఎర్రగా ఉబ్బి వున్నాయి. మీసం, గడ్డం తెల్లబడ్డాయి. తల కూడా తెల్లబడింది. కాకపోతే డై నిలిచినంతవరకూ నల్లగా వుంది జుట్టు.

"ఏంటి సోదరా! సీరియస్‌గా డిస్కషన్ చేస్తున్నారు? " అంటూ అశోక్‌ని అడిగాడు.

"ఏం లేదు" అన్నాడు అశోక్ పొడిగా.

"కొంచెం జరుగు సోదరా!" అంటూ శంకర్ పక్కన సర్దుకుని కూర్చున్నాడు. "ఏం సోదరా బాగున్నావా? " అంటూ మహేష్‌ని పలకరించి శంకర్‌వైపు చూసి "ఈ సోదరుడెవరు? " అంటూ ప్రశ్నించాడు.

"మా ఫ్రెండ్‌లే..." అన్నాడు అంతే పొడిగా అశోక్.

దాన్ని పట్టించుకోకుండా ఆ వ్యక్తి "ఏంటి సోదరా టీలు తాగేశారా. నాకోటి తెప్పించు" అన్నాడు మహేష్ దగ్గరున్న సిగరెట్ పాకెట్ చొరవగా తీసుకుని సిగరెట్ వెలిగించుకుంటూ.

సర్వర్ టీ తెచ్చాక వేడివేడి టీ రెండు గుక్కలు చప్పరించి సిగరెట్ దమ్ము లాగాడు.



"అమ్మయ్య... ఇపుడు రిలీఫ్‌గా వుంది సోదరా! టెన్షన్‌తో చచ్చిపోతున్నాననుకో సోదరా!"

"ఎందుకో అంత టెన్షన్?" మహేష్ వెట కారంగా అన్నాడు. అతడు దాన్ని గుర్తిం చాడో లేక గుర్తించనట్లుగా నటించాడో కానీ సిగరెట్ దమ్ము లాగుతూ అన్నాడు.

"సిన్మా కథ అంటే మాటలనుకున్నావా సోదరా?"

"సిన్మా కథనా?"

"అవును సోదరా! ఇప్పుడే చిరంజీవికి కథ చెప్పివస్తున్నా"

"ఏమన్నాడు చిరంజీవి?"

"ఏమంటాడు? పడిపోయాడు"

"పడిపోయాడా?" ఆశ్చర్యంగా అన్నాడు అశోక్.

"అదే సోదరా... పడిపోవటం అంటే నిజంగా పడిపోవటం కాదు. ఫ్లాట్ అయి పోయాడు"

"ఫ్లాట్ అయిపోయి ఏం చేశాడు?"

"లేచి నన్ను వాటేసుకున్నాడు"

"నిన్ను వాటేసుకున్నాడా?"

"నన్నుకాక రంభననుకున్నావా? బ్రదర్ ఇండస్ట్రీకొచ్చిన ఈ పాతికేళ్లలో ఇంత అద్భు తమైన స్టోరీ ఎవరూ చెప్పలేదని తెగ ఫీల యిపోయాడు"

"ఇంతకీ ఏమిటా స్టోరీ?"

"వద్దులే సోదరా... బైటకొస్తే లైన్ కొట్టే స్తారు. మొన్న వెంకటేష్ హిట్ సిన్మాకి నాలైన్ కొట్టేశారు"

"వెంకటేష్ నీ స్టోరీ లైన్ కొట్టేశాడా?"

"వెంకటేష్ కాదు. ఇట్లాగే అంతా మనవా ళ్లేనని సబ్జెక్ట్ అందరిదగ్గరా వాగేశాను. ఎవడో దరిద్రుడు నా స్టోరీ కొట్టేసి వాడిదేనని చెప్పి వెంకటేష్‌కి అమ్మేశాడు. వెంకటేష్ ఏం చేస్తాడు పాపం తనకు తెలీ దుగా"

"ఇంతకీ నువ్వు చెప్పే ఆ అద్భుతమైన సబ్జెక్ట్ ఏమిటీ?"

శేఖరం అనబడే సదరుశాల్తీ సిగరెట్ ఆఖరు దమ్ములాగి దాన్ని టీకప్పులో పడే శాడు. రహస్యం చెబుతున్నట్లుగా అటూ ఇటూ చూసి గొంతు తగ్గించి అన్నాడు. "నువ్వు తప్ప ఇంకెవరు అడిగినా చెప్పేవా డిని కాదు సోదరా. కానీ నీ దగ్గర దాయ లేను. దయచేసి ఎక్కడా అనమాకు. ప్లీజ్... నా స్టోరీ కొట్టేస్తారు. ఇప్పటికే నా స్టోరీలు కొట్టేసి నలభైఎనిమిది సిన్మాలు తీసేశారు... ప్లీజ్"

"సరే... స్టోరీ ఏమిటో చెప్పు" అన్నాడు అశోక్ విసుగ్గా.

"బ్రహ్మాండమైన స్టోరీ సోదరా. టైటా నిక్కు, గుండమ్మ కథ, కహోనా ప్యార్ హై"

"నీ స్టోరీ చెప్పమంటే సిన్మాలపేర్లు చెబుతావేంటి?"

"నా స్టోరీనే సోదరా... ఈ మూడు సిన్మాలు కలిపి బ్రహ్మాండమైన సబ్జెక్ట్ తయారుచేశా. అది కానీ రిలీజయితే బాక్సులు బద్దలైపోతాయి"

"ఎవరివి... నిర్మాతవా? బయ్యర్లవా?"

"ఏంటి సోదరా అన్నావు వినపడలేదు"

"ఏం లేదులేకానీ... ఇంక వెళతాము. అర్జంటు పనుంది" అంటూ అశోక్ పైకి లేచాడు. శంకర్, మహేష్ ఇద్దరూ కూడా పైకి లేచారు. అశోక్ సర్వర్‌కు టీ డబ్బు లిచ్చి ముగ్గురూ బయలుదేరబోతుండగా ఆ వ్యక్తి తిరిగి పిలిచాడు.

"సోదరా"

"ఏంటీ?"

"ఓ ఫిఫ్టీ వుంటే సర్దుతావూ... టైట్‌గా వుంది"

"పోనీ రెంచి ఇవ్వనా?"

"రెంచినా దేనికీ?" శేఖరం ఆశ్చర్యపో





యాడు.

"లైట్‌గా వుందన్నావుగా. రెంచి ఇస్తే లూజవుతుందని".

అవసరమైనదానికన్నా ఎక్కువగా నవ్వాడతను. "భలే జోకులేస్తావు సోదరా... నువ్వే కానీ సిన్మా డైలాగులు రాస్తే మేమంతా ఇంటికెళ్ళిపోవాల్సిందే. రాసే ఇంట్రస్టుందంటే ఓ రెండు బ్యానర్లు పరిచయం చేస్తాను"

"వద్దులే... ఇలా బతకనీ..." అంటూ అశోక్ అతన్ని పట్టించుకోకుండా ముందుకు నడిచాడు. శంకర్, మహేష్ ఇద్దరూ అనుసరించారు.

ముగ్గురూ కొంతదూరం నడిచాక శంకర్ అన్నాడు.

"పాపం... సిన్మాఫీల్డంటే ఇన్ని రాజకీయాలుంటాయా? "

"వాడు చెప్పిందంతా నువ్వు నమ్ముతున్నావా? "

"మరి? " శంకర్ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"వాడి సంగతి అందరికీ తెలుసు. నా సబ్జెక్టులు కాపీ కొట్టేసి సిన్మాలు తీసేస్తున్నారంటూ అందరి దగ్గరా మొత్తుకుంటాడు. పోనీ ఏదైనా సబ్జెక్ట్ చెప్పమంటే రాత్రి చూసొచ్చిన సిన్మాకథ చెబుతాడు. ఇది ఆల్‌రెడీ వచ్చేసింది కదా! అంటే నేను ముందే చెప్పలా నా సబ్జెక్ట్ దొబ్బేశారంటూ ఇంకో స్టోరీ వినిపిస్తాడు. ఇంతా చేసి వీడు ఈ హరికథంతా చెప్పి ఓ ఫిఫ్టీ వుందా అంటాడు. వాడి సిన్మాకథల సంగతి తర్వాత కానీ కన్పించిన వాడికల్లా ఈ టైపు స్టోరీలు విన్పిస్తూవుంటాడు. అది వాడికి మామూలే కాబట్టి ఎవ్వరూ పట్టించుకోరు. నీలాంటి కొత్తవాడు ఎవరైనా దొరికితే మాత్రం బలయిపోతాడు

వీడు చాలా బెటర్. ముందు ముందు ఈ మాయాలోకంలో ఎన్నో విచిత్రమైన క్యారక్టర్లు తగులుతాయి చూస్తుండు"

శంకర్ స్టూడెంట్ మాదిరిగా బుద్ధిగా తలవూపాడు.




క్రేజీ హీరోస్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్.

బోర్డు ధగధగమంటూ మెరుస్తోంది. లోపల వెయిట్ చేస్తున్న కుర్రవాళ్ళు కూడా జీన్స్, టీషర్టుల్లాంటి మోడ్రన్ డ్రస్సుల్లో మెరిసిపోతున్నారు.

గదిలో గోడలకు తెలుగు, హిందీ, తమిళ, ఇంగ్లీష్ టాప్ హీరోహీరోయిన్ల ఫొటోలు వేలాడదీయబడివున్నాయి. దాదాపు పదిహేనుమంది యువతీయువకులు తీవ్రమైన టెన్షన్‌లో వెయిట్ చేస్తున్నారు. పద్దెనిమిది నుంచి నలభై ఏళ్ళదాకా వివిధ వయస్సుల్లో వున్నారు. వాళ్ళ చూపులన్నీ డైరెక్టర్ అని రాసి వున్న గదిమీదనే కేంద్రీకృతం అయివున్నాయి.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలనుంచి వచ్చారు వాళ్ళంతా. ప్రముఖ పత్రికల్లో నూతన నటీనటులు కావలెను అన్న అడ్వర్టైజ్‌మెంట్ వాళ్ళను అయస్కాంతం మాదిరిగా ఆకర్షించి అక్కడకు లాక్కువచ్చింది. వాళ్ళందరిలోనూ సిన్మాలో ప్రముఖంగా వెలిగిపోవాలన్న తపన తీవ్రంగా వుంది.

తమలో అపరిమితమైన టాలెంట్ వుందనీ దాన్ని ఎవ్వరూ గుర్తించటంలేదనీ ఏమాత్రం ప్రోత్సహించినా తాము ఎన్టీఆర్, ఏఎన్నార్ అంతటి ప్రముఖ నటులు అయిపోగలమని వాళ్ళంతా తీవ్రంగా నమ్ముతున్నారు. తమ తమ ప్రాంతాల్లో, వూళ్ళలో వారంతా ఏనాటికయినా గొప్ప నటులం కాగలమన్న నమ్మకంతో కాలక్షేపం చేస్తున్న సమయంలో ఆ ప్రకటన వాళ్లను మైమరచిపోయేలా చేసింది.

మట్టిలోని మాణిక్యాలకు స్వాగతం

మీలో గొప్ప నటనా కౌశలంవుందా? అయినా కూడా ఏమాత్రం గుర్తింపులేకుండా నిరాశా నిస్పృహలతో బతుకుతున్నారా? డోంట్ వర్రీ. క్రేజీ హీరోస్ ఫిల్మ్ ఇన్స్టిట్యూట్ మీ కలలను నిజంచేసి మిమ్మల్ని గొప్ప సిన్మా నటీనటులుగా తీర్చిదిద్దుతుంది. త్వరలో ప్రారంభంకాబోయే 'శ్రీమతీ లేచిపో', 'ప్రేమిస్తే చంపేస్తా', 'మానాన్న మీదొట్టు మీ అమ్మ పతివ్రతే' తదితర సంచలన సిన్మాల్లో నటించేందుకు నూతన నటీనటులు కావలెను. వెంటనే ఈ అడ్రస్‌లో సంప్రదించండి. ఏమో! రేపటి సూపర్‌స్టార్ మెగాస్టార్ మీరే కావచ్చు వెంటనే త్వరపడండి"

కట్ చేస్తే...

గత పదిరోజులుగా క్రేజీ హీరోస్ ఫిల్మ్ ఇన్స్టిట్యూట్ కార్యాలయం వర్ధమాన నటీనటులతో కిటకిటలాడిపోతూ వుంది. కార్యాలయం అంటే పెద్ద ఆఫీసేమీ కాదు. ఓ నాలుగంతస్థుల బిల్డింగ్‌లో మూడు గదుల ఇరుకైన ఆఫీస్. నాలుగు రేకు కుర్చీలు, రెండు ప్లాస్టిక్ స్టూల్స్. మిగిలిన వాళ్ళు నిలబడే టెన్షన్‌తో పచార్లు చేస్తున్నారు. కొంతమంది డైరెక్టర్ రూమ్‌వైపు, మరికొంతమంది గోడమీదున్న స్టార్స్‌ఫొటోలవైపు చూస్తున్నారు. ఇంకొంతమంది ఐదు నిమిషాలకు ఓసారి దువ్వెన తీసి క్రాపులు దువ్వుకుంటున్నారు.

టెన్షన్... టెన్షన్... తీవ్రమైన టెన్షన్.

సెలక్ట్ అవుతామా లేదా? పక్కవాడు సిన్మాహీరో ఛాన్స్ గద్దలా తన్నుకుపోతాడా? అనుకుంటూ ఎవరికి వాళ్ళు పక్కవాళ్ళను బద్ధశత్రువులను చూస్తున్నంత ఫీలింగ్‌తో మౌనంగా మిర్రిమిర్రి చూస్తున్నారు.

ఐ.ఎ.యస్ ఇంటర్వ్యూ ముందు కూడా అభ్యర్థులు ఇంత టెన్షన్‌గా వుండరేమో!

"సతీష్‌బాబంటే ఎవరు?"

"నేనే సార్"

"లోపలకు వెళ్ళండి. డైరెక్టర్‌గారు పిలుస్తున్నారు"

సతీష్‌బాబనే ఇరవైనాలుగేళ్ళ కుర్రాడు డైరెక్టర్ గదిలోకి అడుగుపెట్టాడు. లోపల ఓ టేబుల్ దానికెదురుగా రెండు ఛెయిర్స్ వేసి వున్నాయి. లావుగా, పొట్టిగా వున్న యాభైఏళ్ళు దాటుతున్న ఓ వ్యక్తి కూర్చుని వున్నాడు. ఆయనే డైరెక్టరని అర్థం చేసుకున్న సతీష్‌బాబు అత్యంత వినయంగా విష్ చేశాడు.

"నమస్తే సార్..."

"నమస్తే... కూర్చోండి... మీ పేరేంటి?"

"సతీష్‌బాబు సార్..."

"వెరీగుడ్... మీలాగానే మీ పేరు కూడా స్టయిల్‌గా వుంది"

"థాంక్యూ సర్..." అన్నాడు సతీష్‌బాబు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతూ.

"మీకు డాన్స్‌వచ్చా?"

"రాదు సార్..."

"పోనీ ఫైట్స్‌లో ఏమైనా ప్రవేశం వుందా?"

"లేదు సార్"

"మీ హైట్ ఎంత?"

"ఐదడుగుల పదకొండు అంగుళాలు సార్"

"గుడ్ హైట్. మీ పక్కన హీరోయిన్ని వెతకటం కష్టమే..."

సతీష్‌బాబు మనస్సు అంతరిక్షవిహారం





మొదలుపెట్టింది. డైరెక్టర్ హీరోయిన్ విషయం ఆలోచిస్తున్నాడంటే తను హీరోగా సెలక్ట్ అయిపోయినట్లేనా? తను హీరో అయిపోయి టాలెంట్‌తో తెరమీద చించిపారేయాలి. దాంతో తన మొదటి సిన్మానే సూపర్‌డూపర్ హిట్టయిపోతుంది. ఇంకేముంది రామానాయుడు, అల్లుఅరవింద్, అశ్వనీదత్‌లు లక్షలు అడ్వాన్సులు సూట్‌కేసుల్లో పెట్టుకుని తన ఇంటిముందు వెయిట్ చేస్తారు. లక్షలమంది ఫ్యాన్స్ ఏర్పడతారు. జనం బ్రహ్మరథం పడతారు. అందమైన అమ్మాయిలు తన చుట్టూ తిరుగుతూ వుంటారు. ఓహ్... వాట్ ఎ వండ్రఫుల్ లైఫ్.

"హల్లో..."

సతీష్‌బాబు తన కలల ప్రపంచంలోంచి అయిష్టంగా వాస్తవ ప్రపంచంలోకి వచ్చాడు.

"ఏంటి ఆలోచిస్తున్నారు?"

"ఏం లేదు సార్..."

డైరెక్టర్ విచిత్రమైన నవ్వొకటి నవ్వాడు. "మీ పర్సనాలిటీ, అందం, గ్రేస్ రియల్లీ గ్రేట్. మీలో హీరోకళ ఉట్టిపడుతూ వుంది. మిమ్మల్ని చూసిన మరుక్షణం మీరే మా సిన్మాలో హీరో అని డిసైడ్ చేసుకున్నాను. నన్ను నమ్మండి. మీరు చాలా కొద్దికాలంలోనే చాలా పెద్ద హీరో అయిపోతారు. నేను టాలెంట్‌ను స్పాట్ చేయగలను. ఒక్కసారి చూశానంటే పట్టేస్తాను. నో డౌట్ మీరో బిగ్గెస్ట్ హీరో అయిపోతారు. కానీ ప్రాబ్లమ్ ఏమిటంటే" అంటూ ఓ క్షణం ఆగాడు.

"మీప్రాబ్లమ్ ఏమిటి సార్?" సతీష్‌బాబు ఆత్రుతగా అడిగాడు.

"వద్దులెండి. మా బాధలేమిటో మేమే పడతాం. మీకు అడ్వాన్స్ ఎంత కావాలి?"

"ఫర్లేదు చెప్పండి సార్. మీ ప్రాబ్లమ్ ఏమిటో!"

"ఏంలేదు. ముందుగా అనుకున్న ఓ పార్టనర్‌కు షేర్స్‌లో రెండు కోట్లు నష్టం వచ్చింది. దాంతో అతను తన వాటా కింద పెట్టాలనుకున్న నలభై లక్షలు ఎడ్జెస్ట్ చెయ్యలేని పరిస్థితిలో వున్నాడు"

"మన సిన్మా బడ్జెట్ ఎంత సార్?"

"కోటీ డెబ్భైలక్షలు. మూడు సాంగులు ఫారిన్‌లో తీస్తాం. హీరో డ్రస్సులకు, అంటే మీరేగా హీరో, మీ డ్రస్సులకే ఆరేడు లక్షలు ఖర్చవుతాయి. ఫ్రేమ్ టు ఫ్రేమ్ బ్రహ్మాండమైన రిచ్‌గా తీస్తాం. మన సిన్మా రిలీజయితే మీరు ఎక్కడికో వెళ్ళిపోతారు" సతీష్‌బాబు మనసు మళ్ళీ విహారం మొదలుపెట్టింది. ఇంత భారీ బడ్జెట్ సిన్మాలో తను హీరోగా చేయటం అంటే మాటలు కాదు. రామానాయుడు, అల్లుఅరవింద్ కాదు బొంబాయినుంచి కూడా నిర్మాతలు తనను వెతుక్కుంటూ వచ్చి ఎగబడతారు కానీ నలభై లక్షలు షార్టేజ్ అంటే.

"సార్... నేనో రెండు లక్షలదాకా సర్దగలను"

"ఏమంటున్నారు మీరు?" డైరెక్టర్ సీరియస్‌గా అన్నాడు.

"మన సిన్మాకు నేను రెండు లక్షలవరకూ ఎడ్జెస్ట్ చేస్తాను సార్"

డైరెక్టర్ ముఖం ఆవేశంతో ఎర్రబడింది. "మీరు దయచేసి బైటకు వెళతారా?" అన్నాడు మరింత సీరియస్‌గా.

సతీష్‌బాబు ఆశ్చర్యపోయాడు. "నేనేం తప్పుగా మాట్లాడాను సార్" అన్నాడు.

"ఏం మాట్లాడుతున్నారండీ మీరు? రెండు లక్షలు సర్దుతారా! మీ కళ్ళకు నేను ఎలా కన్పిస్తున్నాను. ఫ్రెష్ టాలెంట్‌తో సిన్మా తీసి సూపర్‌హిట్ చేయటం నా జీవితలక్ష్యం. అది సాధించి తీరతాను. ఏదో తాత్కాలికంగా ఫైనాన్షియల్ ప్రాబ్లమ్స్ వచ్చాయని మీరు నన్ను చీప్‌గా అంచనా వేసి రెండు లక్షలు ముష్టివేస్తానంటారా! మీరిచ్చే రెండు లక్షలు నా సిగరెట్ ఖర్చులకు సరిపోవు"

సతీష్‌బాబు భయంతో గజగజా వణికాడు. ఏదో ప్రాబ్లమ్ అంటే తనో రెండు లక్షలు సర్దుదామనుకున్నాడు. అది రివర్స్ అయ్యి తన హీరో వేషానికే ఎసరు వచ్చేటట్లుగా వుంది. డైరెక్టరుగారు చూస్తే చాలా ఆత్మాభిమానంకల వ్యక్తిలాగా వున్నాడు. తను తొందరపడి బ్రహ్మాండమైన ఛాన్స్ నాశనం చేసుకుంటున్నాడు.

"అది కాదు సార్.. నా ఉద్దేశ్యం మిమ్మల్ని అవమానించటం కాదు"

"ఏం చెప్పకండి... దయచేసి నా ముందు నుండి వెళ్ళిపోండి. ఇన్నేళ్ళనుండీ ఇండస్ట్రీలో వుంటున్నాను. నాతో ఇంత ధైర్యంగా మాట్లాడే సాహసం ఎవ్వరికీ లేదు. నీలో టాలెంట్ వుంది కదాని హీరోని చేద్దామనుకుంటే నాకే ముష్టివేస్తాననే స్థాయికి వచ్చావా! ప్లీజ్ గెటవుట్"

సతీష్‌బాబు దాదాపుగా డైరెక్టర్ కాళ్ళ మీద పడిపోయాడు "సార్... తమరి ముందు నేనెంత? మీరు కన్నెర్ర చేస్తే నాకు ఇండస్ట్రీలో నీళ్ళు కూడా పుట్టవు సార్... ఏదో బుద్ధి గడ్డితిని ఆ కూత కూశాను. మీకు కోపమొస్తే మీ ఎడంకాలిచెప్పుతో కొట్టండి పడతాను. అంతే కానీ హీరో ఛాన్స్‌మాత్రం ఇవ్వననకండి సార్. మీకు దండం పెడతాను. నన్ను క్షమించండి సార్"

ఇరవై నిమిషాలసేపు సతీష్‌బాబు దీనాతిదీనంగా బతిమిలాడిన తర్వాత డైరెక్టరుగారు శాంతించారు.

"సర్లే క్షమించాను ఫో... నువ్వే నా సిన్మాలో హీరోవి"

'కౌన్‌బనేగా కరోడ్‌పతీ' ప్రోగ్రాంలో కోటి రూపాయలు వచ్చినంత సంబరపడ్డాడు సతీష్‌బాబు.

"థాంక్యూ సార్... మీ మేలు ఈ జన్మలో మర్చిపోను"

"సరే కానీ రెండు లక్షలు ఎప్పుడు తెచ్చిస్తావు?" డైరెక్టర్‌గారు తాపీగా అడిగాడు.

సత్తిబాబుకు మతిపోయినంత పనయ్యింది. ఇప్పుడేగా 'నాకు డబ్బు సర్దేంతవాడివా' అని ముక్కతిట్లు తిడితే కాళ్ళు పట్టుకుని లైన్‌లోకి తెచ్చుకున్నాపు. మళ్ళీ రెండు లక్షలంటాడేమిటి?

"సార్... ఆ మాట కూసినందుకేకదా నన్ను బండ బూతులు తిట్టారు" భయంభయంగా అడిగాడు ఎక్కడ డైరెక్టర్‌గారి మూడ్ మారిపోతే సిన్మాహీరో ఛాన్స్‌పోతుందోనని.

డైరెక్టర్‌గారు సత్తిబాబు సందేహానికి శ్రీకృష్ణపరమాత్ముడి రేంజ్‌లో నవ్వాడు.

"ఇందాక ఎందుకు తిట్టానో తెలుసా?"

"తెలీదు సార్"

"ఇప్పుడెందుకు అడిగానో తెలుసా?"

"అది కూడా తెలీదు సార్"

"ఇందాక నువ్వు నా సిన్మాలో జస్ట్ హీరోవి. అందుకే తిట్టాను కానీ ఇప్పుడు నా ఆత్మీయుడివి. అంతే కాదు మన సిన్మాలో పార్టనర్‌వి"

"పార్టనరా?"

"అవును... నువ్వు నేను తీయబోయే సిన్మాలో భాగస్థుడివి. అలా షాక్ అయిపోకు. రెండు కోట్ల బడ్జెట్ సిన్మాలో రెండు లక్షలంటే పైసావాటా. కానీ నేను నీకు ఐదు పైసలవాటా ఇస్తున్నాను. హీరోగా నీ రెమ్యూరేషన్, సిన్మా వాటా అంతా కలిపి హీనపక్షం నీకు ఇరవై లక్షలు రావచ్చు"

"ఇరవైలక్షలే?"

"ముష్టి ఇరవైలక్షలేమిటి? మన సిన్మా రిలీజ్ కాగానే నీకు ఇరవై కోట్లు అడ్వాన్సులొస్తాయి. నేను టాలెంట్‌ను పట్టేయగలను. నీ చరిత్రే మారిపోతుంది. అప్పుడు నన్ను గుర్తుపెట్టుకో చిరంజీవిలాగా మర్చిపోకు"

సతీష్‌బాబు కళ్ళు గిర్రున తిరిగాయి. "సార్... చిరంజీవికి మీరే లైఫ్ ఇచ్చారా?"

"అవును... ఆ విషయం పబ్లిసిటీ చేసుకోవటం నాకు ఇష్టం వుండదు. నీకు ఎందుకు చెప్పానో తెలుసా? నువ్వు చచ్చిపోయిన





మా మేనల్లుడిలాగా వున్నావు. వాడు కూడా నీలాగా సిన్మా హీరో కావాలని ఎంతో తపించాడు కానీ బాడ్‌లక్ క్యాన్సరొచ్చి చచ్చిపోయాడు. నా మేనల్లుడిని నీలో చూసుకుంటున్నాను"

సతీష్‌బాబు కళ్ళు తుడుచుకున్నాడు.

"నీకోసం బొంబాయినుంచి హీరోయిన్ని తెప్పిస్తాను. ఎవరో తెలుసా! ఐశ్వర్యారాయ్ చెల్లెలు"

"ఐశ్వర్యారాయ్‌కు చెల్లెలుందా సార్? "

"అదే సీక్రేట్... మీకెవరికీ తెలీదు. 'మా అమ్మాయి మీ సిన్మాలోనే హీరోయిన్‌గా ఎంట్రీ' అంటూ ఐశ్వర్యారాయ్ తల్లి నన్ను తెగ మొహమాటపెట్టేస్తోంది. ఎన్నో హిందీ సిన్మాల్లో ఆఫర్లు వచ్చినా వాళ్లు చేయలేదు. నీ అదృష్టం ఫస్ట్ సిన్మాలోనే ఐశ్వర్యారాయ్ చెల్లెలితో హీరోగా నటించబోతున్నావు"

ఆనందం ఎక్కువయి గుండె ఆగిపోతుందేమోనన్న సందేహం వచ్చింది సతీష్‌బాబుకి. "హీరోగారూ..."

సతీష్‌బాబు ఉలిక్కిపడి డ్రీమ్స్‌లోంచి తేరుకున్నాడు "ఏమన్నారు సార్? "

"నువ్వు నా సిన్మాలో హీరోవి కాబట్టి హీరోగారూ అన్నాను. ఏం ఫీలయ్యావా? "

"నా చర్మం వలిచి మీకు బూట్లుకుట్టించాలన్పిస్తోంది సార్. మీ అంత మహానుభావుడిని, టాలెంట్‌ను గౌరవించే వ్యక్తిని నేను ఇంతవరకు చూళ్లేదు సార్"

"అట్టే పొగడకండి హీరోగారూ... నాకు పొగడ్తలు ఇష్టంవుండదు"

"అలాగే సార్"

"ఇంతకీ రెండు లక్షలు ఎప్పుడు తేగలుగుతావు? "

"మా వూరికెళ్ళి వారంరోజుల్లో తెచ్చిస్తాను సార్"

"వెరీగుడ్... అదీ సిన్మా హీరో అంటే! అంత ఆత్మవిశ్వాసం వుండాలి"

"థాంక్యూ సార్"

"మరి నువ్వాపనిమీద వుండు" అని డైరెక్టర్ చెప్పగానే సతీష్‌బాబు సాష్టాంగ ప్రణామం చేసి శెలవుతీసుకుని బయటకు నడిచాడు. "నెక్స్ట్... రాంబాబు"

రాంబాబు అనబడే 'బకరా' డైరెక్టర్ రూమ్‌లోకి కోటి ఆశలు గుండెనిండా నింపుకుని అడుగుపెట్టింది.

★ ★ ★

శంకర్ సిటీకి వచ్చి ఇరవైరోజులవుతుంది.

ఇరవైరోజులు ఇరవైయుగాల్లాగా గడిచాయి. నిద్రపట్టదు. ఆకలేయదు. వంటరితనం, భరించలేనంత దిగులు. రాత్రిళ్ళు దేవీబాబు మందుకొట్టి గుర్రుపెడుతున్న సమయంలో వంటరిగా మేడమీద కూర్చుని చీకట్లోకి చూస్తూ ఆలోచనల్లోకి జారిపోయేవాడు. ఏం చేస్తున్నాడు తను? ఎందుకు ఇంట్లోంచి పారిపోయివచ్చాడు?

తను ఎండమావులవెంట పరుగులు పెడుతున్నాడా?

తండ్రి మాట ధిక్కరించటం తను చేసిన ఘోరమైన తప్పా? ఆ తప్పును తను సరిదిద్దుకోగలుగుతాడా? ఇక్కడే వుండాలా? ఇంటికి తిరిగెళ్ళిపోవాలా? ఏం చేయాలి? ఏం చేయాలి? ఏం చేయాలి? అన్న సందేహాలు మనసునూ, మెదడునూ ఛిద్రంచేసేవి. తెలీకుండానే అప్రయత్నంగా కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. మనస్సు మంచులో పెట్టినంత స్తబ్దంగా మారిపోయింది.

అజ్ఞానమంత సుఖం ఇంకోటి లేదంటారు వేదాంతులు.

ఆత్మవంచన చేసుకోకుండా, ఆత్మవిమర్శ చేసుకుంటున్న సమయం అత్యంత బాధాకరమైనది. గొంగళిపురుగు సీతాకోక చిలుకగా మారే పరిణామ క్రమంలో ఘర్షణ, వేదన వుండి తీరుతాయి. ఆ విషయం శంకర్‌కు తెలీదు.

ఇరవైనాలుగుగంటలూ ఆలోచిస్తూనే వుండేవాడు.

సితారలు, శివరంజనిలు చదివేసి, మార్నింగ్ షోలు, సెకండ్‌షోలు చూసేసి సిన్మాఫీల్డుమీద భ్రమలు ఏర్పరచుకుని ఇంట్లోంచి పారిపోయివస్తే జీవితం ఎంత దుర్భరంగా వుంటుందో ఇప్పుడిపుడే అతనికి అర్థం అవుతోంది.

పొద్దుటే దేవీబాబు వెళ్ళిపోయిన తర్వాత ఇంటివాళ్ళదగ్గర పేపర్ తీసుకుని మొత్తం అంతా చదివేవాడు. మెస్సుకెళ్ళి భోజనం చేసి రూమ్‌కు వచ్చేవాడు. అప్పటినుంచీ వంటరితనం. దేవీబాబు వున్నా వంటరితనమే. సాయంత్రం అయ్యేసరికి మందుబాటిల్ తెరిచి తాగుతూ వుండేవాడు. పొద్దున్నయ్యేసరికల్లా షూటింగ్‌కు వెళ్ళిపోయేవాడు. మళ్ళీ సాయంత్రాలు మామూలే.

ఓసారి దేవీబాబుతో అన్నాడు "దేవీ... నువ్వు తాగుడుకు బానిసయిపోతున్నావు"

"వదిలెయ్‌భయ్యా... పగలంతా అంత బరువులైట్లు మోసిమోసీ మా బాస్ బండ బూతులు భరించీ వళ్ళూ, మనసూ హూనం అయిపోతుంది. ఆ బాధలకు, మందు ఈ మందే" అనేవాడు.

ఎంతచెప్పినా వినడని అర్థంఅయిన తర్వాత శంకర్ చెప్పటం మానుకున్నాడు. అయినా తనకు చెప్పే అర్హత ఎక్కడిది? తను వుంటున్నదే అతని రూమ్‌లో. అతను కొనిచ్చిన మెస్ టిక్కెట్లతో భోజనం. అతని మీద ఆధారపడి బతుకుతూ అతనికి నీతులు చెప్పాలన్న ప్రయత్నం మూర్ఖత్వం. అతని తాగుడును తను అసహ్యించుకుంటున్నాడు కానీ తనకంటే దేవీబాబు గొప్పవాడు. చేసేది లైట్‌బాయ్ అయినా పగలంతా కష్టపడి సంపాదించుకుంటున్నాడు. రాత్రిళ్లు ఆ సంపాదన ఖర్చుపెట్టుకుంటున్నాడు. మరి తనో అతని రూమ్‌లో వుంటూ, అతని తిండి తింటూ జీవచ్ఛవంలా బతుకుతున్నాడు.

గొప్ప మార్పుకి బీజం ఆ తరహా ఆలోచనా ధోరణి.

ఇతరులను అసహ్యించుకుంటూ విమర్శిస్తూ బతకటం కంటే వాళ్ళలోని మంచి లక్షణాలను చూసి ఇన్‌స్పైర్ కావటం అనేది గొప్ప పరిణామం. శంకర్ ఇపుడు పరిణామ దశలోనే వున్నాడు.

★ ★ ★

"హాయ్ శంకర్..."

"హల్లో మహేష్... ఏమిటీమధ్య కనబడటంలేదు? "

"ఇప్పుడు కూడానా? " అంటూ జోకాడు మహేష్.

"ఇప్పుడు కన్పిస్తున్నావులే కానీ... ఏం చేస్తున్నావు? "

"చాయ్ తాగుతూ మాట్లాడుకుందాం పద..." అంటూ మహేష్ ఇరానీ కేఫ్‌లోకి నడిచాడు. శంకర్ అనుసరించాడు. ఇద్దరూ కూర్చుని చాయ్ ఆర్డర్ ఇచ్చాక శంకర్ మళ్లీ అడిగాడు.

"ఏం చేస్తున్నావు మహేష్? "

"స్మగ్లింగ్..."

శంకర్ ఫీలింగ్ చూసి మహేష్ నవ్వాడు. "నేను కెమేరా అసిస్టెంట్‌ని... ఏం చేస్తాను? కెమేరా భుజంమీద వేసుకుని తిరుగుతాను. ఎప్పటికయినా మధు అంబటో, పీసీ శ్రీరామో, రాజీవ్‌మీనన్‌నో అయిపోతానని కలలు కంటాను... మా కెమేరామెన్ మాత్రం కెమేరా మోయించుకుంటాడే కానీ వ్యూఫైండర్‌లోంచి కళ్లుపెట్టి చూడనివ్వడు. 'పన్నెండేళ్లు కొట్టుకుంటే కెమేరామెన్ అయ్యాను. నాలుగేళ్ళకే నువ్వేంటీ!' అంటాడు. ఆయన ఉద్దేశం నేను కూడా ఓ పన్నెండేళ్ళు కెమేరా మోయాలి. నాకు కడుపులో మండుతున్నా వేరే దిక్కులేదు కాబట్టి 'అలాగేనండీ గురువుగారూ...' అని బుద్ధిగా తలూపుతాను. ఇక్కడ ఎవ్వరైనా అంతే. వాళ్ళ ఛాన్స్ వచ్చేదాకా నోర్మూసుకుని కూర్చోవాల్సిందే..."

సర్వర్ టీ తెచ్చాక ఇద్దరూ తాగటం ప్రారంభించారు. మహేష్ సిగరెట్ వెలిగిం





# రచయితలకు




- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కలిగిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జనవరి చతుర నవల **రంగులకల** ....................

**సమీక్షకుని పేరు :** ....................

**చిరునామా :** ....................

....................

....................

....................

చాడు. శంకర్‌కు ఆఫర్ చేయలేదు. ఎంత బలవంతం చేసినా శంకర్ సిగరెట్, మందు తాగడని తెలుసు.

"నువ్వేం చేస్తున్నావు శంకర్?"

"ఎద్దులా తినటం, గాడిదలా తిరగటం, కుంభకర్ణుడిలా పడుకోవడం అంతే... అంత కంటే చేసేందుకేంలేదు"

"మరీ డల్ అయిపోకు మంచిరోజులొ స్తాయి"

"వస్తాయంటావా? నాకయితే నమ్మకం లేదు" శంకర్ నిరుత్సాహంగా అన్నాడు.

"రాక ఎక్కడకు పోతాయి శంకర్. సిన్మా ఇండస్ట్రీ వదిలేసి వెళ్ళిపోదామనుకుంటున్న టైంలో మణిరత్నానికి బ్రేక్ వచ్చిందట. అందుకే ధైర్యంగా వుండాలి..."

"అందరూ మణిరత్నాలు, రామ్‌గోపాల్ వర్మలూ కాలేరుగా మహేష్"

"కాలేరు నిజమే. కానీ నీరసపడి మనం ఏమీ చేయలేము. ఏదో ఒక ప్రయత్నం చేస్తూవుంటే ఎప్పటికయినా బ్రేక్ వస్తుంది..."

"బ్రేక్ వచ్చేలోగా స్టీరింగ్ వూడి చేతికి వచ్చేలా వుంది..."

మహేష్ నవ్వాడు. "భలే తమాషాగా మాట్లాడతావు శంకర్ నువ్వు"

"నా బతుక్కి మిగిలింది అదే..."

ధైర్యం చెబుతున్నట్లుగా భుజంమీద చరిచాడు మహేష్. "డోంట్‌వర్రీ బాస్. జీవితంలో ఎప్పుడూ కష్టాలే వుండవు. ఇండస్ట్రీలో నీకంటే నాలుగేళ్ళు సీనియర్ని. నా కళ్ళముందు టీకి డబ్బుల్లేక గిలగిల్లాడిన వాళ్ళు ఈరోజు ఫారిన్ కార్లలో తిరుగుతున్నారు. ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో ఖుషీ చేసినవాళ్ళు ప్లాట్‌ఫారం మీదున్నారు. ఇక్కడ ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవ్వరూ చెప్పలేరు బాస్"

"నీ మాటలు వింటే ధైర్యం వస్తుంది. కానీ ఏమిటో మహేష్ నా పరిస్థితి ఘోరంగా వుంది" నిరుత్సాహంగా అన్నాడు శంకర్.

"ఇంతకీ నీ డైరెక్షన్ సంగతి ఏమైంది?"

"దేవీబాబు రేపు మాపు అంటున్నాడు. పొద్దుటే పరిగెడతాడు. రాత్రికి విషయం గుర్తుండదు..."

"బాగా మందు కొడుతున్నాడుగదూ!"

శంకర్ మౌనంగా వుండిపోయాడు. దేవీబాబు రూమ్‌లో వుంటూ అతని గురించి నెగెటివ్‌గా చెప్పటం అతనికి ఇష్టంలేదు.

"దేవీబాబుతో పెట్టుకుంటే కాదు... నీ ప్రయత్నాలు నువ్వు చెయ్యి..."

"నాకు ఇక్కడ ఎవ్వరూ తెలీదే?"

"మొదట్లో ఎవరి పరిస్థితయినా అంతే... మెల్లగా పరిచయాలు పెరుగుతాయి. అయినా నువ్వు ఎప్పుడూ రూమ్‌లోనే వుంటావేంటీ కాస్త బైట తిరుగుతూ వుండు"

"ఎందుకో నాకు ఇక్కడి మనుష్యులూ, వాళ్ల ప్రవర్తనా నచ్చటంలేదు"

మహేష్ పెద్దగా నవ్వాడు. "సిన్మా ఫీల్డులో లక్షరకాల మనుష్యులుంటారు. వాళ్ళందరితో తెలివిగా మసలుకోవటం నేర్చుకోవాలి. వాళ్ళు నాకు నచ్చలేదు, వీళ్ల ప్రవర్తన బాగాలేదు అంటూ దూరంగా వున్నావా అంతే సంగతులు. అయినా ఒకళ్లతో నీకేంటీ? నీ పని నువ్వు చూసుకో..."

"ఆ పని లేకేగా ఈ బాధలన్నీ..." పేలవంగా నవ్వుతూ అన్నాడు శంకర్.

మహేష్ సిగరెట్ ఆఖరిదమ్ము లాగి అవతలకు విసిరాడు. "సరే ఓ పనిచేయి. నిన్ను చూస్తుంటే అయిదేళ్ళక్రితం నేను పడ్డ బాధలు గుర్తొస్తున్నాయి. రేపు పొద్దున ఎనిమిది గంటలకల్లా ఇక్కడే రెడీగా వుండు. నిన్నోచోటికి తీసుకువెళతాను"

"ఎక్కడికి?" శంకర్ ఆత్రుతగా అడిగాడు.

"సస్పెన్స్. రేపు తెలుస్తుందిగా. బై..." అనేసి మహేష్ వెళ్ళిపోయాడు.

రేపటిమీద ఆశతో శంకర్ తన రూమ్

వైపు కదిలాడు.



"ఎవరైనా చచ్చారా ఏమిటి? ఎప్పుడూ ఏడుస్తూ కూర్చుంటావు? "

భర్త మాటలకు ఆమె కళ్ళు తుడుచుకుంది. అయినా కళ్ళలోంచి ధారాపాతంగా కన్నీరు కారుతూనే వుంది.

"ఎందుకే నన్నిలా చిత్రవధ చేస్తున్నావు? " ఆయన గొంతు పెద్దదిచేసి అరిచాడు.

"అబ్బాయి కన్పించక నెలరోజులవుతోందండీ..."

"కన్పించకపోవటానికి వాడేమన్నా తప్పిపోయాడనుకున్నావా? వళ్ళు కొవ్వెక్కి ఇంట్లోంచి పారిపోయాడు" ఆయన కోపంగా భార్యతో అన్నాడు. "సిన్మాల్లో చేరి భ్రష్టుపట్టేందుకు నీ సుపుత్రుడు ఇంట్లోంచి పారిపోయాడు. వాడేదో పసిపిల్లాడు తప్పిపోయినట్లుగా ఇంటికప్పు ఎగిరిపోయేలా నువ్వు శోకాలు పెడుతున్నావు"

ఆమె వెక్కుతూనే అంది. "తల్లికి బిడ్డ ఎప్పటికీ పసివాడేనండీ"

"ఆహా... అవునా! తల్లీబిడ్డలకు ఒకరిమీద ఒకళ్లకు తెగ ప్రేమ కారిపోతూవుంది. మధ్యలో నేనే రాక్షస ముండాకొడుకుని అంతేగా! వాడు చేసినదానికి వూళ్ళో తలెత్తుకు తిరగలేకపోతున్నాను"

"అంత కానిపని ఏంచేశాడండీ? "

"ఏంచేశాడా? ఊళ్ళో ప్రతి అడ్డమైన వెధవా 'ఏమండీ మీ అబ్బాయి సిన్మాలో చేరటానికి ఇంట్లోంచి పారిపోయాడంటగా. అయ్యో పాపం' అంటూ సానుభూతి చూపిస్తుంటే నాకు వంటికి గొడ్డుకారం రాసుకున్నట్లుగా వుంది. అది చాలదా ఏమిటీ? "

ఆమె మళ్ళీ రోదించడం ప్రారంభించింది.

భార్యను తిట్టేందుకు ఆయనకు నోరు రాలేదు. అందుకే గదిలోంచి బైట వరండాలోకి నడిచాడాయన. ఆయన గుండె మండిపోతోంది. చిన్న పల్లెటూరు. మంచైనా చెడైనా రచ్చబండ దగ్గర నలుగురూ చేరి నాలుగు రకాలుగా అనుకుంటారు. అందులో హేళన, వ్యంగ్యం పాలు కాస్త ఎక్కువగానే వుంటుంది. తాతముత్తాతల కాలంనుండీ వాళ్ళ కుటుంబం పదిమంది నోళ్ళలో పడకుండా గౌరవంగా బతుకుతూ వస్తున్నారు. అటువంటిది ఇన్నాళ్లకు... వీడి కారణంగా...

ఇంట్లో భార్య ఏడుస్తోంది.

వీధిలో తను తలెత్తుకు తిరగలేకపోతున్నాడు. కుటుంబ మర్యాదలు మంటగలిపి దరిద్రుడు సిన్మాల్లో చేరేందుకు పారిపోయాడు. 'ఇంక నాకు కొడుకు లేనట్లే. చచ్చాడనుకుంటాను' మనసులోనే ఆయన పళ్ళు నూరుకున్నాడు.

ఐపీలు పెట్టినవాళ్ళు, రేప్‌లు చేసినవాళ్ళు, బ్లాక్ మార్కెటింగ్ చేసేవాళ్ళూ, దొంగ బంగారం అమ్మేవాళ్ళూ, పొద్దున్న లేస్తే ఎవరో ఒకరి కొంపకు నిప్పెట్టకుండా బతకలేనివాళ్ళు వీళ్ళంతా రొమ్ములు విరుచుకుని వీధుల్లో సగర్వంగా నడుస్తుంటే.

మధ్యతరగతి ఫాల్స్ ప్రెస్టేజీని అణువణువునా వంటబట్టించుకున్న పురుషోత్తమరావుగారు తన కొడుకు ఏదో అంతర్జాతీయ స్కామ్ చేసినట్లుగా గిల్టీగా ఫీలవుతూ బాధపడిపోతున్నాడు.





మిడిల్‌క్లాస్ మెంటాలిటీలో మార్పు రానంతవరకూ ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు.

★ ★ ★

ఉదయం ఏడున్నరకే ఇరానీ హోటల్ దగ్గరకు చేరుకున్నాడు శంకర్.

అతని మనస్సంతా తీవ్రమైన టెన్షన్‌తో నిండివుంది. మహేష్ తనను ఎక్కడకు తీసుకువెళతాడు? ఎందుకు రమ్మన్నాడు?

ఎనిమిదీ పదిహేను నిమిషాలకు తెల్ల రంగు అంబాసిడర్ కారొచ్చి హోటల్ ముందు ఆగింది. కారు దిగకుండా విండో లోంచి తల బైటపెట్టి శంకర్‌ను కేకేశాడు మహేష్.

శంకర్ గబగబా కారు దగ్గరకు వచ్చాడు.

"బండెక్కు శంకర్"

"ఎక్కడికి? "

"ఎక్కు చెబుతాను"

శంకర్ కారు ఎక్కిన తర్వాత అది బయలుదేరింది. కార్‌లో మహేష్, డ్రైవర్ కాకుండా ఇంకో ఇద్దరున్నారు. మహేష్ ఒళ్ళో ఓ పెద్ద సూట్‌కేస్ వుంది. టెన్షన్ తట్టుకోలేక మళ్ళీ అడిగాడు. "ఎక్కడికి వెళుతున్నాం మహేష్? "

"షూటింగ్‌కి..."

"షూటింగ్‌కా? " శంకర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును... షూటింగే" అంటూ మహేష్ సిగరెట్ వెలిగించాడు.

అరగంట తర్వాత కార్ జూబ్లీహిల్స్‌లో వున్న ఓ అత్యంత ఆధునికమైన బంగ్లా ముందు ఆగింది. అప్పటికే అక్కడ హడావుడిగా వుంది. బంగ్లాముందు ఆగివున్న వాన్ లోంచి లైట్లు, ట్రాలీ, స్టాండ్‌లు దించుతున్నారు.

"కెమేరా వచ్చిందా? " ఎవరో గట్టిగా కేకేశారు.

"వచ్చింది సార్..." అంటూ మహేష్ తన వెంట తెచ్చిన సూట్‌కేస్ పట్టుకుని బంగ్లా లోపలకు నడిచాడు. లోపల హాల్లో లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. మనుష్యులు హడావుడిగా తిరుగుతున్నారు.

'ఇంద్రభవనం' అని చందమామ పుస్తకాల్లో చదువుకోవటమే కానీ ప్రత్యక్షంగా చూసిందిలేదు. శంకర్ ఆ బంగ్లాను లోపల వున్న ఇంటీరియర్ డెకేరేషన్‌ను అబ్బురంగా చూశాడు.

సోఫాలు, పాలరాతి ఫ్లోర్, షాండ్లియర్స్, ఫర్నిచర్, ఇండోర్‌ప్లాంట్స్, ఇండోర్‌ఫౌంటెన్, గోడలకు వేలాడుతున్న ఆయిల్ పెయింటింగ్స్, చల్లగా తగులుతున్న సెంట్రల్ ఏసీ పరిమళం.

మహేష్ స్టాండ్‌కు కెమేరా ఫిక్స్ చేస్తున్నాడు.

కొత్తగా స్కూల్లో చేరిన పిల్లవాడు స్కూల్ వాతావరణాన్ని ఎంత దిగ్భ్రమతో చూస్తాడో అంత దిగ్భ్రమతో శంకర్ ఆ షూటింగ్ వాతావరణాన్ని పరిశీలించసాగాడు.

గంట తర్వాత షూటింగ్ మొదలయ్యింది.

ఫుల్‌సూట్‌లో లావుగా వున్న వ్యక్తి ఎవరో మేడమెట్లు దిగివస్తుండగా దాన్ని షూట్ చేశారు. ఆ తర్వాత అదేవ్యక్తి హాల్లో సోఫాలో కూర్చుని స్టైయిల్‌గా ఎవరితోనో సెల్‌ఫోన్‌లో మాట్లాడుతుండగా చిత్రీకరించారు.

ఈ విధంగా అదేవ్యక్తి డైనింగ్ టేబుల్ దగ్గర కుటుంబ సభ్యులతో భోజనం చేస్తుండగా, కుక్కపిల్లతో ఆడుకుంటుండగా, పూజ గదిలో పూజ చేసుకుంటుండగా, బైట లాన్‌లో పచార్లు చేస్తుండగా, యోగా చేస్తుండగా, కార్ నడుపుకుంటుండగా సాయంత్రం వరకూ కేవలం అదే వ్యక్తిమీద షూటింగ్ జరిగింది.

శంకర్ ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు.

ఎంత గుర్తుకు తెచ్చుకుందామన్నా అతను ఏ సిన్మాల్లో చేసిందీ గుర్తుకు రావటంలేదు.

బహుశా కొత్తనటుడేమో అనుకున్నాడు. ఎంత కొత్త నటుడైనా పొద్దుట్నుంచీ సాయంత్రందాకా అతను ఏంచేస్తే అది షూటింగ్ చేయటం ఆశ్చర్యంగా అన్పించింది. మహేష్ షూటింగ్‌లో చాలా బిజీగా వున్నాడు. బిజీగా వున్నాడంటే కెమేరా భుజాన పెట్టుకుని పరుగులు పెడుతున్నాడు. శంకర్ సంగతి గుర్తున్నట్లే లేదు. మధ్యాహ్నం ఒంటిగంటకు లంచ్‌బ్రేక్ సమయంలో శంకర్ దగ్గరకు వచ్చాడు.

"భోజనం చేశావా? "

"ఫర్లేదు..." అన్నాడు శంకర్ మొహమాటంగా.

"ఫర్లేదేంటీ నీ ముఖం... రా నావెంట..." అంటూ శంకర్‌ను వెంటబెట్టు కెళ్లి మిగతావాళ్ళు భోజనం చేస్తున్నచోట కూర్చోబెట్టి తను కూర్చున్నాడు.

ప్రొడక్షన్‌వాళ్ళు ప్లేట్ చేతికిచ్చి వడ్డించడం ప్రారంభించారు. ప్రత్యేకంగా శంకర్‌ను ఎవ్వరూ పట్టించుకోలేదు. మహేష్ దగ్గరుండి మరీ అన్ని ఐటమ్స్ మళ్ళీ వడ్డించేలా చేశాడు. చికెన్, మటన్, ఎగ్స్, నెయ్యి, ఫ్రైలతో భోజనం చాలా రుచిగా వుంది. హైదరాబాద్ వచ్చిన తర్వాత శంకర్ కడుపునిండా తిన్న మంచి భోజనం అది.

లంచ్ తర్వాత "ప్యాకప్ అయిన తరువాత కలుద్దాం" అంటూ మహేష్ హడావుడిగా వెళ్ళిపోయాడు.

శంకర్ మళ్ళీ ఓ ప్రేక్షకుడి మాదిరిగా షూటింగ్ చూడటం ప్రారంభించాడు. అతన్ని ఎవ్వరూ పట్టించుకున్నది లేదు. ఎవరి హడావిడిలో వాళ్ళుండిపోయారు. నాలుగ్గంటలకు అందరికీ టీ, బిస్కెట్స్ ఇచ్చారు. టీ తాగుదామని అన్పించినా మొహమాటం అడ్డు రావటంతో శంకర్ అలాగే వుండిపోయాడు. ఎవ్వరూ ప్రత్యేకంగా అతనికి టీ ఇవ్వలేదు.

పది నిమిషాల తర్వాత ఆ సంఘటన జరిగింది.

శంకర్ ఓ మూలగా నిలబడి షూటింగ్ చూస్తున్నాడు. ఇంతలో లావుగా వున్న ఓ వ్యక్తి దగ్గరగా వచ్చి 'రేయ్...' అంటూ చిన్నగా పిలిచాడు.

శంకర్ పట్టించుకోకుండా షూటింగ్ చూస్తుండిపోవటంతో అతను దగ్గరగా వచ్చి భుజంమీద చరిచాడు.

"రేయ్... నిన్నేరా!"

"మీరు పిలిచింది నన్నేనా? " శంకర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అవున్రా నిన్నే... డైరెక్టర్‌గారికి గుట్కాలు తెమ్మన్నారంట తెచ్చావా? "

"నాకేం తెలుసు? " శంకర్ ఆశ్చర్యంగా అన్నాడు.

"ఆ మస్తాన్‌గాడికి చెప్పారేమో చూడు వెళ్ళి.."

"మస్తానెవరు? "

అతను శంకర్ వంక ఆశ్చర్యంగా చూశాడు. "నువ్వు ప్రొడక్షన్ కుర్రాడివి కాదా? "

"కాదు"

"మరెవరు నువ్వు? "

"మహేష్ ఫ్రెండ్‌ని..."

"మహేష్ అంటే ఎవరు? "

శంకర్ కెమేరా దగ్గరున్న మహేష్‌ని చూపించాక అతను "ఓ మహీగాడా... వాడికే దిక్కులేదు. డోలు వెంటతెచ్చాడన్న మాట. అయినా షూటింగ్ దగ్గర నీకేంటి పని... వెళ్ళెళ్ళు..." అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు.

అవమానంతో అతని ముఖం ఎర్రగా కందిపోయింది.

అతని జీవితంలో ఎప్పుడూ ఎవరిచేతా మాటపడి ఎరగడు. అటువంటిది ఎవరో వ్యక్తి కుక్కను అదిలించినట్లుగా విసుక్కోవడంతో పౌరుషంతో బయటకు వెళ్ళిపోయేందుకు అడుగులు వేశాడు.

ఇంతలో పదిహేనేళ్ళ కుర్రవాడు వేగంగా వచ్చి శంకర్‌కు గుట్కా పాకెట్‌లు అందిం




చాడు. శంకర్ ఏదో చెప్పబోయేంతలో "బాసూ... గుట్కాలు డైరక్టర్‌గారికి ఇచ్చేయ్... నేను టిఫిన్ సెక్షన్ దగ్గరకు వెళుతున్నా" అంటూ వచ్చినంత వేగంగా వెళ్లిపోయాడు.

శంకర్ మ్రాన్పడిపోయాడు.

ఏంచేయాలో అర్థం కాలేదు. వెళ్ళి గుట్కా పాకెట్‌లు ఇవ్వాలా వద్దా!

ఐదు నిమిషాలసేపు తనకు గుట్కాపాట్లాలు ఇచ్చిన కుర్రాడు కనబడతాడేమో తిరిగి ఇచ్చేద్దామని ఎదురుచూశాడు. ఫలితంలేదు. ఇంతలోనే 'గుట్కాలు వచ్చాయా!' అన్న కేక విన్పించేసరికి గత్యంతరం లేక వెళ్ళి డైరెక్టర్‌కు గుట్కా పొట్లాలు అందించాడు. ఆయన శంకర్‌వైపు కన్నెత్తి కూడా చూడలేదు. చాలా నిర్లక్ష్యంగా గుట్కాలు అందుకుని ఓ పాకెట్ చించి నోట్లో పోసుకున్నాడు. శంకర్ అక్కడినుంచి వచ్చేయబోతుండగా ఇంకో కుర్రాడు 'బాసూ... కాస్త టేబుల్ పట్టుకో...' అనడిగేసరికి శంకర్ చేయివేయక తప్పలేదు.

సాయంత్రం షూటింగ్ ప్యాకప్ అయ్యే సమయానికి శంకర్ ఇటువంటి చిన్నాచితకా పనులు కొన్ని చేయాల్సి వచ్చింది. మధ్యలో ఉక్రోషం, కోపంతో షూటింగ్ నుంచి వెళ్ళిపోదామనుకున్నవాడు మళ్ళీ మహేష్ తనను షూటింగ్‌కు తెచ్చాడు కాబట్టి ఆతనితో చెప్పి వెళ్ళటం కనీస సంస్కారం అన్న ఉద్దేశంతో ఆగిపోయాడు.

చూస్తుండగానే సాయంత్రం ఏడుగంటలయింది.

★ ★ ★

సాయంత్రం నిత్యచైతన్యంతో తొణికిసలాడే ప్రాంతం.

స్వర్ణాంధ్ర బార్ అండ్ రెస్టారెంట్.

లోపల మహాకోలాహలంగా వుంది వాతావరణం. అంతర్జాతీయ విషయాలు చర్చించుకునేవాళ్ళూ, బూతులు తిట్టుకునేవాళ్ళు, తమలోతామే గొణుక్కునేవాళ్లు, టీవీలో వస్తున్న వీ ఛానెల్లోని సుందరాంగుల అందాలు చూస్తూ మౌనంగా మందు కొట్టేవాళ్ళూ.. వాళ్ల ఆర్డర్లు, ఇగోలు, బూతులు భరిస్తూ ఆఖరకు వచ్చే టిప్పే ధ్యేయంగా శ్రమిస్తున్న టిప్పుసుల్తానులు. ప్రపంచం ఎటుపోయినా పట్టనట్లుగా వుండి కలెక్షన్ లెక్క పెట్టుకుంటున్న ఓనరుడు. మందు పైత్యం తలకెక్కి 'ఓవరాక్షన్' చేయకుండా కస్టమర్లకి కంట్రోల్ చేసేందుకు ఉద్దేశింపబడ్డ దృఢకాయులూ.

లిక్కర్ బాటిల్స్, సోడాసీసాలు, థమ్సప్‌లు, పెప్సీలు, చిప్స్ పాకెట్లు, సిగరెట్లు, చికెన్ 65లూ, మటన్ బుల్లెట్లూ, ప్రాన్స్ కట్లెట్లూ బార్ మొత్తం ఘుమాయించిపోతోంది.

"ఇప్పుడు చెప్పు బాసూ... మొదటిరోజు షూటింగ్ అనుభవం ఎలా వుంది? " మహేష్ లార్జ్‌పెగ్ విస్కీ సిప్‌చేసి గ్లాస్‌టేబుల్‌మీద పెట్టి బోన్‌లెస్ చికెన్‌పీస్ నములుతూ అడిగాడు.

"బానేవుంది..."

"ఏమిటంత నీరసంగా చెబుతున్నావు? "

షూటింగ్ స్పాట్‌లో జరిగింది చెబుదామన్నంత ఆవేశం వచ్చింది శంకర్‌కు. మళ్ళీ తమాయించుకున్నాడు. జరిగిందేదో జరిగిపోయింది. వాళ్ళు కావాలని తనకు పనిచెప్పలేదు. ప్రొడక్షన్ తాలూకు వ్యక్తి అనుకుని చెప్పారు. ఇంకోసారి అటువంటి ఇబ్బందికరమైన పరిస్థితి రాకుండా జాగ్రత్తపడితేసరి. అందుకే ఆ విషయం ఇంక మహేష్‌తో చర్చించదలచుకోలేదు.

"ఇంతకీ ఈరోజు జరిగిన షూటింగేమిటి? "

"ఏంటలా అడుగుతున్నావు? "

"ఏంలేదు... పొద్దున్నుంచీ ఒకేవ్యక్తి చుట్టూ కెమేరా తిరుగుతుంటే నాకేమీ అర్థం కాలేదు. మిగిలిన నటీనటులు కన్పించకపోయేసరికి ఇదేం షూటింగ్ అన్పించింది. ఇంతకీ ఆ యాక్టర్ పేరేమిటి? "

"ఏ యాక్టర్? "
"మీరు పొద్దుట్నుంచీ షూటింగ్ చేసిన యాక్టర్"
"నాకు తెలిస్తేగా నీకు చెప్పటానికి"
శంకర్ ఆశ్చర్యపోయాడు. "అతను ఎవరో తెలీకుండా ఇంతసేపు షూటింగ్ చేశారా? "
మహేష్ మళ్ళీ గ్లాస్ ఎత్తి ఇంకో సిప్ తాగి చెప్పాడు. "వాడు ఎవడయితే మాకేంటీ? వాడి దగ్గర డబ్బుంది. అది చాలు షూటింగ్ చేయటానికి"
"నాకు అర్థంకాలేదు మహేష్..."
మహేష్ అనబడే కెమేరా అసిస్టెంట్ సీనియర్ నవలారచయిత ఫ్రెష్‌గా తన దగ్గరకు కథ రాసి తీసుకొచ్చిన యువరచయిత తను చూసి నవ్వినట్లుగా నవ్వాడు.
"ఇందులో అర్థం కాకపోవటానికేముంది? వాడి దగ్గర డబ్బుంది. మేం షూటింగ్ చేశాం అంతే..."
"దానివల్ల లాభం ఏమిటి? "
"ఎవరి లాభాలు వాళ్ళకుంటాయి బాసూ... వివరంగా చెబుతాను జాగ్రత్తగా విను. మనం షూటింగ్ చేసిన వాడిదగ్గర లారీలకొద్దీ డబ్బుంది. ఆ డబ్బంతా వారి రియల్ ఎస్టేట్, ఫైనాన్స్ వ్యాపారాలు చేసి సంపాదించిందంటారు. కానీ నాకు డౌటే. వాడు ఏదో లంగాకోరుపనులు చేసి బ్రహ్మాండంగా డబ్బు గడించి పెద్దమనిషై పోయాడు. పెద్ద మనిషయిపోయిన తర్వాత సహజంగా పాపులారిటీ కావాలనిపిస్తుంది. ఫ్లాష్‌బ్యాక్‌లో ప్లాట్‌ఫారంమీద పడుకుని గుడుంబా పేకట్లు అమ్మినవాడు కూడా 'నేను కింద స్థాయినుంచి స్వయంకృషితో పైకొచ్చానని' స్టేట్‌మెంట్ ఇస్తాడు. ఆ స్వయంకృషి ఏమిటన్నది అందరికీ తెలిసినా ఎవ్వరూ మాట్లాడరు. ఎందుకంటే ఆల్‌రెడీ వాడి దగ్గర డబ్బు వుంటుంది. కాబట్టి గజ్జి తామర అన్నా వదులుతాయేమోగానీ పబ్లిసిటీ పిచ్చి మాత్రం పట్టిందంటే చచ్చేదాకా వదలదు. సరిగ్గా ఈ పాయింట్‌నే మా బాస్ క్యాష్ చేసుకుంటున్నాడు"
"ఎలా? "
"ఏముంది సింపుల్... పుల్లారావు అనే చింతపండు అమ్మే వ్యాపారికి మావాళ్ళు ఫోన్‌చేసి 'సార్ చింతపండు వ్యాపారంలో తమరు అంతర్జాతీయ స్థాయిలో పేరు గడించారని తెలిసింది. తమరు దయతో మాకు ఇంటర్వ్యూ ఇస్తే తమరి ఇంటర్వ్యూ టీవీలో ప్రముఖ ఛానెల్లో చూపిస్తాం. మీ ఇంటర్వ్యూ చూసి యువతరం స్ఫూర్తి పొంది మీ అంత గొప్పవాళ్ళు కావాలని దీక్షతో కృషి ప్రారంభిస్తారు. అందువల్ల మన యువతకు, దేశానికి ఎంతో మేలు జరుగుతుంది' అని రిక్వెస్ట్ చేస్తారు. దాంతో పుల్లారావు భూమ్మీద నడవటం మానేస్తాడు. వాడి గురించి పక్కింటివాడు కూడా పట్టించుకోకపోయినా నేను గొప్పవాడిని కాబోలు లేకపోతే టీవీవాళ్ళు ఇంటర్వ్యూ ఎందుకు చేస్తారన్న భ్రమలో పడిపోతాడు. మావాళ్ళు ఓ డొక్కు పెళ్ళిళ్ల వీడియో కెమేరా తీసుకుని థర్డ్‌హేండ్ క్యాసెట్ అందులో పెట్టి పెద్ద షూటింగ్ చేసిన బిల్డప్ ఇస్తారు"
"తర్వాత? "
"తర్వాతేముంది మా వాళ్ళు నెలరోజుల దాకా కన్పించటం కానీ, ఫోన్ చేయటంకానీ చేయరు. కానీ ఈ లోపల అవతల ఏం జరుగుతుందో తెలుసా! సదరు పుల్లారావు గారు, వారి భార్య, బిడ్డలు అందరూ గర్వంగా అడిగినవాళ్ళకు, అడగనివాళ్ళకు కూడా 'మా ఆయన ఇంటర్వ్యూ టీవీలో వస్తుంది. మా డాడీని టీవీవాళ్లు ఇంటర్వ్యూ చేశారు తెలుసా!' అంటూ స్వంత డబ్బా వాయించుకుంటారు. ఇలా వాళ్లు ఊరంతా చాటింపేసుకుని రోజూ టీవీ వంక ఆశగా చూస్తూ వుంటారు. ఈలోగా తెల్సినవాళ్ళు 'పుల్లారావుగారూ... మీ ఇంటర్వ్యూ ఏదో వస్తుందన్నారే ఎప్పుడొస్తుందీ' అని, లేక




పోతే పక్కింటావిడ 'వదినా... అన్నయ్య గారు మీ ఫ్యామిలీ అంతా మూన్ ఛానెల్లో కన్పిస్తారంటారే... రోజూ చూస్తున్నా... ఇంకా ప్రోగ్రాం రాదా ఏంటీ?' అంటూ వంకరనవ్వులు నవ్వేసరికి పుల్లారావుగారు మా బాస్‌కు ఫోన్ చేస్తారు. మా బాస్ స్టయిల్‌గా ఫోన్ ఎత్తుతాడు.

"హల్లో... కేడీ ప్రకాష్‌గారా?"

"అవును మీరెవరు?"

"పుల్లారావునండీ..."

"పుల్లారావంటే?"

"అప్పుడే మర్చిపోయారా సార్...మీరు ఇంటర్వ్యూ చేయలా ఆ పుల్లారావుని"

"ఓ మీరా సార్... సారీ ఎలా వున్నారు. ఏమిటీ సంగతులు?"

"బాగానే వున్నాను సార్. అన్నట్లు మన ఇంటర్వ్యూ ఎప్పుడు టీవీలో వస్తుంది సార్?"

"త్వరలోనే వస్తుంది సార్... కాకపోతే చిన్న ప్రాబ్లమ్. లేకపోతే ఈపాటికే బీబీసీలో కూడా వచ్చేసేది"

"ఏంటా ప్రాబ్లమ్?"

"ఏంలేదు సార్... మా యాడ్ ఏజెన్సీ వాడు హేండ్ ఇచ్చాడు. యాడ్స్ లేకుండా టీవీలో చూపిస్తే నేమునిగిపోతాను"

"కాస్త త్వరగా టీవీలో వచ్చేట్లు చూడండి సార్. తెలిసిన వాళ్ళంతా మీ ఇంటర్వ్యూ ఎప్పుడొస్తుందీ, ఎప్పుడొస్తుందీ అని అడుగుతుంటే చెప్పలేక చస్తున్నాం"

'మాకు కావల్సిందీ అదేగా!' అని మనసులో అనుకుని 'అలాగే సార్' అంటాడు మా బాస్.

నెల గడిచిపోతుంది.

జనం షూటింగ్ ఎక్కువయ్యి మళ్ళీ పుల్లారావు ఫోన్ చేస్తాడు.

"నేను సార్... పుల్లారావుని... ఇంటర్వ్యూ ఇంకా టీవీలో రాలేదు"

"చెప్పానుగా సార్. యాడ్స్ లేవు. ఏం చేయాలో అర్థం కావటంలేదు. మీ ఇంటర్వ్యూ కారణంగా రెండు లక్షలు అయ్యేటట్లుగా వుంది"

అరపూట షూటింగ్‌కు రెండు లక్షలు ఖర్చెందుకవుతుందని పుల్లారావు అడగడు. యాడ్స్ లేనిదే ఇంటర్వ్యూ టీవీలో రాదని అర్థం అయిపోతుంది. టీవీలో ఇంటర్వ్యూ రాకపోతే ముందు ఊరంతా డబ్బా కొట్టాం కాబట్టి జనంలో పరువుపోతుంది. కాబట్టి పుల్లారావే చచ్చినట్లు తన స్వంత యాడ్స్, తెల్సిన వాళ్ళ యాడ్స్ ఇప్పిస్తాడు.

ఈ యాడ్స్ టెన్షన్ నాకెందుకు అనుకుంటే 'ఆ రెండు లక్షలు నేనే ఇచ్చేస్తాను' అని రెండు లక్షలు మా బాస్‌కిస్తాడు.

మా బాస్ నలభైవేలు ఛానెల్‌కు కట్టి లక్షన్నర నొక్కేస్తాడు.

పుల్లారావు పైకి ఏడవలేక నవ్వుతూ కుటుంబం, ఫ్రెండ్స్‌తో టీవీలో ఇంటర్వ్యూ చూసుకుంటాడు. దొంగకు తేలుకుట్టినట్లుగా "డబ్బులు ఎదురిచ్చి ఇంటర్వ్యూ టీవీలో వేయించుకున్నా" అని పుల్లారావు చచ్చినా ఎవ్వరికీ చెప్పలేడు కాబట్టి మా బాస్ సేఫ్.... ఇందాక మనం చేసిన షూటింగ్ ఈటైపే. కాకపోతే ముందే మా బాస్ బేరం మాట్లాడేసుకున్నాడు కాబట్టి ఈ టెన్షన్ డ్రామా అంతా వుండదు" మహేష్ గుక్కతిప్పుకోకుండా చెప్పిందంతా విని శంకర్ తీవ్రమైన ఆశ్చర్యంతో అడిగాడు.

"ఇదంతా మోసం కాదా?"

"దీన్ని మోసం అనరు. సెంటిమెంటల్ ట్యూనింగ్ అంటారు. మా బాస్ ఆ పేరు పెట్టాడులే. అయినా ఇందులో మోసం ఏముంది? దురద వున్న వాడి ఇంటర్వ్యూ టీవీలో చూపించి వాడి దగ్గర్నుంచీ డబ్బులు తీసుకుంటున్నాం. అందులో తప్పేముంది?"

"ఇదంతా టీవీలో ఎలా చూపిస్తారు?"

"ఎందుకు చూపించరు. బిజినెస్ బాతాఖానీ అనో, సక్సెస్‌ఫుల్ బిజినెస్ పీపుల్ అనో టైటిల్ పెట్టి ఈ చెత్తంతా చూపి



స్తారు. చూశావుగా ఎదురు డబ్బులిచ్చి మేకప్ చేసుకుని మనకు రాజభోగాలు ఎరేంజ్ చేసి బ్రహ్మాండమైన ఫుడ్ పెట్టించి సదరు పబ్లిసిటీ దురదగాళ్ళు ఈ టైపు షూటింగులు చేయించుకుంటారు కాబట్టి ఆల్ హాపీస్ బాసూ..."

మహేష్ చెప్పిందంతా వినగానే శంకర్‌కు బుర్ర గిర్రున తిరిగినంత పనయ్యింది. ఎంత తెలివిగా ట్రాప్‌చేసి డబ్బు సంపాదిస్తున్నారు? జనం బలహీనతలనూ పబ్లిసిటీ పిచ్చిని ఎంత దారుణంగా క్యాష్ చేసుకుంటున్నారు?

"ఏంటి బాబూ... అంతా వినగానే బుర్ర వేడెక్కిందా? ఓ బీర్ వేస్తావా?" శంకర్‌ని నవ్వుతూ అడిగాడు మహేష్.

"వద్దు మహేష్... ఇక్కడ ఇన్ని మోసాలున్నాయా?"

మహేష్ మళ్ళీ నవ్వాడు. "దీనికే కళ్ళు తిరిగిపోతే ఎట్లా బాసూ 'కెమేరాకు తెలీకుండా రీళ్లు' కొట్టేసేంత మేధావులున్న ఫీల్డ్ ఇది. ముందు ముందు నువ్వే చూస్తావుగా!"

శంకర్‌కి అదంతా వినగానే ఎందుకో తాను తప్పు నిర్ణయం తీసుకుని ఊబిలో దిగానా అన్న ఫీలింగ్ కలిగింది ఆ క్షణంలో.

★ ★ ★

శంకర్ జీవితంలో ఓ గొప్ప మార్పుకి నాందీవాక్యం జరిగింది.

అదెలా జరిగిందంటే పొద్దున లేచినప్పటి నుంచీ రాత్రి పడుకునేదాకా శంకర్‌కు ప్రత్యక్ష నరకమే. కెరటాల్లాగా వచ్చే ఆలోచనలు అతన్ని అతలాకుతలం చేసేవి. వంటరిగా రూమ్‌లో పడుకునీ పడుకునీ భరించలేనంత బోర్‌గా అన్పించేది. కానీ చేయటానికి పనేమీ వుండేది కాదు. ఇరవైనాలుగంటలూ రోడ్డుమీద, ఇరానీ కేఫుల్లో కాలక్షేపం చేయటం అతనికి మొదటినుంచీ ఇష్టం లేదు. దాంతో సమయం జింకను మింగిన కొండచిలువలా బద్ధకంగా, సోమరిగా సాగిపోతుండేది. సిగరెట్, మందులాంటి కాలక్షేపపు వ్యవహారాల్లేకపోవటంతో అంతరాత్మ కొరడా పట్టుకుని నిరంతరం గ్యాప్ ఇవ్వకుండా ఛెళ్ళు ఛెళ్లుమంటూ బాదుతూవుండేది.

నువ్వు వచ్చింది ఎందుకు? ఏంచేస్తున్నావు? ఈమాత్రం దానికి సిటీదాకా ఎందుకు? వూళ్ళోనే అఘోరిస్తే సరిపోయేదిగా?

శంకర్‌కు పిచ్చెక్కినంత పనయ్యేది.

తల్లీతండ్రీ, చెల్లెలు గుర్తుకు వచ్చేవాళ్లు. వూరు... పొలాలు... వెన్నెల... బ్రిడ్జి... చందు... చల్లటిగాలి... ప్రశాంతమైన వాతావరణం అంతా గుర్తుకువచ్చేది. దేవాలయంలో కళ్లు మూసుకుని తన్మయత్వంతో భజన చేసుకుంటున్నవాడు కళ్ళు తెరవగానే డిస్కో డ్యాన్స్‌ల క్లబ్బులో వుండేసరికి ఎంత దిగ్భ్రాంతిగా ఫీలవుతాడో ఆవిధంగా వుంది శంకర్ పరిస్థితి. కాకపోతే ఇది అతను కోరి తెచ్చుకున్న పరిస్థితి. సిన్మా డైరెక్టర్ కావాలనుకుని ఇంట్లోంచి పారిపోవటం వల్ల సంభవించిన స్థితి.

రెండు చేతుల్లో తలపెట్టుకుని గంటలతరబడీ ఏకాంతంలో కూర్చునేవాడు. కళ్ళవెంట అప్రయత్నంగానే నీరు తిరిగేది. శంకర్ సినిక్‌గా మారేందుకు అతిసమీపస్థితిలో వున్న సమయంలో అది అతన్ని రక్షించింది.

అది అంటే లైబ్రరీ.

ఓరోజు సాయంత్రం వాకింగ్‌కు వెళుతున్న సమయంలో అతని దృష్టి లైబ్రరీ మీద పడింది. చాలాసార్లు ఆ దారిలోనే వెళ్ళినా కూడా అది ఎప్పుడూ అతని కంట పడలేదు. ఏదో శక్తి ఆకర్షించినట్లుగా శంకర్ లైబ్రరీలో అడుగుపెట్టాడు.

లైబ్రరీ నిశ్శబ్దంగా వుంది.

లైబ్రేరియన్ రిజిస్టర్‌లో ఏదో తీసుకుంటున్నాడు. చాలా తక్కువమంది జనంలో కొందరు న్యూస్‌పేపర్లు చదువుతుంటే మరి




కొందరు సిన్మా పత్రికలు తిరగేస్తున్నారు. శంకర్ ర్యాక్‌లవైపు చూశాడు. అక్కడ ఎవ్వరూ లేరు. ప్రస్తుతం జనానికి అంత తీరిక లేదు కాబట్టి ర్యాక్‌లో వున్న పుస్తకాలు తపస్సు చేసుకుంటున్న రుషుల్లా నిశ్శబ్దంగా, నిర్లిప్తంగా వున్నాయి.

శంకర్ చాలా క్యాజువల్‌గా ఆలోచించి ఓ పుస్తకం తీశాడు.

అది నెపోలియన్ జీవితచరిత్ర.

చేసే పనేమీలేదు కాబట్టి ఓ పక్కన కూర్చుని చదవటం ప్రారంభించాడు. ఎంత సమయం గడిచిందో తెలీదు. పుస్తకంలో పూర్తిగా లీనం అయిపోయాడు. ఎవరో కుదుపుతూ వుండేసరికి ఈలోకంలోకి వచ్చి అటువైపు చూశాడు.

లైబ్రేరియన్ విసుగ్గా చెబుతున్నాడు. "పిలుస్తుంటే వినబడటంలా టైం అయిపోయింది"

శంకర్ ఆశ్చర్యంగా గోడమీద వున్న గడియారంవైపు చూశాడు. ఏడున్నరయింది. అంటే సాయంత్రం ఆరుగంటలనుండి ఏడున్నరదాకా దాదాపు గంటన్నరసేపు ఎక్కడ వున్నాడో తెలీనంత ఏకాగ్రతతో చదువుతూ కూర్చున్నాడన్నమాట. అయిష్టంగానే శంకర్ లైబ్రరీలోంచి బయటకు వచ్చాడు.

ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు.

దేవీబాబు పెద్దగా పెడుతున్న గురక నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తోంది. నిద్రకోసం అర గంటసేపు అటూ ఇటూ దొర్లి ఆ తర్వాత గదిలోంచి బయటకు వచ్చాడు.

అర్థరాత్రి చాలాసేపయింది.

ప్రపంచం అంతా గాఢనిద్రలో వుంది. పైనుంచి వెన్నెల పడుతోంది. చల్లటిగాలి వీస్తుండటంతో వింజామరలు వీయబోతున్నట్లుగా చెట్ల ఆకులు కదులుతున్నాయి. ఆ నిశ్శబ్ద నీరవస్థితిలో అతనలా కూర్చునివుండగా మనసు ఆలోచించటం ప్రారంభించింది.

తను చాలా కష్టాల్లో వున్నాననుకుంటూ వచ్చాడు. కానీ నెపోలియన్‌తో పోలిస్తే ఏపాటి కష్టాలు తనవి? జగద్విజేత నెపోలియన్‌కే కష్టాలూ, కన్నీళ్ళూ తప్పనప్పుడు తనెంత?

'ఎన్ని నిద్రలేని రాత్రుళ్లు నా కన్నీళ్ళ పానం చేస్తూ ఏకాంతంగా బతికానో!' అంటాడు ఓచోట నెపోలియన్.

అంటే నెపోలియన్ బోనాపార్టీ కూడా రోదించాడనేగా? అంతటి వీరాధివీరుడు రోదించటం అన్న విషయమే అబ్బురంగా వుంది. ఏ స్థాయిలో వున్న వాళ్లకయినా కష్టాలు తప్పవన్నమాట.

నెపోలియన్ చరిత్ర చదువుతుంటే ఏదో తెలియని విద్యుత్తు ఒంట్లో ప్రవహించినట్లుగా ఫీలయ్యాడతను. ఓ పుస్తకానికి అంత శక్తి వుందా? తన బాధలనూ, దుఃఖాలనూ మరిపించే శక్తి పుస్తకాల్లో వుందా? తర్వాత ఏం జరిగిందన్న విషయం తెలుసుకునేందుకు మనస్సు ఆత్రుతత పడుతోంది కానీ టైం అయిపోవడంతో లైబ్రరీ మూసేశారు. నెపోలియన్ ఏమైపోతాడు? తన లక్ష్యాన్ని సాధించాడా?

శంకర్ రాత్రంతా కూర్చుని ఆ సాయంత్రం చదివిన నెపోలియన్ జీవితం గురించే ఆలోచిస్తూ వుండిపోయాడు.

ఓ అద్భుతక్షణం అది...

ప్రపంచంలో ఎవ్వరూ గుర్తించకపోవచ్చు పట్టించుకోకపోవచ్చు... కానీ ఓ అద్భుత క్షణం... సెల్ఫ్ పిటీతో కుంగిపోతున్న ఓ కుర్రాడిని ఓ పుస్తకం ఉత్తేజితుడిని చేయడం...

'స్నేహమేరా జీవితం' అని పాడుకుంటారు.

కానీ స్నేహం మనుష్యులతో కాకుండా పుస్తకాలతో చేస్తే ఎంత గొప్పగా స్ఫూర్తిని స్తాయో, ఓదార్పునిస్తాయో, లక్ష్యంవైపుగా ధైర్యంగా సాగిపోయే ఆత్మవిశ్వాసాన్ని ఆత్మకు అందిస్తాయో అన్న నిగూఢమైన మర్మం శంకర్‌కు త్వరలోనే తెలిసివచ్చింది.

★ ★ ★



దేవీబాబు శంకర్‌వైపు ఆశ్చర్యంగా చూశాడు.

రోజూ ఉదయం తను లేచి వెళ్ళిపోయే సమయానికి శంకర్ నిద్రపోతూ వుంటాడు. అటువంటిది పొద్దుటే లేచిపోయాడు. రాత్రంతా నిద్రలేనట్లుగా కళ్ళు ఎర్రగా వున్నా ముఖంలో ఏదో సంతోషం కనబడు తోంది.

దేవీబాబు వెళ్ళిపోయిన తర్వాత ఎనిమి దింటికే శంకర్ రూమ్‌లోనుంచి బయటప డ్డాడు. అప్పటికింకా లైబ్రరీ తెరవలేదు. అర గంటసేపు బయట అరుగుమీద కూర్చు న్నాడు.

తాళాలు తీస్తున్న లైబేరియన్ శంకర్‌వైపు ఆశ్చర్యంగా చూశాడు.

సినిమా హాళ్ళదగ్గరా, వైన్‌షాపులదగ్గరా, చికెన్ షాప్‌లదగ్గరా, రేషన్ షాపులదగ్గరా వెయిట్‌చేయడం చూశాడు కానీ ఓ లైబ్రరీ దగ్గర మనుష్యులు వెయిట్ చేయడమన్నది ఆయన అన్నేళ్ళ సర్వీస్‌లోనూ ఎప్పుడూ చూళ్ళేదు.

లైబ్రరీ తెరిచీ తెరవడం ఆలస్యం తల్లి పాలకోసం పిల్లవాడు ఎలా వెతుక్కుంటాడో ఆ విధంగా పుస్తకాల ర్యాక్‌లమధ్యకు శంకర్ దూసుకుపోయాడు. నెపోలియన్ పుస్తకం తీసుకుని చదవడం ప్రారంభించాడు.

మధ్యాహ్నం మూడుగంటలకు చదవడం పూర్తిచేసి తల ఎత్తాడు.

అతని ముఖంలో ఏదో సరికొత్త కాంతి, సంతోషం, ఆనందం. మరోవైపు దుఃఖం. బాధావీచికలు మిళితమై కన్పిస్తున్నాయి. పొద్దున్నుంచీ గ్లాసు మంచినీళ్ళు తప్ప అత నేమీ తినలేదు. అయినా ఆకలిగాలేదు.

ఆత్మకు, మనస్సుకూ షడ్రసోపేతమైన భోజనం దొరికింది. అదో నిరంతర దాహం. ఎప్పటికీ తీరని దాహం.

అతను ఇంకో పుస్తకం తీసుకుని చద వడం ప్రారంభించాడు. అది చలం మ్యూజింగ్స్.

సాయంత్రం లైబ్రరీ మూసేసే సమయా నికి నూతనోత్సాహంతో శంకర్ ప్రపంచం లోకి అడుగుపెట్టాడు. అతని మనస్సూ, శరీరం ఆనందంలో తేలిపోతున్నాయి. ఏమీ తినకపోయినా నీరసంగాలేదు. శరీరంలో విద్యుత్ ప్రవహిస్తున్నట్లుగా వుంది.

తనకు ఏం కావాలో అతనికి అర్థమైంది.

హైదరాబాద్ వచ్చిన నలభై ఎనిమిది రోజులకాలంలో ప్రతిరోజూ నరకమే. లేదనే... దిగులే. కానీ ఇంతకాలం తర్వాత అతని మనస్సు ఆనందంగావుంది. సంతృప్తి గావుంది.

చదవడం అనేది ఇంత గొప్ప సంతృప్తినీ, ఓదార్పునూ ఇస్తుందని అతనికి ఎవరూ చెప్పలేదు. చెప్పినా వినేవాడుకాదు. ఎవరికి వాళ్ళు శోధించి తెల్సుకోవాల్సిన సత్యం అది.

అదీ మొదలు...

శంకర్ అనే కుర్రాడి జీవితంలో నూతన అధ్యాయం మొదలైంది.

చదవడం... చదవడం... చదవడం... అంతే...

విశ్వనాథ సత్యనారాయణ, చలం, గోరా, అడవి బాపిరాజు, గురజాడ, శ్రీశ్రీ... జీవిత చరిత్రలూ, ప్రపంచ చరిత్రలూ, కవిత్వాలూ, కథలు, డేల్‌కార్నేజీ, నెపోలియన్ హిల్, నార్మన్, విన్సెంట్‌పీలే... మొపాసా, చెకోవ్, టాల్‌స్టాయ్, కీట్స్, శోభాడే.

మొదట్లో ఇంగ్లీష్ అర్థమయ్యేదికాదు. చిన్న పాకెట్ డిక్షనరీ కొనుక్కుని అర్థంచేసు కుని గుణించుకుంటూ చదివేవాడు. అద్భుత మైన వాక్యం, కొటేషన్ కనబడితే నోట్‌బు క్‌లో నోట్ చేసుకునేవాడు.

క్రమంగా అతని ఆలోచనాపరిధి, జ్ఞానం విస్తృతం కాసాగాయి.

చదవడంలో చాలారకాలున్నాయి. కాలక్షే పంకోసం చదవడం వేరు. జిజ్ఞాసతో శోధిం చేందుకు చదవడం వేరు. లైబ్రరీలో డిపా జిట్ కట్టి పుస్తకాలు రూమ్‌కి తెచ్చుకునే వాడు. రాత్రింబవళ్ళూ అదేపనిగా చదువు





తూనే వుండేవాడు.

సాయంత్రం తీసుకెళ్ళిన పుస్తకం ఉదయా నికల్లా తీసుకువచ్చి కొత్తపుస్తకం తీసుకునే శంకర్‌ని చూసి లైబ్రేరియన్ ఆశ్చర్యపోయే వాడు.

ఇంతవరకూ ఆయన న్యూస్‌పేపర్లూ సిన్మాపత్రికలూ ఉత్సుకతతో చదివేవాళ్ళనే చూశాడు కానీ శ్రీశ్రీ మహాప్రస్థానాన్ని, జపాన్ చరిత్రనూ ఒకే ఇంట్రస్ట్‌తో చదివేవా ళ్ళను చూడలేదు.

నిద్రాహారాలు కూడా మర్చిపోయి చదువు తున్న శంకర్‌ని చూసి దేవీబాబు హేళనగా "ఏంటీ, ఏదైనా ఎగ్జామ్ రాస్తున్నావా? " అనే వాడు. శంకర్ మౌనంగా వుండిపోయేవాడు తప్ప సమాధానం చెప్పేవాడుకాదు.

చదవడం అనేది అతనిలో గొప్పమార్పుని తెచ్చింది.

మనుష్యుల బలహీనతలూ, దుర్మార్గాలు ఫీలింగ్స్, కుట్రలు, వెన్నుపోట్లు, ఆర్ద్రత, వంచనా, మూర్ఖత్వాల గురించి ఏ గురువూ చెప్పలేనన్ని విషయాలు పుస్తకాలు అతనికి చెప్పాయి.

ఇప్పుడతని జీవితంలో నిరుత్సాహానికి, బోర్‌కి స్థానంలేదు.

ఒకప్పటి దిగులూ, వేదనా, సెల్ఫ్‌పిటీ, నెగెటివ్ ఫీలింగ్స్ పత్తాలేకుండా పోయాయి.

అక్షరాలను మధిస్తున్న రుషిలా చదు వుతూ వుండేవాడు.

గతంలో చాలా తరుచుగా డిప్రెషన్ చుట్టుముట్టి చీల్చి చెండాడుతున్న సమ యంలో "ఇదంతా ఎందుకు? ఆత్మహత్య చేసుకుంటే" అన్పించేది.

ప్రస్తుతం ఆ తరహా నెగెటివ్ ఆలోచన లకు అతని మెదడులో స్థానంలేదు.

ఆ విధంగా ఆత్మహత్య చేసుకోకుండా లైబ్రరీ శంకర్‌ని రక్షించింది.

★ ★ ★

ఆరునెలలు గడిచిపోయాయి.

శంకర్ దాదాపుగా ఆ చిన్న లైబ్రరీలోని పుస్తకాలన్నీ చదివేశాడు. సెంట్రల్ లైబ్రరీ కెళ్ళి చదవడం ప్రారంభించాడు. ముఖ్య మైన సమస్య సిటీబస్ ఫేర్. చందు ఇచ్చిన రెండువేలు ఎంత జాగ్రత్తగా ఖర్చుపెట్టు కున్నా అయిపోయాయి. దేవీబాబు దగ్గర అడగడం అంటే ఏదోలా వుండేది. దూర మైనా సరే నడిచివెళ్ళేవాడు. పుస్తకాలు చది విన సంతృప్తితో పది కిలోమీటర్లు నడిచిన అలసట గుర్తుకువచ్చేదికాదు.

చరిత్ర, భూగోళం, సైన్స్, ఫిక్షన్, కవిత్వం, వ్యాసాలు, కథలు, నవలలూ, సమీక్షలూ, మెడిసన్, కామెడీ హర్రర్ ఇలా ఒకటనిలేదు అన్నీ విస్తృతంగా చదివేవాడు. నోట్స్ తయారుచేసుకునేవాడు.

చదవడం కారణంగా అతని జీవితంలో వచ్చిన మరో ముఖ్యమైన మార్పు క్రమశి క్షణ.

రాత్రి ఎంత లేట్‌గా పడుకున్నా నిద్ర రాకపోయినా అతను తెల్లవారుఝామున నాలుగ్గంటలకల్లా లేచిపోయేవాడు. గంట సేపు మేడమీదే వ్యాయామం, బ్రీతింగ్ ఎక్సర్‌సైజ్‌లు చేసుకునేవాడు. స్నానం చేసిన తర్వాత అరగంటసేపు ధ్యానం చేసే వాడు. దేవీబాబు దీన్నంతా చూసి ఎన్ని జోకులు వేసినా పట్టించుకునేవాడుకాదు.

ఓ మహా యుద్ధానికి ముందు శారీర కంగా, మానసికంగా సిద్ధంగా వుండాలని అర్థమైంది.

ఓరోజు మధ్యాహ్నం నాలుగ్గంటలవేళ శంకర్ రూమ్‌లో పుస్తకం చదువుకుంటు న్నాడు. ఆరోజు లైబ్రరీకి శలవు కావడంవల్ల వెళ్ళలేదు. అందుకే ముందటిరోజున రెండు పుస్తకాలు తెచ్చుకున్నాడు.

చాణుక్యుడి అర్థశాస్త్రం అది.

అర్థశాస్త్రం అంటే ఆర్థికశాస్త్రం అనుకుంటా రుకానీ, రాజనీతి శాస్త్రంమీద పుస్తకం అది. రాజువిధులు, బాధ్యతలు, గూఢచార వ్యవస్థ, శత్రువులను ఎదుర్కోవడం, ఖజానా

నిర్వహణ, మంత్రిమండలి, ప్రజల శ్రేయస్సు ప్రతి విషయంమీదా చాణక్యుడు దాదాపు రెండువేల సంవత్సరాలక్రితమే ఎంతో వివరంగా రాశాడు.

శత్రుదేశ రహస్యాలను సంపాదించడానికి రాజు వేశ్యలను నియమించాలని చాణక్యుడు ఓచోట చెబుతాడు. అది చదివేసరికి శంకర్ ఒళ్ళు జలదరించింది. మేకివెల్లీ, చాణక్యుడు ఏవిధంగా సమవుజ్జీలో అర్థమైంది. మరింత శ్రద్ధగా అతను అర్థశాస్త్రాన్ని చదువుతూ వుండగా రూమ్ తలుపు శబ్దమయ్యింది.

శంకర్ విసుగ్గా తలుపువంక చూశాడు.

ఒకప్పుడు బోర్‌ను భరించలేక ఎవరైనా రూమ్‌కి వస్తే బాగుండు కాలక్షేపం అవుతుందనుకునేవాడు. ఇప్పుడు చదువుతున్న టైంలో ఏమాత్రం డిస్టర్బెన్స్ అయినా భరించలేకపోతున్నాడు.

తలుపు మళ్ళీ శబ్దమయ్యేసరికి తప్పనిసరై లేచివెళ్ళి తలుపుతీశాడు.

ముందుగా చౌకరకం స్ప్రే వాసన గుప్పున కొట్టింది. నవ్వుతూ ఓ అమ్మాయి నిలబడివుంది. ఇరవై ఏళ్ళ వయస్సు వుండచ్చు. నీలంరంగు చుడీదార్ వేసుకుని వుంది. చామనఛాయ రంగుతో సన్నగా వుంధి.

శంకర్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు. "ఎవరు కావాలి మీకు"

"ఇది దేవీ రూమేనా? "

"అవును"

"దేవీ లేడా? "

"లేడు"

"దేవీకి నువ్వేమవుతావు? "

"ఫ్రెండ్‌ని"

"అవునా? నీ పేరేంటీ? "

"శంకర్..."

ఆ అమ్మాయి స్కాన్ చేస్తున్నట్టుగా అతనివంక చూసింది. ఆపాదమస్తకం తడిమేస్తున్న ఆ చూపులు చాలా ఇబ్బందిగా అన్పించడంతో శంకర్ అడిగాడు.

"మీరెవరు? "

"నేనా? " ఆ అమ్మాయి దీర్ఘంతీస్తూ నవ్వింది. "దేవీనడుగు చెబుతాడు..."

"దేవీకి ఏమన్నా చెప్పమంటారా? "

"నీ లవర్ వచ్చిందని చెప్పు.."

"లవరా? " శంకర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆ... లవర్నే... దేవీ ఎప్పుడూ నా గురించి నీకు చెప్పలేదా... డైరక్టర్ అయిపోదామని ఇంట్లోంచి పారిపోయి వచ్చింది నువ్వేనా? "

శంకర్ సమాధానం చెప్పలేదు.

"నన్ను కాస్త లోపలికి రానిస్తావా? "

"దేవీ ఎప్పుడొస్తాడో తెలీదు"

"అంటే వెళ్ళిపోమంటావా? నువ్వీ రూమ్‌కి కొత్త కానీ నాకీ రూమ్ పాతదే..."

గత్యంతరం లేక శంకర్ అడ్డు తప్పుకుని దారిచ్చాడు. ఆ అమ్మాయి చొరవగా లోపలకు వచ్చి చాపమీద కూర్చుంది. నిలబడే వున్న శంకర్‌ని చూసి,

"నువ్వు కూడా కూర్చో" అంది.

"ఫర్లేదు..."

"అంతవరకూ శంకర్ చదువుతున్న పుస్తకం అటూఇటూ తిప్పిచూసింది.

"ఇదేం పుస్తకం? "

"అర్థశాస్త్రం..."

"అంటే? "

"అంటే... అంటే..." ఎలా చెప్పాలో అర్థంకాలేదు.

"సర్లే... ఇవన్నీ నాకు ఎక్కువులే కానీ ఏదైనా సిన్మాపుస్తకం వుందా? "

"లేదు..."

ఆ అమ్మాయి శంకర్‌వంక చూసి, "ఏంటలా బిగుసుకుపోయావు కాస్త ఫ్రీగా వుండు" అంది.

'నువ్వు బైటకు దయచేస్తే అలాగే వుంటాను' అని మనసులో అనుకున్నాడు.

"ఏంటి మాట్లాడవు? "

"ఏం మాట్లాడమంటారు? " శంకర్




ఇబ్బందిగా కదులుతూ అడిగాడు.

"ఏదైనా మాట్లాడు. అన్నట్లు నీకు గర్ల్ ఫ్రెండ్స్ వున్నారా? "

"లేరు"

"లేరా? " ఆ అమ్మాయి ఎనిమిదో వింతను వింటున్నట్లుగా ఉంది. "మనిషి చూస్తే బాగానే వున్నావు. గర్ల్‌ఫ్రెండ్స్ లేక పోవడం ఏమిటీ? సర్లే నాకెందుకులేగానీ డైరక్టరయిపోదామని ఇట్నించి పారిపోయి వచ్చావుట నిజమేనా? " తాపీగా అడిగింది.

శంకర్‌కి వళ్ళు మండింది.

ప్రశాంతంగా చదువుకుంటుంటే వచ్చి డిస్టర్బ్ చేసింది కాకుండా అడ్డమైన చెత్త ప్రశ్నలన్నీ అడుగుతోంది, పైపెచ్చు దేవీ లవర్ని అంటోంది. అసలు దేవీగాడికి బుద్ధి లేదు. తన గురించి అందరిదగ్గరా రికార్డు వేస్తున్నాడన్నమాట...

"సమాధానం చెప్పవే? "

"అది నీకు అనవసర విషయం..."

"ఓయబ్బో కోపమే..." అంటూ నవ్వింది. "చెప్పకపోతే పోయావు. నన్ను మాత్రం మర్చిపోకు... డైరక్టరయితే నాకు మంచి వేషాలు ఇవ్వాలి"

"మీరేం చేస్తుంటారు? " అప్రయత్నంగా అడిగేశాడు.

"నేనా? సిన్మాల్లో వేషాలేస్తూ ఉంటాను. వేషాలంటే హీరోయిన్ వేషాలనుకోకు... నా పర్సనాలిటీకి హీరోయిన్ వేషం ఏ వెధవి స్తాడ్లే. అందుకే ఎక్స్‌ట్రా వేషాలేస్తుంటాను. నువ్వు డైరక్టరయితే నన్ను హీరోయిన్‌గా చేస్తావా ఏంటీ? " అంది వెకిలిగా నవ్వుతూ.

మాటకుముందు రెండుసార్లు, మాట తర్వాత పదిసార్లు పదే పదే నవ్వే ఆమెను చూస్తే ఏ మాత్రం సదభిప్రాయం కలగ లేదు శంకర్‌కి. ఆమె ఎప్పుడు వెళ్ళిపో తుందా అన్నట్లుగా ముళ్ళమీద నిలబడినట్లు నిలుచున్నాడు.

"ఎంతసేపు నిలబడతావు కూర్చో"

"ఫర్లేదు"

"నిన్నేం కొరుక్కుతినన్లే. కూర్చో పర్సనా లిటీ బాగానేవుందిగా. డైరక్టరయ్యేలోపు ఏదైనా వేషాలెయ్యచ్చుగా"

"నాకు ఇంట్రెస్టులేదు"

"ఇంట్రెస్ట్ లేదా? " మళ్ళీ ఆశ్చర్యపో యింది.

"ముక్కూమొహం ఓ దార్లోలేని నా కొడు కులంతా హీరోలయిపోదామని తెగ ఇరగబ డిపోతుంటే చక్కగా వున్నావు వేషాలెయ్య టానికేం దొబ్బిడాయి? "

ఆమె తిడుతోందో, పొగుడుతోందో అర్థం కాక మౌనంగా వుండిపోయాడు.

"నీకు ఆడవాళ్ళతో మాట్లాడాలంటే సిగ్గా ఏంటీ? "

"అదేంలేదు..."

"దేవీ ఎప్పుడొస్తాడు? "

"నాకుతెలీదు"

"దేవీకోసం రూమ్‌కి ఎవరైనా అమ్మాయి లొస్తారా? "

"రారు..."

"అబద్ధం చెప్పకు"

"నిజంగానే రారు"

"నువ్వు చెబితే నమ్ముతాలే. దేవీ వచ్చేట ట్లులేదు. నేనొచ్చిపోయానని చెప్పు. మళ్ళీ వస్తానులే... బై" మరోసారి వెకిలిగా నవ్వి వెళ్ళిపోయిందా యువతి.

శంకర్ రెండో ఆలోచన లేకుండా అర్థశా స్త్రంలో మునిగిపోయాడు.

★ ★ ★

"డియర్ చందూ...

బావున్నావా! నేను బాగానే వున్నాను. అమ్మానాన్నా, చెల్లీ అంతా క్షేమమేననుకుం టాను. నేనొచ్చి ఆరునెలలవుతోంది. సాధిం చింది ఏమీలేదు. ఇక్కడి పరిస్థితులు చెప్పి నిన్ను కూడా బాధపెట్టలేను. దేవీ చాలా సహాయంగా ఉంటున్నాడు. నడిసము ద్రంలో నావలా వుంది నా పరిస్థితి. తిరిగి ఊరికి వచ్చేద్దామా అన్పిస్తుందో క్షణం. కానీ

మళ్ళీ నువ్వు నామీద పెట్టుకున్న నమ్మకం వమ్ము చేయలేను. అందుకే కష్టాలతో పోరాటం చేయాలని నిశ్చయించుకున్నాను. నేను ఈమధ్య ఓ అద్భుతమైన వాక్యం చదివాను. అదేమిటంటే ఎవడైతే తను విజయం సాధించగలనని ప్రగాఢంగా నమ్ముతాడో వాడు తప్పకుండా విజయం సాధిస్తాడట..." ఆ విధంగా నామీద నేను నమ్మకాన్ని పటిష్టంగా ఏర్పరచుకొని ముందడుగు వేస్తున్నాను. విజయం సాధించగలననే నమ్ముతున్నాను. నీ మిత్రుడు ఏనాటికయినా గొప్పవాడవుతాడని నువ్వు కూడా నమ్ముతూవుండు...

యువర్స్...
శంకర్

ఉత్తరం పోస్ట్‌చేసి శంకర్ బయలుదేరాడు.

హైదరాబాద్‌కు వచ్చిన ఆరునెలల తర్వాత స్వంతంగా చేయబోతున్న మొదటి ప్రయత్నం.



డబ్బుంటే కొండమీద కోతి దిగొస్తుందంటారు కానీ ఈ ఆధునిక కాలంలో డబ్బుంటే కొండలమీద కోటల్లాంటి ఇళ్ళు ఏర్పడతాయి. లక్షల్లోనో, కోట్లలోనో ఖర్చుపెట్టి నిర్మింపబడ్డ ఆకాశహర్మ్యాలు. ఒక్కొక్కటీ ఒక్కో అద్భుతం. ఎత్తైన గేట్లు, గార్డెన్, స్విమ్మింగ్‌పూల్స్, ఇళ్ళలోనే చిన్న ఎలివేటర్... డబ్బుంటే ఈ రోజుల్లో ఏదైనా సృష్టించవచ్చు అయితే ఆ డబ్బును ఎలా సంపాదించారన్నది వేరే విషయం.

శంకర్ తన చేతిలోవున్న ఎడ్రస్ కాగితం వంక మరోసారి చూసుకున్నాడు.

అదే ఇల్లు... ఇల్లుకాదు భవంతి. డైనోసర్‌లా ఎత్తుగా, హాయిగా హుందాగా నిలబడివుంది. గేటు మూసివుంది. గేటుముందు ఇద్దరు వాచ్‌మెన్‌లు. తనకు కావలసిన అడ్రస్ అదేనని అర్థమైన తర్వాత శంకర్ గేటుదగ్గరకు నడిచాడు.

"ఏం కావాలి? " ఓ వాచ్‌మెన్ నిర్లక్ష్యంగా అడిగాడు.

"సురేంద్రగారిని కలవాలి"

"ఏంటీ పని? "

"పర్సనల్"

"పర్సనలా? " రెండో వాచ్‌మెన్ ఫెళ్ళున నవ్వాడు.

"మీ ఇద్దరిమధ్యా అంత పర్సనల్ విషయాలున్నాయా ఏంటీ? "

"నేను అతన్ని కలవాలి? "

"కుదరదు"

"ఎందుకు? "

"ఎందుకంటే రోజుకు లక్షాతొంభైమంది డబ్బాగాళ్ళొచ్చి ఇదే డైలాగేస్తారు. మేం లోపలకు పంపామనుకో వాళ్ళు మమ్మల్ని బైటకు పంపుతారు. అందుకని కుదరదు"

"ప్లీజ్... దయచేసి అర్థం చేసుకోండి. చాలా అర్జెంట్"

"ఏంటో అంత అర్జంటు? " మొదటి వాచ్‌మన్ మరింత హేళనగా అడిగాడు.

శంకర్ ఏం చెప్పాలో తెలీక మౌనంగా నిలబడిపోయాడు.

"సిన్మాలో వేషమేగా? "

"కాదు"

"మరింకేంటి? ఆ... బాస్ దగ్గర అసి





స్టెంట్ డైరక్టర్‌గా చేరేందుకా? "

శంకర్ ఆశ్చర్యపోయాడు.

"మీకెలా తెలుసు? "

వాచ్‌మన్‌లిద్దరూ ఒకరిముఖాలొకరు చూసుకుని సిన్మా స్టయిల్లో ఫెళ్ళుమని నవ్వారు.

"పదేళ్ళనుంచీ చూస్తున్నాం డ్రామా అంతా... ఆ మాత్రం తెలీదా ఏంటీ... అది సరేకానీ నాయనా ఇంతకీ ఏ ఊరునుంచి పారిపోయివచ్చావో కాస్త చెప్పు"

శంకర్ మరింత ఆశ్చర్యపోయాడు. తను ఇంట్లోనుంచి పారిపోయివచ్చాడని వీళ్ళకు ఎలా తెలుసు. కొంపదీసి నాన్నగారు పేపర్లో ప్రకటించారా ఏమిటీ అనుకున్నాడు.

"ఏ ఊరు బాబూ మనది? "

"విజయవాడ"

"సిన్మాలు బాగా చూస్తుంటావా? "

"అవును"

"చెప్పవే... అదీ సంగతి. మణిరత్నం అంత పెద్ద డైరక్టరయిపోవాలని ఇంట్లోంచి పారిపోయొచ్చావన్నమాట"

"ఆ విషయం మీకెలా తెలుసు? "

వాళ్ళిద్దరూ మళ్ళీ పిల్లీ-ఎలకా చెలగాటం టైపులో నవ్వారు. "ఇప్పటిదాకా నీలాంటివాళ్ళను కొన్నివందలమందిని చూశాం బాబూ... తెరమీద చిరంజీవిని, తెరవెనుక రాఘవేంద్రరావునీ చూసి ఇళ్ళలోంచి పారిపోయి రావడం, ఇలా పెద్దోళ్ళ ఇళ్ళచుట్టూ కుక్కలు తిరిగినట్లు తిరగడం... మా సర్వీసులో ఇవన్నీ మామూలే"

కుక్కలు అనగానే శంకర్‌కు పౌరుషం పొడుచుకువచ్చింది. కోపంగా, "కొంచెం మర్యాదగా మాట్లాడండి" అన్నాడు.

"నీకేంట్రా మర్యాద? ఫో... ఫో ముందిక్కడ్నుంచి"

"వెళ్ళకపోతే ఏం చేస్తారు? "

"ఏం చేస్తామా? లోపల్నుంచి కుక్కల్ని పిలుస్తాం. వాటికి నీలాంటి అసిస్టెంట్ డైరెక్టర్ల రక్తమంటే మహా ఇష్టం"

"కాస్త మనుషుల్లాగా ప్రవర్తించడం నేర్చుకోండి"

"పోరా డబ్బా... ఇంట్లోంచి పారిపోయి వచ్చిన ఫ్లాట్‌ఫాంగాడివి మాకు చెప్పేదేంట్రా. ఇంకా ఇక్కడున్నావంటే కుక్కలు పట్టిపీకుతాయి" వాచ్‌మన్‌లిద్దరూ రఫ్‌గా శంకర్ భుజంమీద చేయివేసి వెనక్కు నెట్టారు.

అతనికి భరించలేనంత కోపం వచ్చింది. వాళ్ళతో కలబడాలనుకున్నాడు. ఎంతో దారుణంగా, రాక్షసంగా ప్రవర్తిస్తున్నారు వీళ్ళు అనుకున్నాడు.

మళ్ళీ అంతలోనే 'ఈ మూర్ఖులతో వాదనేంటి? ' అనుకుంటూ వెనుదిరిగాడు.

ఇటువంటి మూర్ఖులు, శాడిస్టులు చాలా మందున్నారన్న సంగతి అతనికి తెలీదు.

నడినెత్తిన ఎండ మాడుస్తోంది. వడగాలి రివ్వున వీస్తోంది. మధ్యాహ్నం పన్నెండున్నర గంటల సమయంలో శంకర్ ఓ చెట్టు కింద నిలబడి వున్నాడు.

దూరంగా డైరెక్టర్ సురేంద్ర ఇల్లు కనపడుతోంది. అతనివైపు చూస్తూ వాచ్‌మెన్‌లిద్దరూ ఏదో చెప్పుకుని నవ్వుకుంటున్నారు. జరిగిన అవమానం గుర్తుకువచ్చి కడుపులో భగ్గుమంది.

ఎంత దుర్మార్గం?

డైరక్టర్ సురేంద్రగారిని కలవడం వీలుకాదని మర్యాదగా చెప్పచ్చుకదా. ఎంత నీచంగా మాట్లాడారు? తను ఫ్లాట్‌ఫాంగాడా? తనమీదకు కుక్కల్ని వదులుతారా?

కళ్ళు గిర్రున తిరిగినట్లుగా అన్పించాయి.

పొద్దుట్నించీ ఏమీ తినలేదు. రూమ్ నుంచి డైరక్టర్ సురేంద్ర ఇల్లు ఎనిమిది కిలోమీటర్ల దూరం. అంతదూరం నడుచుకుంటూ వచ్చాడు. తిరిగి నడుచుకుంటూనే వెళ్ళాలి. ఆఫ్టాల్ గేటు దగ్గరుండే వాచ్‌మన్లు తనను పురుగుకంటే హీనంగా ఈసడిస్తూ మాట్లాడారు. ఇంట్లోంచి పారిపోయి వచ్చావా నాయనా? అంటూ హేళన

చేశారు.

దాహంగా అన్పించి చుట్టూ చూశాడు.

దూరంగా ఓ తోపుడు బండి కనిపించింది. నాలుగు చక్రాలబండిమీద రేకులతో అడ్డం పెట్టుకోబడ్డ టీ స్టాల్... ఖరీదైన భవంతులూ, విశాలమైన రోడ్లమీద మూలగా వున్న ఆ బండి మోడ్రన్ ఆర్ట్‌మీదున్న పిచ్చిగీతలా వుంది.

శంకర్ కాళ్ళీడ్చుకుంటూ ఆ బండి దగ్గరకు చేరుకున్నాడు. అరవైఏళ్ళ వయస్సున్న వృద్ధుడు కిర్సనాయిల్ స్టౌకు గాలి కొడుతున్నాడు.

"తాతా... కొంచెం మంచినీళ్ళిస్తావా? "

వృద్ధుడి ప్లాస్టిక్ బిందెలోనుంచి సత్తుగ్లాసుతో నీళ్ళిచ్చాడు. ఎండ వేడిమికి నీళ్ళు కూడా వేడిగా వున్నాయి. అయినా గొంతెండిపోతుండేసరికి నీళ్ళుతాగాడు.

"టీ కావాలా? " వృద్ధుడు అడిగాడు.

"వద్దు" గ్లాసు అందిస్తూ అన్నాడు శంకర్.

"ఏం డబ్బుల్లేవా? "

ఈడ్చి ముఖంమీద గుద్దినట్లుగా ఫీలయ్యాడు శంకర్. తనను ముష్టోడనుకుంటున్నాడా ఏమిటీ ముసలాడు? మాసిపోయిన బట్టలతో కొద్దిగా పెరిగిన గడ్డంతో కళ్ళు లోతుకుపోయి ఎండకొట్టి నీరసంగా వున్న తన రూపం కొంచెం అటుఇటుగా అదే స్థాయిలో వుందన్న విషయం అతనికి తెలీదు. అందుకే గొంతు పెద్దదిచేసి ఉక్రోషంగా అన్నాడు.

"సరే టీ ఇవ్వు... వేడిగా వుండాలి"

స్టౌమీద మరుగుతున్న కెటిల్‌లోంచి గాజు గ్లాసులోకి టీ ఒంపి దాన్ని శంకర్‌కు అందించాడు వృద్ధుడు.

నీళ్ళలో ఇటుకరాయి పొడి వేసినట్లుగా వుంది కానీ టీ లాగాలేదు. అయినాసరే మౌనంగా తాగసాగాడు.

"ఏ వూరు బాబూ మనది? "

"మనది అంటే నీదా? నాదా? " పరిహాసంగా అడిగాడు శంకర్ టీ చప్పరిస్తూ.

సురేంద్ర ఇంటిదగ్గర జరిగిన అవమానం గుండెను మండిస్తోంది. ఇంకా ఆ కోపంలో వున్న శంకర్ దాన్ని ఎవరిమీద చూపెట్టాలో తెలీక వృద్ధుడిమీద ప్రదర్శించాడు.

వృద్ధుడు నవ్వాడు.

"ముసలాడిమీద కోపం దేనికి బాబూ... వాళ్ళు నిన్ను బాగా తిట్టారా ఏంటీ? ఆ కోపం నామీద చూపిస్తున్నావు? "

"వాళ్ళు సంస్కారంలేని నీచులు..." శంకర్ కసిగా అన్నాడు.

"ఈ పెపంచకంలో చాలామంది అట్టాంటోళ్ళే... పడ్డవాడు ఎప్పుడూ చెడ్డోడుకాదు బాబూ..."

"ఆ ఈ మెట్ట వేదాంతాలు నాకూ తెల్సులే" శంకర్ విసుగ్గా టీ తాగడం పూర్తి చేసి గ్లాసు బల్లమీద పెడుతూ అన్నాడు, "ఎంత? "

"రూపాయిన్నర బాబూ..."

చాలాకాలంనుంచి భద్రంగా కాపాడుకొస్తున్న ఆఖరి వందరూపాయలనోటును జేబులోంచి బయటకు తీసి వృద్ధుడికి ఇచ్చాడు.

"చిల్లర్లేదు బాబూ..."

"వంద రూపాయలకి చిల్లర లేదా? ఇంకేం వ్యాపారం చేస్తున్నావు నువ్వు? "

"రోజంతా నా బేరమే వంద రూపాయలుండదు... అంత చిల్లరలెక్కడనుంచి తెచ్చేది? "

"మరేం చేయమంటావు? " మరింత విసుగ్గా అన్నాడు శంకర్.

వృద్ధుడు నోరు తెరిచి బోసినవ్వు నవ్వాడు. "ఫర్లేదులే బాబూ... ఇంకోసారి వచ్చినపుడు ఇద్దువుగానిలే"

"అదేంవద్దు. డబ్బులు తీసుకుని చిల్లరివ్వు..."

"లేదంటినిగా బాబూ... వుంటే దాచుకుంటానా ఏంటీ? "

'సరే వందా వుంచుకో' అనేంత సీన్ లేక




పోయేసరికి మారు మాట్లాడకుండా వంద నోటు తిరిగి తీసేసుకున్నాడు. "ఈ సారొచ్చి నపుడు ఇస్తాను"

"సరేబాబూ"

ఎండలో నడుచుకుంటూ వెళ్ళిపోతున్న శంకర్ని చూసి వృద్ధుడు జాలిగా గొణుక్కున్నాడు. "ఈ మాయదారిలోకంలో ఎదురు దెబ్బ తింటేకానీ అర్థమవదు... ఏ తల్లికన్న బిడ్డో ఏమో పాపం"

★ ★ ★

"నాలుగు నెలలయ్యింది ఇంతవరకూ లైన్ కూడా రాలేదు"

ఎవ్వరూ మాట్లాడలేదు. ఎయిర్ కండిషనర్ చేస్తున్న శబ్దంమాత్రం సన్నగా వినబడుతోంది.

"ఈ లెఖ్ఖన మనం సిన్మా తీయడానికి ఐదేళ్ళు పడుతుంది"

"లోగడ పెద్ద బ్యానర్లన్నీ అలాగే తీసేవారట"

ది గ్రేట్ కమర్షియల్ డైరెక్టర్ సురేంద్ర ఆ మాటలన్న వ్యక్తివైపు సీరియస్‌గా చూశాడు. ఆ మాటలంది సుబ్బరాజు. నిర్మాత బావమరిదని అర్థమైన తర్వాత బలవంతాన కోపాన్ని నిగ్రహించుకున్నాడు.

"ఐదేళ్ళపాటు సిన్మా తీసేంత తీరిక నాకు లేదండీ..." అన్నాడు ఉక్రోషంగా.

డైరక్టర్‌గారికి కోపం వచ్చిందని వెంకటపతిరాజుకు అర్థమైంది. డైరక్టర్‌కు కోపం వస్తే నష్టం అతనికే. ఎందుకంటే అతనే నిర్మాత కాబట్టి. పదిమంది డ్యాన్సర్స్ కావాలంటే నలభైమందిని తెప్పించమంటాడు. క్రేన్ తెప్పించి వారంరోజులపాటు క్రేన్ షాట్స్ తీయడు. నాలుగురోజులనుకున్న షూటింగ్ పదిహేను రోజులవుతుంది. డ్రస్సులు, లొకేషన్స్, ఆర్టిస్టులు, సెట్స్ దగ్గర్నుంచి డైరెక్టర్ తల్చుకుంటే బడ్జెట్ తడిచి మోపెడయ్యేలా చేయగలడు. అదే డైరెక్టర్ తల్చుకుంటే షూటింగ్ షెడ్యూల్స్ ప్రకారం జరుగుతాయి. బడ్జెట్ కూడా కంట్రోల్‌లోనే వుంటుంది. డిన్నర్‌లోకి పీతలవేపుడు రాకపోతే రెండోరోజు షూటింగ్ అప్‌సెట్ అయిన సందర్భాలు కూడా వుంటాయి. మందు బాబుల సంగతయితే చెప్పనే అక్కరలేదు.

వెంకటపతిరాజు నిర్మాతగా ఫీల్డుకు కొత్తేమీకాదు.

ఎనిమిది డబ్బింగ్ సిన్మాలు, రెండు బడ్జెట్ సిన్మాలు చేశాడు. ప్రతి ఎమ్మెల్యే కూడా సీ.ఎం. కావాలని ఏ విధంగా కలలు కంటాడో అదేవిధంగా ప్రతి నిర్మాత కూడా ఇండస్ట్రీలో వున్న టాప్‌హీరోతో భారీ బడ్జెట్ సిన్మా తీయాలని కలలుకంటాడు. ప్రస్తుతం వాళ్ళు అదే ప్రయత్నంలో అంటే స్టోరీ డిస్కషన్లో వున్నారు.

నాలుగు నెలలనుంచీ స్టోరీ తెగ ఇబ్బంది పెడుతోంది.

అసలు స్టోరీ అనేదేలేదు. ఓ ఇంగ్లీష్ సిన్మాలోంచి పాయింట్ తీసుకుని, వెళ్ళి హీరోగారికి డైరెక్టర్‌గారు విన్పించారు. హీరోగారు పాయింట్ విన్నతర్వాత బాగుంది, డెవలప్ చేయండి అన్న గ్రీన్ సిగ్నల్ ఇచ్చారు. దాంతో సిన్మా సూపర్‌హిట్ అయిపోయినంత హడావుడి. హీరోల పేరుమీద సిన్మా బిజినెస్ జరుగుతుంది కాబట్టి హీరోగారిని ఒప్పించడం అనేది అన్నింటికంటే ప్రధానం. హీరోగారు కథకంటే ముఖ్యంగా ముందు ఆ డైరెక్టర్ ట్రాక్ రికార్డ్ చూస్తారు.

ఆ డైరెక్టర్ హిట్స్ ఎన్నిచ్చాడు? ఫ్లాప్స్ ఎన్ని తీశాడు? లేటెస్ట్ సిన్మా హిట్టా, ఫట్టా అన్నదానిమీద గ్రీన్ సిగ్నల్ ఆధారపడి వుంటుంది. ఓ మంచి డైరెక్టర్ లేటెస్ట్ సిన్మా ఫ్లాప్ అయితే ఆ తర్వాత అదే డైరెక్టర్ అద్భుతమైన కథ చెప్పినా హీరో యస్ అనడు. అదే ఓ సాధారణ డైరెక్టర్ హిట్‌సినిమా తీస్తే బేవార్సు సబ్జెక్ట్ చెప్పినా హీరోగారు 'ప్రొసీడ్' అనేస్తారు.

అంటే సక్సెస్ స్పీక్స్... ఫెయిల్యూర్

వీఫ్స్... సక్సెసే మాట్లాడుతుంది? ఫెయిల్యూర్ ఏడుస్తుంది.

సక్సెస్, సెంటిమెంట్స్ అడుగడుగునా నిండివుండే సిన్మా ఫీల్డులో ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవ్వరూ చెప్పలేరు.

సురేంద్ర డైరెక్టరుగా తీసిన ముప్పై రెండు సిన్మాల్లో ఇరవైరెండు హిట్, ఎనిమిది సూపర్‌హిట్ నాలుగు ఫ్లాప్... ఇంకో ఇరవై సిన్మాలు డైరక్ట్ చేయడానికి ఆమాత్రం ట్రాక్‌రికార్డ్ చాలు. పైపెచ్చు సురేంద్ర అందరి హీరోలతోనూ మంచి సంబంధబాంధవ్యాలు మెయింటైన్ చేస్తాడు.

మంచి సంబంధబాంధవ్యాలంటే చాలా రకాలుంటాయి..

ఒక్కో హీరోకి ఒక్కో రకం అంటే ఇష్టం. ఓ హీరోకి ఇతర హీరోలను తనముందు నీచంగా తిట్టించుకోవడం అంటే ఇష్టం. ఇతరులు తిడుతుంటే పరమానందంగా వింటూ వుంటాడు. తన నోరుతెరిచి ఒక్క కామెంట్ కూడా చేయడు. కానీ చిరునవ్వుతో ఇతర హీరోలను తన భజనపరులు చీల్చి చెండాడుతూ వుంటే ఇష్టంలేనట్లుగా మధ్యమధ్యలో వారిస్తూనే వాళ్ళను మరింతగా ప్రోత్సహిస్తాడు. ఆ టైపు హీరోగారి దగ్గర సురేంద్ర,

"సార్ హీరోగారూ... మొన్న ఫలానా సిన్మా చూశానండీ. అప్పట్నించీ విరోచనాలు పట్టుకున్నాయి. వాడు సిన్మా హీరో. ఏమిటండీ బాబు. ఆముదం ఫేస్‌గాడు" అంటూ హీరోని సంతృప్తిపర్చే స్థాయిలో తిడతాడు.

మరో హీరోకి ఫాలోయింగ్ పిచ్చి

ఆ హీరోగారు పొద్దున్న లేచి మార్నింగ్ వాకింగ్, జాగింగ్ లేదా జిమ్‌కు బయలుదేరిన దగ్గరనుంచీ అర్ధరాత్రి ఆఖరు పెగ్గు తాగి విశ్రమించేంత వరకూ పక్కన భజంత్రీగాళ్లు వుండాలి. అవుట్‌డోర్ షూటింగుల యితే చెప్పఖ్ఖరలేదు. ఆఖరికి సిటీ దాటి బయటకు వెళ్ళే ప్రతిసారీ ఎయిర్‌పోర్ట్‌కు ఎంతమంది వచ్చి ఎటెండెన్స్ వేయించుకున్నారా అని చూస్తారు. వారితో సిన్మాలు తీసేవాళ్ళు, తీసినవాళ్ళు, తీయబోయే వాళ్ళూ తీద్దామనుకునేవాళ్ళూ ఇలా ఓ పెద్ద పటాలాన్ని వేసుకుని ఇరవై కార్లలో హీరోగారు ఎక్కడకు వెళ్ళినా ఆర్భాటంగా వేంచేస్తూ వుంటారు. సురేంద్ర ఈ టైపు ప్రోగ్రాంలకు తప్పకుండా ఎటెండెన్స్ వేయించుకుని 'ఇతనూ మన గ్రూపే' అన్న ఫీలింగ్ ఆ హీరోగారిలో కలిగిస్తూ వుంటాడు.

ఇంకో హీరోగారికి తాను దరిద్రం పట్టుకుని తెలుగు సిన్మాలు చేస్తున్నాను కానీ ఏ హాలీవుడ్ సిన్మాల్లోనో యాక్ట్ చేస్తూ వుండాలన్న ఫీలింగ్. ఆ హీరోగారి దగ్గర "సార్ గురువుగారూ... నిన్న టైటానిక్ సిన్మా చూశానండీ. డీకాప్రియో రోల్ మీరు వేసుంటే సంవత్సరం ఆడేది. మీ దురదృష్టం తెలుగు ఫీల్డులో వుండిపోయారు. హాలీవుడ్‌లో మీ అంత టైమింగ్, ఎక్స్‌ప్రెషన్స్, గ్లామర్, పర్సనాలిటీ వున్న ఆర్టిస్ట్‌ను చూపించండి" అంటాడు. దాంతో ఆ హీరోగారు లాస్‌ఏంజల్స్, హాలీవుడ్ స్టూడియోల్లో మానసిక విహారం మొదలుపెడతారు.

ఈ విధంగా... సురేంద్ర అనే డైరెక్టరుగారు హీరోలతో సత్‌సంబంధాలు మెయింటైన్ చేస్తూవుంటారు కాబట్టి ఈయన వెళ్ళి అడిగితే ఏ హీరో అయినా డేట్స్ ఇస్తారన్న ఫీలింగ్‌తో చాలామంది సురేంద్రతో సిన్మాలు తీసేందుకు సిద్ధంగా వుంటారు.

ప్రస్తుతం అన్నీ రెడీ కానీ, కథ మాత్రం లేదు.

డైరెక్టర్‌గారికి కూలింగ్ ఎఫెక్ట్ ఇవ్వకపోతే తన సిన్మాకు చాలా ప్రమాదమని తెలుసుకాబట్టి వెంకటపతిరాజు "సార్ డైరెక్టర్‌గారూ... వెనకటిరోజుల్లో మిస్సమ్మ, పాతాళభైరవి, గుండమ్మ కథలాంటి సూప





ర్‌హిట్లు నాలుగేళ్ళు తీసారు కానీ అదే మీర యితే మీ వర్క్ స్పీడ్‌కు ఆరునెలల్లో తీసి పారేసేవాళ్ళు సార్" అన్నాడు డైరెక్టర్ని ఉబ్బేయటానికి.

"ఆ... ఆరునెలల్లో తీసినదాన్ని ఆరు షోలకల్లా తీసి అవతలపడేస్తారు థియేట ర్లలో" స్వామీజీ గొణుక్కున్నాడు మన స్సులో. స్వామీజీ సిన్మారచయిత.

పదేళ్ళనుంచీ ఫీల్డులో వున్నాడు. చాలా సిన్మాలకు ఘోస్టుగా పనిచేశాడు. అతను రాసిన రెండు సిన్మాలు హిట్ అయ్యేసరికి పరిశ్రమ దృష్టి అతనిమీద పడింది.

సిన్మాఫీల్డులో సక్సెస్ కావాలంటే టాలెం ట్‌కంటే భజన, ఆత్మవంచన, డబ్బా కొట్టటం, ఫాలోఅప్ చాలా ముఖ్యమని అర్థ మవటానికి పదేళ్ళు పట్టింది. అతనికంటే వెనుక రచయితలయిన వాళ్ళు ఈరోజు పెద్ద సిన్మాలు చేస్తూ బాగా సంపాదిస్తు న్నారు. స్వామీజీ సంవత్సరానికి ఓ సిన్మా కంటే ఎక్కువ చేయలేకపోతున్నాడంటే అందుకు కారణం అతని ముక్కుసూటి తనం.

కొంతమంది రచయితలు స్పెషల్ ఎఫె క్టులతో కథ చెబుతూ వుంటారు.

స్పెషల్ ఎఫెక్టులంటే ఇలా వుంటాయి "తెర తీయగానే టైటిల్స్... టైటిల్స్‌లోంచి డిజాల్వ్ చేస్తే 'ధడ్'మంటూ ఓ మెరుపు మెరుస్తుంది. వర్షం పడుతూ వుంటుంది. వందమంది పియానో వాయిస్తూ వుంటే అప్పుడు హీరో ఎంట్రీ. అదే సమయంలో హీరోయిన్ పరిగెత్తుతూవుంటుంది. వెనుక రౌడీలు. కళ్ళు చెదిరిపోయేలా ఉరుములు, మెరుపులు. కట్‌చేస్తే వెయ్యిమంది గొడుగులు పట్టుకుని వుంటే ఆ బాక్ డ్రాప్‌లో ఓపెనింగ్ ఫైట్" ఇలా సాగుతూ వుంటుంది కథ.

ఇందులో ఏం వెరైటీ వుందని ఎవ్వరూ అడగరు?

అడిగితే రైటర్‌గారికి కోపం వస్తుంది. ఆయనకు కోపం వస్తే హీరోగారికి కూడా ఆటోమాటిగ్గా కోపం వస్తుంది. కొందరు డైరెక్టర్లు ఏవిధంగా హీరోలను ఫాలోఅప్ పెడతారో రైటర్లు కూడా హీరోలను ఫాలో అవుతారు. ఆ రైటర్ ఎంతసేపూ హీరో పాయింట్ ఆఫ్ వ్యూలోంచే కథ చెబుతూ హీరోగార్ని ఉబ్బేయాలని ప్రయత్నిస్తూ వుంటారు.

నిర్మాత మాత్రం వెయ్యి గొడుగులతో ఎక్స్‌ట్రా ఆర్టిస్టులంటే ఎంతవుతుందాని మన సులో లెక్కలేసుకుంటూవుంటాడు.

మొదట్లో ఈ మతలబు అంతా తెలీని స్వామీజీ ఆవేశంగా "వందమంది పియానో వాయించటం, వెయ్యిమంది వర్షంలో గొడు గులు పట్టుకోవటం ఎందుకండీ? కథకూ, హీరోపాత్రకూ ఏమాత్రం సంబంధం లేకుండా అలా తీయటం అవసరమా? " అన్నాడు.

సదరు స్పెషల్ ఎఫెక్టుల రచయిత పిల్ల కాకిని చూసి నవ్వే జెముడుకాకిలా నవ్వి "హీరోగారి ఎంట్రీ అంటే రిచ్‌గా వెరైటీగా వుండాలి. ఫ్రేమ్స్ ఎంత రిచ్‌గా వుంటాయో ఆలోచించు" అన్నాడు.

స్వామీజీకి అర్థంకాలేదు. "ఇందులో వెరైటీ ఏముందండీ. వర్షంలో ఓ అమ్మాయిని రౌడీలు తరుముతుంటారు. హీరో రక్షిస్తాడు అంతే గదా. ఈ టైప్ సీన్స్ చాలాసార్లు వచ్చేశాయిగా? "

"నేను చెప్పేది స్పెషల్ ఎఫెక్ట్స్ గురించి. వంద పియానోలు, వెయ్యి గొడు గులతో ఫైట్ తీసిన మొట్టమొదటివాళ్ళం మనమే. ఆ విధంగా అదో వెరైటీ. ఇక రీరి కార్డింగ్‌లో ఆ సీన్ అదిరిపోతుంది. సెవెన్టీ ఎమ్ఎమ్‌లో ఎంట్రీ ఫైట్ చూస్తుంటే ఫ్యాన్స్ పూనకంవచ్చినట్లు ఆవేశంతో ఊగి పోతారు. ఇదంతా తెలియాలంటే విజువలై జేషన్ కావాలి" అన్నాడు నిర్లక్ష్యంగా.

ఎవ్వరూ మాట్లాడలేదు.

వాస్తవానికి అదంతా అవసరం లేదనీ,

కేవలం హీరో మెహర్బానీ కోసమే ఆ సీన్ చెప్పాడని అందరికీ తెలుసు ఒక స్వామీజీకి తప్ప. నిర్మాతకు కూడా తెలుసు. కానీ దాన్ని బైటకు వ్యక్తంచేయలేడు. చేస్తే బడ్జెట్ తగ్గించి డబ్బులు మిగుల్చుకోవటా నికి తాను కక్కుర్తి పడుతున్నట్లు హీరోగారు అపార్థం చేసుకుంటారు. అమ్మో! హీరోగారు అపార్థం చేసుకుంటే ఇంకేముంది? సిన్మా ఎలా వున్నా బయ్యర్లు హీరో పేరుమీద సిన్మాకొంటారు. తనకు టేబుల్ ప్రాఫిట్ మిగులుతుంది. ఈ దరిద్రుడు చెప్పినట్లుగా వందపియానోలు, వెయ్యి గొడుగులు పెట్టి తీస్తే తనకు మిగిలే లాభంలో నాలుగు లక్షలు ఎక్కువ ఖర్చవుతుంది. అయినా కూడా ముప్పై, నలభై లక్షలు మిగులు తుంది. ప్రస్తుతానికి దాంతో బయటపడితే చాలు. ఈవిధంగా నిర్మాత ఫైనల్‌గా తనకు మిగలబోయేది లెక్కవేసుకుని హీరో గారి ఫీలింగ్స్ కోసం చూశాడు.

హీరోగారి ముఖంలో చిరాకు కదులు తోంది.

తన ఫాన్స్ ఆనందానికి అడ్డుతగులు తున్న దుష్టగ్రహంలా స్వామీజీ ఆయన కళ్లకు కన్పడుతున్నాడు. నిర్మాతకు పరిస్థితి అర్థం అయ్యింది.

కట్ చేస్తే...

రెండోరోజునుంచీ స్వామీజీ కథాచర్చల నుండి బహిష్కరింపబడ్డాడు.

హీరోగారిని సంతృప్తిపరిచే వంద పియా నోలు, వెయ్యి గొడుగులు, స్విట్జర్లాండ్ సాంగ్స్, రీరికార్డింగ్‌లు, కథాబలంలేని ఆ సిన్మాను రక్షింపలేకపోయాయి.

సిన్మా ఫ్లాప్ అయ్యింది.

అయినా నో ప్రాబ్లమ్.

నిర్మాతకు నలభై లక్షలు లాభం మిగి లింది.

హీరోగారికి కోటిన్నర అందాయి. స్పెషల్ ఎఫెక్టుల రచయితకు లక్ష...

నష్టం ఏదైనా వుంటే ఇరవైరోజులటైం వేస్ట్ చేసుకుని పైసా ముట్టని రచయిత స్వామీజీ... సిన్మాకొనుక్కున్న బయ్యర్స్.

హీరోగారి ఇమేజ్‌కేం ఢోకాలేదు.

ఇరవై ఫ్లాప్‌లిచ్చినా మళ్ళీ ఓ సిన్మాహిట్ట యితే చాలు. సదరు హీరోగారికి వారి పాత మార్కెట్ తిరిగివచ్చేస్తుంది. మన తెలుగు ప్రేక్షకులంతటి దయార్ద్రహృదయం గల సహనవంతులు కాబట్టే.

ప్రస్తుతం మన సిన్మాలు ఏ స్థాయిలో వున్నదీ అందరికీ తెలిసిందే.

స్టోరీ డిస్కషన్లలో ఇటువంటి అనుభ వాలు కోకొల్లలు.

సిన్మా గురించీ, సాహిత్యం గురించీ, సబ్జెక్ట్ గురించీ ఏమాత్రం తెలీనివాళ్ళు కూడా కథా చర్చల్లో వేలుపెడతారు. వాళ్లు నిర్మాతల బావమరుదులు కావచ్చు ఫ్రెండ్స్ కావచ్చు భజంత్రీలు కావచ్చు ఫైనాన్సర్స్ లేదా స్లీపింగ్ పార్టనర్స్ కావచ్చు. కామ్‌గా కూర్చుంటే ఏమీ తెలీదనుకుంటారని తమ పరిజ్ఞానం ప్రదర్శిస్తూ వుంటారు.

కథా చర్చల్లో ఇద్దరు ముగ్గురు రైటర్స్ వుంటే అది మరింత రసవత్తరంగా వుంటుంది.

ఓ రైటర్ సీన్ చెబితే వెంటనే ఇంకో రైటర్ దాన్ని పీకిపాకాన పెడతాడు. ఆ సీన్ ఎంత బాగున్నా కూడా ఏవిధంగా రంధ్రాన్వేషణ చేయాలా అని మిగిలిన రైటర్స్ తమ టాలెంట్ అంతా ప్రదర్శి స్తారు. వాళ్ళంతా ఏకగ్రీవంగా సబ్జెక్ట్ ఓకే చేసేసరికి నిర్మాతకు బిల్లు తడిచి మోపెడ వుతుంది. కాబట్టి ఎక్కువమంది రైటర్స్‌ను ఇన్‌వాల్వ్ చేయకుండా జాగ్రత్తపడతారు.

ఏదైనా సబ్జెక్ట్ కానీ, సీన్‌కానీ బాగున్న దాన్ని బాగుంది, బాగాలేనిదాన్ని బాగాలేదు అని వెంటనే చెప్పకూడదు. అక్కడున్న హీరో, నిర్మాత, డైరెక్టర్ మూడ్స్, వాళ్ళ ఇంట్రెస్టులనిబట్టి మాట్లాడాలనీ లేకుంటే ముక్కుసూటిగా పోతే సిన్మాఫీల్డులో మంచి నీళ్లు కూడా పుట్టవని అర్థంచేసుకున్న





స్వామీజీ ఇదివరకులా తన అభిప్రాయం బైటకు వ్యక్తంచేయటం మానుకున్నాడు.

ఉదాహరణకు ఓ హీరోగారికి కౌబోయ్ సిన్మా చేయాలన్న సరదాపుడుతుంది. వెంటనే కౌబోయ్ కథ వండటం మొదలవుతుంది. పొరపాటున కూడా ప్రస్తుతం జనం కౌబోయ్ సిన్మాలు చూడటంలేదు. అందులో మీకు కౌబోయ్ క్యారెక్టర్ సూట్ కాదు అని చస్తే చెప్పకూడదు. "హీరోగారు హేట్ పెట్టుకుని గుర్రమెక్కారంటే సిన్మా జూబ్లీ హిట్" అంటూ అందరూ డబ్బాకొడుతుంటే హీరోగారు తమనుతాము ఏ క్లింట్ ఈస్ట్‌వుడ్ స్థాయిలోనో వూహించేసుకుంటారు.

సిన్మాఫీల్డులో అంతా ఇలాగే వుంటారా అంటే ఎక్కువశాతం ఫాలోఅయ్యే ట్రెండ్ మాత్రం ఇదే. ఇగోలు, ఆత్మస్తుతి, పరనింద, కాకాయిజం, బాకాయిజం, డబ్బాయిజం, చెంచాగిరీ ఇవన్నీ ముఖ్యపాత్ర వహిస్తాయి. టాలెంట్ విషయం సెకండరీ. సిన్మాఫీల్డులో నిలబడాలంటే మళ్ళీ ఫైనల్‌గా కావల్సింది టాలెంటే. అది వేరే సంగతి. ఈ ట్రెండ్స్ ఫాలో అయ్యే వ్యక్తులు తక్కువ స్ట్రగుల్‌తో ముందుకు దూసుకుపోతూవుంటారు. ఎంతకాలం అంటే సాగినంతకాలం. తర్వాతయినా వాళ్ళకు పోయేదేమీలేదు ఫైవ్‌స్టార్‌లో ఇతరుల డబ్బులతో ఎంజాయ్ చేసినవాళ్ళు నిర్లజ్జగా ప్లాట్‌ఫారంమీద టీ తాగుతూ వుంటారు.

స్వామీజీకి ఇదంతా అర్థం కావటానికి పదేళ్ళు పట్టింది.

అప్పట్నుంచీ అనవసర సలహాలు ఇవ్వటం మానుకున్నాడు. 'నలుగురితో పాటు నారాయణా!' ట్రాక్‌లోకి వచ్చేశాడు కాబట్టి సంవత్సరానికి రెండు మూడు సిన్మాలు చేసుకుంటున్నాడు.

"రైటర్‌గారేమీ మాట్లాడటంలేదు".

స్వామీజీ డైరెక్టర్‌గారి మాటలకు ఆలోచనల్లోంచి బయటకు వచ్చాడు.

"సార్... పాయింట్ మీదేకాబట్టి మీరెలా చెబితే అలాగే చేద్దాం" ఈ తరహా డైలాగ్ చెప్పేటపుడు స్వామీజీకి తనమీద తనకే అసహ్యం వేస్తుంది. కానీ తప్పదు. సర్వైవ్ కావాలంటే ఇదంతా తప్పదు.

"కుచ్‌కుచ్ హోతాహై ట్రాక్‌లో వెళదామంటారా? " డైరెక్టర్ సురేంద్ర అడిగాడు.

"నాకర్థంకాలేదు సార్"

"ఇందులో అర్థంకానిదేముంది. ఇద్దరు హీరోయిన్స్, ఓ హీరో. వాళ్ళమధ్య ట్రయాంగిల్ లవ్"

"అలాగే సార్... మీ ఇష్టం"

"మీరేమంటారు? " సురేంద్ర నిర్మాతను అడిగాడు. నిర్మాత తలూపాడు. "సూపర్ హిట్స్ తీశారు సార్. మీకు తెలీదా ఏంటి సార్ జనం నాడి. మీరేం తీస్తే అదే సిన్మా"

సురేంద్ర సంతృప్తిగా నిట్టూర్చాడు. రైటర్, నిర్మాత ఒప్పుకుంటే చాలు. హీరోని ఒప్పించటం అంత కష్టం కాదు"

"సరే నేను బయలుదేరతాను" అంటూ పైకి లేచాడు సురేంద్ర. "హిందీ సిన్మాకోసం ముంబైనుంచి ప్రొడ్యూసర్స్ వచ్చారు. వాళ్ళతో ఓ గంట కూర్చుని సబ్జెక్ట్ ఫైనలైజ్ చేయాలి. రైటర్‌గారూ మీరు ట్రాక్ డెవలప్ చేస్తారుగా? " అని స్వామీజీని ప్రశ్నించాడు.

"అలాగే సార్... ఎల్లుండికల్లా సింగిల్ లైన్ ఆర్డర్ వేసుకొస్తాను" స్వామీజీ వినయంగా అన్నాడు.

"వెరీగుడ్" అంటూ సురేంద్ర గదిలోంచి బయటకు నడిచాడు. నిర్మాత, రైటర్ తదితరులు దర్శకులవారిని అనుసరించారు. గెస్ట్‌హౌస్ బయట సురేంద్ర కారు ఎక్కబోతుండగా అక్కడకు ఓ కుర్రవాడు వచ్చాడు.

"సార్"

కారు డోర్ తీస్తున్న సురేంద్ర ఓ క్షణం ఆగి "ఏమిటీ? " అన్నాడు దర్పంగా.

"మీకోసం రెండు నెలల్నించీ తిరుగుతున్నాను సార్" ఆ కుర్రవాడు దీనంగా

అన్నాడు.

"దేనికీ? " ముఖం చిట్లిస్తూ అడిగాడు.

"మీదగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేరేం దుకు"

అప్పటికి సురేంద్రకు పరిస్థితి అర్థమైంది. మౌనంగా కారు ఎక్కేసి వెళ్ళిపోవచ్చు కానీ అలా చేయలేదు. సిన్మాతాలూకు టెన్షన్స్ నుంచి రిలీఫ్‌గా అతను ఇటువంటి పరిస్థితు లను ఔట్ లెట్‌గా వాడుకుని ఆనందిస్తాడు. అది సాడిస్టిక్ ఆనందం. తను అసిస్టెంట్ డైరెక్టర్‌గా వున్నరోజులు గుర్తుస్తాయి. పడ్డ అవమానాలూ, హేళనలూ, ఛీత్కారాలు గుర్తొకువస్తాయి. ఇప్పుడు తన వంతు వచ్చింది అనుకుని విజృంభిస్తాడు.

"నీ పేరేంటీ? "

"శంకర్ సార్"

"ఏం చదువుకున్నావు? "

"డిగ్రీ సార్"

"మరి శుభ్రంగా ఉద్యోగం చేసుకోక సిన్మాలెందుకయ్యా నీకు? "

"నాకు ఇంట్రెస్ట్ సార్"

"సిన్మాలంటే ఈ ప్రపంచంలో ఇంట్రెస్ట్ లేనిదెవరికి? " తను వేసిన జోకుకు తనే నవ్వుకున్నాడు. డైరెక్టర్‌గారు ఫీలవుతారని పక్కనున్న వాళ్ళు కూడా నవ్వారు. "కాబట్టి డైరెక్షన్, సిన్మాలని పెట్టుకోకుండా శుభ్రంగా ఇంటికెళ్ళిపోయి ఏదైనా పన్జేసుకో"

"సార్ ప్లీజ్ సార్. మీ మీద ఎంతో హోప్ పెట్టుకున్నాను సర్" శంకర్ దీనంగా అన్నాడు.

"ఎవరు పెట్టుకోమన్నారయ్యా నిన్ను... ప్రతి ఒక్కడూ డైరెక్షన్, యాక్టింగ్ అంటూ ఎగేసుకుని వచ్చేస్తే ఇంక సిన్మాలెవరు చూస్తారయ్యా. డైరెక్షన్ అంటే ఆషామాషీ అనుకున్నావా ఏంటీ... నా మాటవిని ఇంటికెళ్ళిపో"

శంకర్ మౌనంగా నిలబడిపోయాడు. గత రెండున్నర నెలలుగా అతను ఎంతో మంది డైరెక్టర్లను కలిశాడు. గంటలు గంటలు వెయిట్‌చేసిన తర్వాత రోజులతర బడి తిరిగినా చాలామంది దర్శనం దొరికేది కాదు. మిగిలినవాళ్ళు కూడా జోకులేయటం, వ్యంగ్యంగా మాట్లాడటం చేసేవాళ్లు. ఒకళ్ళి ద్దరు మాత్రం "తర్వాత కలువు చూద్దాం" అన్నారు. తిరుగుతూనే వున్నాడు. ఎండా, వర్షం, చలీ, ఆకలి, దూరం, నీరసం, అవమా నాలు, ఛీత్కారాలు. వీటన్నింటికీ అతీతంగా పొద్దున్నుంచీ రాత్రిదాకా తిరుగుతూనే వున్నాడు. అదృష్టవశాత్తూ ఎవరిద్వారానో సురేంద్ర స్టోరీ డిస్కషన్లకు ఈ గెస్ట్‌హౌస్‌కు వస్తున్నాడని తెలిసింది. మూడురోజు ల్నుంచీ గెస్ట్‌హౌస్ దగ్గర తిరుగుతూనే వున్నా వాచ్‌మన్ అడ్డుపడుతున్నాడు. అయినా సరే చెట్టు కింద నిలబడి ఎంట్ర న్స్‌వైపే చూస్తూ వుండేవాడు.

ఆఖరుక్షణంలో వాచ్‌మన్ టీకి వెళ్ళటం కారణంగా సురేంద్రను కలవగలిగాడు. కానీ ఆ ఆనందం ఎక్కువ క్షణాలు నిలవలేదు. అందరూ చెప్పే మాటే ఇంటికెళ్ళిపో. ఈయన కూడా చెబుతున్నాడు. అది కూడా క్రూరమైన జోకులేస్తూ.

"డైరెక్టర్ కావటం అంటే పూర్వజన్మ సుకృతం. అహో రాత్రులూ కష్టపడబట్టే మేము ఈ స్థితిలో వున్నాం. నీలాంటి కుర్ర నా కొడుకులంతా గాల్లో స్టూడియోలు కట్టేసి డ్రీమ్స్‌లో సిన్మాలు తీసేస్తే ఎట్టా నాయనా? "

మళ్ళీ అందరూ నవ్వారు. అది చూసి సురేంద్ర మరింత విజృంభించాడు.

"అసలు కెమెరా అంటే తెలుసా? ప్రొజెక్షన్ షాట్స్ ఏమిటో తెలుసా? ట్రాలీ ఎలా మూవ్‌అవుతుందో అవగాహన వుందా? ఏం తెలీకుండా ఎందుకొస్తా రయ్యా"

"తెలుసుకుందామనే కదాసార్ మీ దగ్గ రకు వచ్చింది"

సురేంద్ర హేళనగా నవ్వాడు. "డైరెక్షన్ అంటే నేర్చుకుంటే వచ్చేది కాదు. పుట్టుక




తోనే రావాలి" ఓ భారీ స్టేట్‌మెంట్ ఇచ్చాడు.

"అక్కడికి ఈయనగారు వీళ్ళ అమ్మకడు పులోంచే కెమెరా పట్టుకుని దిగిపోయినట్లు బోడి బిల్డప్" స్వామీజీ మనస్సులో గొణుక్కున్నాడు.

"సార్... ఎన్నో ఆశలు పెట్టుకొని వచ్చాను సార్. ప్లీజ్ సార్. మీరేం చెబితే అది చేస్తాను సార్" శంకర్ దీనంగా ప్రాధేయపడ్డాడు.

"నేనేం చెబితే అది చేస్తావా? వెళ్ళి బ్యాంకు దోపిడీ చేయమంటాను. చేస్తావా? చెప్పు. చేస్తావా? " అని నిర్మాతవైపు తిరిగి.

"ఏమండీ ప్రొడ్యూసర్‌గారూ... మనవాడికి ఎడ్వాన్స్ ఇచ్చి ముందే బుక్‌చేసేసుకోండి. రేపు పెద్ద డైరెక్టర్ అయితే మీకు దొరకడు" వెటకారంగా నవ్వి "వెళ్ళెళ్ళు... వెళ్ళి ఏ గుమాస్తా ఉద్యోగమో, కూలిపనో చేసుకో. నీలాంటి వాళ్ళంతా డైరెక్టర్లయిపోతే భరించే శక్తి సిన్మా ఇండస్ట్రీకి లేదు నాయనా" అన్నాడు

"నీలాంటి వెధవల్ని భరించటంలా" స్వామీజీ యధావిధిగా మనసులో గొణుక్కున్నాడు.

శంకర్ ఏదో మాట్లాడబోతుండగా వెనుక మెడమీద చెయ్యేసి ఎవరో ముందుకు నెట్టారు. అతను కింద మట్టిలో పడిపోయాడు. తిరిగి చూస్తే వాచ్‌మన్ "జావ్ బేసాలే... జావ్ కమీనేకా బచ్చా" అని తిడుతుంటే మిగతావాళ్ళు చోద్యంచూస్తూ నవ్వుతున్నారు. అతను చూస్తుండగానే సురేంద్ర ఎక్కిన కారు దూసుకుపోయింది.

శంకర్ పైకి లేచాడు.

మట్టిలో పడటంవల్ల అతని శరీరం, బట్టలనిండా దుమ్ముపడి అసహ్యంగా వుంది. తలలోనుండి చెమట ధారాపాతంగా కారుతోంది. ఆ క్షణంలో అతన్ని ఎవరైనా చూస్తే ముష్టోడనుకుంటారు. గేటు దాటి లోపలకొచ్చి అడుక్కుంటుంటే బయటకు గెంటుతున్నారనుకుంటారు. లేచి నడవటం ప్రారంభించాడు. నడుస్తూనే వున్నాడు.

మనసు శూన్యస్థితికి చేరుకుంది.

ఇంతవరకూ జరిగిన అవమానాలన్నింటికన్నా ఇది పరాకాష్ట. ఏం సాధించాలని తను ఇక్కడికి వచ్చాడు? ఏం జరుగుతోంది? బెగ్గర్‌తోకంటే హీనంగా తనతో ప్రవర్తిస్తున్నారు. వీధికుక్కను అదిలించినట్లుగా బైటకు గెంటుతున్నారు. ఇదంతా భరిస్తూ, సహిస్తూ ఎంతకాలం ఇలా తిరగటం? ఆత్మహత్య చేసుకుంటే?

ఈ సమస్యలూ, అవమానాలూ, హేళనలూ, ఛీత్కారాలూ వుండవు. పది నిమిషాలు కష్టపడ్డా ఆ తర్వాత హాయిగా చచ్చిపోవచ్చు. ఆ క్షణంలో చదివిన జీవితచరిత్రలూ, పర్సనాలిటీ డెవలప్‌మెంట్ పుస్తకాలు ఏవీ గుర్తుకురాలేదు. అంత దారుణమైన మానసిక స్థితిలో వున్నాడతను. చచ్చిపోవటానికి సులువైన మార్గం ఏది?

రైలుకింద తలపెట్టాలా? విషం తాగాలా? ఉరేసుకోవాలా? టాంక్‌బండ్‌మీదనుంచి దూకేయాలా? అన్నింటిలోనూ తేలిగ్గా, సునాయాసంగా వుండే చావు ఏదీ? ఏదయితే బెటర్?

అతను ఈవిధంగా ఏ టైపులో ఆత్మహత్య చేసుకోవాలాని ఆలోచిస్తూ జీవితేచ్ఛ నశించి నడుస్తున్న సమయంలో అతని పక్కనే కెనెటిక్ హోండా స్కూటర్ ఆగింది.

"హల్లో" అంటూ పలకరిస్తున్న వ్యక్తివంక శంకర్ ఆశ్చర్యంగా చూశాడు. అతనెవరో తెలీదు. కనీసం ఇంతకుముందు చూసిన గుర్తుకూడా లేదు.

"ఎక్కడిదాకా వెళ్ళాలి? "

"టాంక్‌బండ్..." అన్నాడు శంకర్ అప్రయత్నంగా.

"పద నేను డ్రాప్‌చేస్తాను"

★ ★ ★

నెక్లెస్‌రోడ్.



మధ్యాహ్నం మూడు గంటలవుతుంది. ఎండ తీవ్రత ఎక్కువగానే వున్నా హుస్సేన్ సాగర్ నీళ్ళమీదనుంచి వీస్తున్న చల్లటి గాలి సేదతీరుస్తోంది. వాళ్ళిద్దరూ ఓ బెంచ్ మీద కూర్చుని వున్నారు.

"ఐస్‌క్రీం తింటావా? " ఆ వ్యక్తి అడిగాడు.

"వద్దు..."

"సరే నీ ఆఖరి కోరిక ఏమిటి? "

"ఆఖరికోరిక ఏమిటేమిటి? " శంకర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అదే చచ్చిపోయేముందు నీ ఆఖరికోర్కె"

శంకర్ ఉలిక్కిపడి ఆ వ్యక్తివంక చూశాడు. తను చచ్చిపోదామనుకుంటున్న విషయం ఇతనికి ఎలా తెలిసింది? శంకర్ మైలమాను గుర్తించినట్లుగా ఆ వ్యక్తి నవ్వాడు.

"ఏం...? చావంటే భయమేస్తోందా? "

"చావటం ఏమిటి? మీరేం మాట్లాడుతున్నారు? "

ఆ వ్యక్తి మళ్లీ నవ్వాడు. "నిజం చెప్పు... నువ్వు ఆత్మహత్య చేసుకోవాలనుకోలేదూ? "

"అది మీకనవసరం" శంకర్ సీరియస్‌గా అన్నాడు.

"నాకు అనవసరమా? వెరీగుడ్ ఇంకెందుకు ఆలస్యం? దూకెయ్. ఓ పనయిపోతుంది"

"నేనెందుకు దూకాలి? "

"ఆత్మహత్య చేసుకోవటానికి కాకపోతే ఇక్కడకెందుకొచ్చావు? "

"లవర్స్‌ని చూడటానికి? " శంకర్ కసిగా అన్నాడు. ఆ వ్యక్తి అంత తాపీగా ఒక్కో ప్రశ్న అడుగుతూవుంటే వళ్ళు మండుతోంది. పైపెచ్చు ఆ నవ్వొకటి. లిఫ్ట్ ఇచ్చాడన్న గౌరవంతో ఆ మాత్రం మర్యాదగానన్నా మాట్లాడుతున్నాడు. అసలు ఇతనికి తనతో పనేమిటి?

"అసలు నన్నెవరనుకుంటున్నారు మీరు? "

"నీ పేరు శంకర్. డైరెక్టర్ కావాలని ఇంట్లోంచి పారిపోయి వచ్చావు. అందరూ హీనంగా ఈసడిస్తున్నారు. మెడబట్టి గెంటేస్తున్నారు. దాంతో జీవితంమీద విరక్తి పుట్టి ఆత్మహత్య చేసుకుందామని టాంక్‌బండ్‌కొచ్చావు... అంతేనా? "

శంకర్ ఆశ్చర్యంతో ప్రాన్పడిపోయాడు. అతనికి జాతకాలమీద నమ్మకంలేదు. కానీ తనతో ఏమాత్రం పరిచయంలేని వ్యక్తి తన గురించి కరెక్టుగా చెప్పటం ఏవిధంగా సాధ్యం? ఆ విధమైన ఆశ్చర్యంతోనే అడిగాడు. "మీరెవరు? "

"నీలాంటివాడినే. ఐదేళ్ళక్రితం నీలాగే ఆత్మహత్య చేసుకుందామని ఇక్కడికి వచ్చిన వాడిని. నా పేరు స్వామీజీ

"జీవితం చాలా విలువైనది. ఇది పుస్తకాల్లో డైలాగు కానీ వాస్తవానికి జీవితం చాలా నికృష్టమైనది. ఈ ఇరవైఒకటవ శతాబ్దంలో బతకటమంత దారుణమైన విషయం ఇంకోటిలేదు. అఫ్‌కోర్స్, ఆత్మవంచన చేసుకుంటూ హాపీగా బతికేయచ్చు. మనస్సాక్షి వుండటంవల్లే వస్తుందీ చిక్కంతా" శంకర్ స్వామీజీ చెప్పేదాన్ని ఆశ్చర్యంగా వినసాగాడు.

"ఇప్పటికి పధ్నాలుగుసార్లు చచ్చిపోదామని ప్రయత్నించాను. అదృష్టమో, దురదృష్టమో ప్రతిసారీ బైటపడ్డాను. భరించలేనంత డిప్రెషన్, కసి. అందర్నీ నిలబెట్టి షూట్‌చేసి చంపాలన్నంతకోపం. ఆ పని చేయలేని నిస్సహాయతా. నామీద నాకే జాలేసేది, కోపం వచ్చేది, అసహ్యం పుట్టేది. రాత్రుళ్లు వంటరిగా కూర్చుని ఏడ్చేవాడిని. పగలంతా పీకలదాకా మందుకొట్టేవాడిని. హత్యా, ఆత్మహత్య అని తల బద్దలుకొట్టుకుని ఆలోచించేవాడిని. ఇదంతా సిన్మా ఇండస్ట్రీలోకి అడుగుపెట్టాక జరిగిన పరిణామం

"సాహిత్యం నా జీవితంలో చిచ్చుపెట్టింది. చందమామ పిల్లల కథలతో చదవటం మొదలెట్టిన నేను డిటెక్టివ్‌లూ,




బూతు సాహిత్యం, చలం, గురజాడ, విశ్వనాథ, గోర్కె, టాల్‌స్టాయ్, నెహ్రూ, ఠాగూర్, షేక్స్పియర్ ఇలా అందరి సాహిత్యమూ చదివాను. ఏదో ప్రపంచంలోకి ద్వారాలు తెరుచుకున్నట్లుగా అన్పించేది. అందుకే ఎం.ఎ. లిటరేచర్ చదివాను. పిచ్చిగా చదివేవాడిని. వెర్రిగా చదివేవాడిని. ఆరాధనగా చదివేవాడిని. అసంతృప్తిగా చదివేవాడిని, ఆత్మవిశ్వాసంతో చదివేవాడిని... ఆ పాత్రలు, సంఘటనలూ, ఎమోషన్స్ చూసి ఏడ్చేవాడిని, నవ్వేవాడిని, జాలిపడేవాడిని. 'నడిచే పుస్తకాల పురుగు' అనే నిక్‌నేమ్‌తో నన్ను పిలిచేవాళ్ళు. నా ఫ్రెండ్స్ అంతా ఇంజనీర్లు, డాక్టర్లు, ఐఏయస్‌లూ అయి బోలెడంత డబ్బూ, పేరూ సంపాదించాలని ప్లాను వేస్తుంటే నేను రచయితను కావాలనుకున్నాను. ఏదో రాయాలి. ఏదో చెప్పాలనే ఫీలింగ్, ఆవేశం, ఉద్రేకం లోపల్నుంచి తన్నుకుంటూ వస్తుండేది. పత్రికల్లో కథలు రాశాను. నాటకాలు రాశాను. నెపోలియన్ చెప్పినట్లుగా 'గన్ను కంటే పెన్ను గొప్పదని' లెక్చర్లు దంచేవాడిని. ఆఖరకు ఆ పెన్ను ఎవడో నీచుడు, నికృష్టుడి కాళ్ళదగ్గర తాకట్టుపెట్టాల్సి వస్తుందని ఊహించలేదు" స్వామీజీ ఓ క్షణం ఆపి తిరిగి కొనసాగించాడు.

"ఓ రచయితకు 'సిన్మా' అనే పురుగు ఎందుకు కుడుతుందో తెలీదు. డబ్బు, పేరు ప్రఖ్యాతులకోసం కావచ్చు లేదా తాను రాసింది లక్షలాది మంది ప్రేక్షకులకు చేరుకునే మీడియం సిన్మా కాబట్టి దానిద్వారా ఏదో చెప్పేసి ఈ సమాజాన్నీ, మనుష్యుల్నీ మార్చేసి ప్రపంచాన్ని నందనవనంగా మార్చేయాలన్న భ్రాంతి, భ్రమతో కావచ్చు. ఆవిధంగా భ్రమల్లోపడి నేనూ సిన్మాఫీల్డులో అడుగుపెట్టాను. నేను ఇలా అడుగు పెట్టగానే అలా నిర్మాతలూ, డైరెక్టర్లూ నా స్టోరీలు, టాలెంట్, విద్వత్తు చూసి అబ్బుర పడిపోయి నాకు విపరీతంగా సిన్మా ఛాన్స్ లొచ్చేస్తాయనుకున్నారు. ఎవ్వరూ నన్ను పట్టించుకోలేదు. తిరిగాను తిరిగాను తిరిగాను... అరికాళ్లు రక్తపుముద్దలయ్యేదాకా, నా రక్తం అంతా నీరయిపోయేదాకా తిరుగుతూనే వున్నాను. ఒక్కటంటే ఒక్క అవకాశం కూడా రాలేదు. ప్లాట్‌ఫారంమీద చలికి వణుకుతూ, ఆకలి కడుపుతో కాళ్ళు ముడుచుకుని పడుకునేవాడ్ని. అర్ధరాత్రి మంచి నిద్రలోవుండగా బీటుకానిస్టేబులొచ్చి లాఠీ పెట్టి డొక్కలో పొడిచేవాడు. పెన్నుతో ఏదో చేసేద్దాం, ఏదో రాసేద్దామన్న ఆవేశంతో వచ్చిన నేను జీవచ్ఛవాన్ని అయిపోయాను"

శంకర్ సర్వం మర్చిపోయి మంత్రముగ్ధుడిలా వింటుండిపోయాడు.

"ఆకలి బాధ తట్టుకోలేక కూలీ పని చేశాను. హోటళ్ళలో కప్పులు కడిగాను. బూతు పుస్తకాలు రాశాను. ఏదోవిధంగా బతికాను. చివరకు ఓ సిన్మా రచయిత దగ్గర అసిస్టెంట్‌గా చేరాను. ఆయన రాసిన స్క్రిప్ట్ ఫెయిర్ చేసేవాడిని. ఆయన కాస్త మానవత్వం వున్న మనిషి. మామూలు రచనకూ, సిన్మా రచనకూ తేడా ఏమిటో నేర్పాడు. సిన్మా జీవితం గురించి చెప్పేవాడు. ఆవిధంగా ఆరేళ్లు కష్టపడిన తర్వాత మొట్టమొదట మలయాళ డబ్బింగ్ సిన్మాకు మాటలు రాశాను. సెక్స్ సిన్మాలో మాటలేముంటాయి? అయినా మొదటిసారిగా తెరమీద పేరుచూసుకుంటే ఎవరెస్ట్ ఎక్కినంత ఆనందంగా అన్పించింది. అక్కడనుంచీ డబ్బింగ్ సిన్మాలకు రాయటం మొదలయ్యింది. మెల్లగా పేరూ, డబ్బులూ వచ్చాయి. కొద్దో గొప్పో సక్సెస్ అయ్యాను. అయినా సరే ఇండస్ట్రీలో ఎడ్జెస్ట్ కావటమనే విషయం నరకంగా మారింది. ఎవరికయినా కథ చెబితే బాగాలేదనేవాళ్లు. తర్వాత అదే కథ తెరమీద కన్పించేది. ఎలుగెత్తి, దిక్కులు పిక్కటిల్లేలా అరిచి 'అది నా కథని' చెప్పేవాడిని. జనం నన్ను చూసి

పిచ్చివాడిని చూసినట్లుగా నవ్వుకునేవాళ్ళు. నా అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పే వాడిని. బైటకు గెంటేవాళ్ళు.

విషాదం ఏమిటో తెలుసా? రైటర్ అనే వాడు సిన్మా సృష్టికర్త. ఓ కథ, సంఘట నలు, పాత్రలూ సర్వం అన్నీ అతని మేధస్సు మథనంలోంచి పుట్టుకొస్తాయి. హీరోహీరోయిన్లు చిలకపలుకుల్లా రైటర్ రాసిన డైలాగులు పలుకుతారు. జనం బ్రహ్మరథం పడతారు? సిన్మా సూపర్‌హిట్ట వుతుంది. రైటర్ మాత్రం ఏ గుర్తింపుకూ నోచుకోకుండా చీకట్లోనే వుండిపోతాడు. ఇతరులు ఆ క్రెడిట్ కొట్టేస్తారు. రైటర్ని మాత్రం ఎవ్వరూ గుర్తించరు.

అందుకే మా సీనియర్ రచయిత అంటాడు గదా! 'బ్రహ్మకు గుడి, రైటర్‌కు గుర్తింపు వుండదు' అది అక్షరసత్యం. రైటర్ కర్వేపాకులాంటివాడు. తాలింపు పెట్టాక ఏరి పక్కన పడేస్తారు.

సరే... నా డిప్రెషన్, దిగులు, విషాదం, దుఃఖం భరించలేక ఎన్నోసార్లు ఆత్మహత్య ప్రయత్నాలు చేశాను. అయినా బతికాను.

నీకో విషయం చెప్పనా? సిన్మా ఫీల్డులో ఎవ్వరు కూడా ఆకాశంలోంచి ఊడిపడ లేదు. ప్లాట్‌ఫారాలమీదనుంచీ, సామాన్య మైన స్థితుగతుల్లోంచీ వచ్చివాళ్లే. కానీ వాళ్ళే కాస్త సక్సెస్, డబ్బు రాగానే తాము పుట్ట టమే నటులుగా, డైరెక్టర్లుగా పుట్టినట్లు షోజేస్తారు. సిన్మాఫీల్డనే సుక్షేత్రం తమ తాతగారి సొమ్ములా ఫీలవుతారు. దాని మీద కేవలం తమకు మాత్రమే హక్కుంద నుకుంటారు.

కొత్తగా వచ్చేవాళ్లను చూడగానే తమ ఆస్తంతా వీళ్లు దోచుకుపోతారేమోనన్నం తగా భయపడతారు. అంతర్లీనంగా కొత్త వాళ్ళ టాలెంట్ కారణంగా తాము ఎక్కడ కొట్టుకుపోతామోనన్న భయంతో వణికి చస్తారు. తాము గతంలోపడ్డ బాధలు, అవ మానాలూ, హేళనలూ కొత్త వాళ్ళమీద ప్రయోగించి ఆనందిస్తారు. గతాన్ని మర్చి పోతారు. ఒకప్పుడు తాము కూడా భయం భయంగానే ఇండస్ట్రీలోకి అడుగుపెట్టి కష్టా లన్నీ పడ్డామనీ ఆరోజుల్లో ఎంత బాధప డ్డామో గుర్తుపెట్టుకుని తాము ఆవిధంగా ప్రవర్తించకూడదని అర్థం చేసుకోరు. వాళ్ళ లోంచి శాడిజం, పెర్వర్షన్స్ నిద్రలేస్తాయి. అచ్చా... ఇప్పుడు మా వంతు వచ్చింది అనుకుని దరిద్రంగా, నీచంగా ప్రవర్తిస్తారు.

ఇందాక నీకు సురేంద్ర కారణంగా జరి గిన అవమానం కళ్ళతో చూశాను. బాధప డ్డాను. జాలిపడ్డాను. దాన్ని ఖండించలేని నా అసహాయతకు నన్ను నేనే తిట్టుకు న్నాను.

శంకర్... నీకంటే పదేళ్ళ సీనియర్‌గా ఈ నీచమైన కష్టాలన్నీ అనుభవించిన అను భవజ్ఞుడిగా చెబుతున్నాను జాగ్రత్తగా విను.

ఈ నీచులు చేసే నికృష్టమైన పని ఏమిటో తెలుసా?

నీ ఆత్మవిశ్వాసంమీద దెబ్బకొడతారు.

నువ్వు వేస్ట్ అంటారు. నీలో టాలెంట్ లేదంటారు. వ్యర్థుడివి అంటారు. ఇంటికె ళ్ళిపో... వేరే పని చూసుకో అని సలహాలు ఇస్తారు. 'ఇది దరిద్రపు ఫీల్డు, నువ్వు పడ లేవంటారు?' మరి అటువంటప్పుడు మీరెం దుకుంటున్నారంటే సమాధానం చెప్పలేరు. అసలు ఎవరూ ఎదురు ప్రశ్నించలేరన్న నమ్మకం వాళ్ళది. అందుకే అడ్డమైన సల హాలన్నీ ఇస్తారు.

అసలు టాలెంట్‌ను వీళ్ళెలా గుర్తిస్తారు? వీళ్ళ దగ్గర టాలెంట్‌ను కొలిచే బారామీ టర్ వుందా?

వీళ్ళు సర్వజ్ఞులా? వీళ్ళు మేధావులా? వీళ్ళకు తెలీని విషయాలులేవా? ప్రేక్షకులు వీళ్ళ సిన్మాలు తప్ప ఇతరులవీ, కొత్తవాళ్లవీ చూడమని తీర్మానించారా?

సినిమా ఇండస్ట్రీలో వీళ్ళు చెప్పిందే వేదమా?





మరి అలా అయితే మన సినిమాలు ఇంత దరిద్రంగా ఎందుకు వుంటున్నాయి? సీనియర్ మేధావుల సినిమాలు ఎందుకు అట్టర్‌ఫ్లాప్ అవుతున్నాయి? ప్రేక్షకులు ఎందుకు ఛీకొడుతున్నారు?

వీళ్ళదగ్గర సమాధానంలేదు.

హిపోక్రసీ, కుళ్ళు, నీచత్వంలో మునిగిపోయి వాస్తవాన్ని గుర్తించరు. మళ్ళీ దారుణమైన ఇన్‌సెక్యూరిటీతో బాధపడుతూ వుంటారు. ఏ కొత్తవాడో వచ్చేసి తమ నెత్తిమీదున్న కిరీటాన్ని ఎత్తుకెళ్ళిపోతాడేమోనని అనుక్షణం ఉలిక్కిపడుతూ వుంటారు.

రామ్‌గోపాల్‌వర్మను తీసుకో.

అతను ఎవ్వరి దగ్గరా అసిస్టెంట్‌గా పని చేయలేదు. స్క్రిప్టు పట్టుకుని చాలామంది దగ్గరికెళ్ళాడు. అందరూ నవ్వారు. బచ్చాగాడివి నువ్వు డైరక్టరేంటన్నారు. అతను మౌనంగా తనపని తాను చేసుకెళ్ళిపోయాడు. శివ తీశాడు. ఏం జరిగిందో అందరికీ తెలుసు. సూపర్ హిట్... తెలుగు సిన్మా ఇండస్ట్రీ గతినే మార్చేసింది. కోట్లు సూట్‌కేసుల్లో సర్దుకుని నిర్మాతలు అతని ఇంటిముందు క్యూలు కట్టారు. గతంలో వాళ్ళంతా అతన్ని చూసి నవ్వినవాళ్ళే. వర్మను స్ఫూర్తిగా తీసుకుని యంగ్ డైరక్టర్స్ తయారయ్యారు.

ఒకప్పుడు డైరెక్టర్ అంటే 'అనుభవం వుండాలి. ఇరవై పాతికేళ్ళు పరిశ్రమలో నలగాలి. జుట్టు తెల్లబడాలి. పెద్ద డైరెక్టర్స్ దగ్గర అసిస్టెంట్‌గా చేసివుండాలి' ఇవి ఇండస్ట్రీ ఆలోచనలు... అప్పుడే ఎవరైనా డైరక్టర్ అయ్యేవాళ్ళు

కానీ రామ్‌గోపాల్‌వర్మ దీన్నంతా బద్దలు కొట్టాడు.

అతని దెబ్బకు చిన్న కుర్రాడెళ్ళి కథ చెబుతానన్నా నిర్మాతలు శ్రద్ధగా వింటున్నారు. 'ఏ కథలో ఏ వర్మ వున్నాడో' అన్నంత గౌరవం, ఎటెన్షన్ పేచేస్తున్నారు. ఇదో మంచి పరిణామం. అద్భుతమైన మార్పు. ప్రతి యంగ్ డైరెక్టర్ ఇంట్లో రామ్‌గోపాల్ వర్మ ఫోటో పెట్టుకుని పూజించాలి. అంతటి విప్లవాత్మకమైన పరిస్థితులు తీసుకువచ్చాడు అతను.

వర్మ, మణిరత్నం, శేఖర్‌కపూర్, షారూక్ ఖాన్, చిరంజీవి, శంకర్... వీళ్లందరినీ తీసుకో. అందరూ కేవలం కృషిని, టాలెంట్‌నూ నమ్ముకుని సంచలనం సృష్టించారు. వాళ్ళకు ఎవ్వరూ స్వాగతం పలకలేదు. నీకంటే ఎక్కువ అవమానాలు పడ్డారు.

శంకర్ నిన్ను నువ్వు నమ్ముకో.

నీ ఆలోచనలే నిన్ను రూపొందిస్తాయి.

నెగెటివ్ థింకింగ్‌ను గోయితీసి పూడ్చిపెట్టు. అవమానం, ఆకలి, దుఃఖం, ప్రశంస, దారిద్ర్యం, సోమరితనం, నిర్లక్ష్యం ఏదీ కూడా నిన్ను నీ లక్ష్యానికి దూరం చేయకూడదు.

ఈ ప్రపంచంలో మనిషికి శత్రువులే లేరు.

ఎవడికివాడే శత్రువు.

ఎవడి మూర్ఖత్వం, అజ్ఞానం, సోంబేరితనం, నోటి దురుసు, బద్ధకం, బలహీనతలే వాడి పాలిట బ్రహ్మారాక్షసులయి శత్రువులుగా వాడిని పాతాళంలోకి ఈడుస్తాయి. ఇది అర్థం చేసుకోలేక మనం వాడు దెబ్బకొట్టాడు, వీడు వెన్నుపోటు పొడిచాడు, పక్కవాడు రాజకీయం చేశాడు, వెనకవాడు తొక్కేశాడు... అని సెల్ఫ్‌పిటీతో ఏడుస్తూ వుంటాం. మనం సక్సెస్ కాలేదంటే అందుకు మనమే కారణం. మనలోనే ఎక్కడో ఏదో లోపమో, బలహీనతో వుందన్నమాట. నిర్మొహమాటంగా ఆత్మవిమర్శ చేసుకుంటే మనల్ని ఎవ్వరూ ఏమీ చేయలేరు. మన సక్సెస్‌ను ఎవ్వరూ అడ్డుకోలేరు.

ఓర్పు కావాలి శంకర్.

విత్తు నాటగానే పండురాదు, స్కూల్లో చేరగానే ఐఏయస్ కాలేవు. సినిమా ఇండస్ట్రీలో ఎవ్వరూ రాత్రికి రాత్రే మెగాస్టార్లూ, మెగా డైరెక్టర్లూ కాలేరు. ఒక్కో మెట్టే



ఎక్కుతూ, వందసార్లు పడిపోతూ క్రమశిక్షణ, ఆత్మవిశ్వాసాలను ఊతం చేసుకుని వాళ్ళు ఆ స్థాయికి చేరుకుని శిఖరాన్ని అధిరోహించారు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానో తెలుసా?

నేనీ పరిస్థితిలో ఉన్నప్పుడు ఓ మహానుభావుడు ఆదుకుని అన్నం పెట్టాడు. కష్టం విలువ నాకు తెలుసు కన్నీళ్లరుచి నాకు తెలుసు.

నిద్రలేని రాత్రులు, వేదన నాకు తెలుసు.

నాకే కాదు శంకర్... జ్వలించే ప్రతిఒక్కడికీ తెలుసు.

ఇదో యుద్ధం. పోరాటం చేయి. ఆఖరు క్షణందాకా పోరాడు. ఎటు తిరిగీ చచ్చిపోదామనుకుంటున్నావు. పిరికివాడిగా చచ్చేకంటే పోరాడుతూ ధీరోదాత్తుడిలా చచ్చిపో శంకర్"

మాటలు నాలుక చివరనుంచి వస్తే వాటికి విలువలేదు. గుండెలోతుల్లోంచి వస్తే అవి కదిలిస్తాయి. ఆత్మలోంచి మాటలు వస్తే అవి స్ఫూర్తినిస్తాయి. ధైర్యం చెబుతాయి. పాజిటివ్ ఓదార్పునిస్తాయి.

స్వామీజీ ఆత్మతో మాట్లాడాడు.

అతని మాటల్లో జీవితం వుంది... అది ఉపన్యాసం కాదు. ఓ కుర్రాడి జీవితం మరణమా? రణమా? అన్న సందిగ్ధంలో ఊగిసలాడుతున్న సమయంలో ఏం కావాలన్నది, ఏం చేయాలన్నది స్వామీజీ జీవితానుభవంతో చెప్పాడు.

శంకర్ తలెత్తాడు.

అతని కళ్లనిండా నీళ్ళున్నాయి. కష్టాలూ, ఘర్షణా, పోరాటం లేకుండా జీవననౌక ఆవలితీరం చేరలేదన్న నగ్నసత్యం అర్థం కావటంవల్ల వచ్చిన దుఃఖాశ్రువులవి.

ధీరోదాత్తుడు దుఃఖంలోంచి ఎదుగుతాడు.

మూర్ఖుడు సుఖాలద్వారా పాతాళంలోకి జారిపోతాడు.

అతను రెండు చేతులూ జోడించి స్వామీజికి నమస్కరించాడు. ఉద్వేగంతో, ఆవేశంతో ఏదో చెప్పాలనుకున్నాడు. నోరు పెగల్లేదు. మౌనమే భాషంగా మారింది.

స్వామీజీ భారంగా నిట్టూర్చాడు. అతనికి అర్థమైంది.

మనిషి 'స్వయంకృత సమాధిని' ఛేదించుకుని కార్యరంగంలో దూకేముందు అలాగే వుంటాడు.



"నీ పేరేంటి? "

"దివ్య సార్..."

"వెరీగుడ్... దివ్యభారతంత అందంగా వున్నావు"

ఆ అమ్మాయి అందంగా సిగ్గుపడింది. డైరెక్టర్‌గారు మెచ్చుకున్నారంటే తను దాదాపుగా హీరోయిన్ అయిపోయినట్లే. నగలూ, బట్టలూ, బ్యూటీపార్లర్లూ... డబ్బూ, కార్లూ, నౌకర్లూ... తను శ్రీదేవంత పెద్ద ఆలిండియా హీరోయినయిపోతుంది. చిరంజీవి, హృతిక్‌రోషన్, రజనీకాంత్, ఏమో! ఇంగ్లీష్ సిన్మాల్లో కూడా యాక్ట్ చేయచ్చు ఆమెకు హాలీవుడ్ హీరోల పేర్లు తెలీదు కాబట్టి అంతవరకే ఊహించుకుంది.

"నువ్వు సిన్మాల్లో నటిస్తానంటే మీ





ఇంట్లోవాళ్ళు ఒప్పుకుంటారా? "

"ఒప్పుకోరు సార్... కానీ నచ్చచెప్పగలను. హీరోయిన్ అంటే మాటలా సార్?"

"అవును. హీరోయిన్ అంటే మాటలా?" అన్నాడాయన రిపీట్ చేస్తూ, "అన్ని పత్రికలూ నీ ఫొటోలే కవర్‌పేజీగా వేస్తారు. పోస్టర్స్‌లో, సిన్మాల్లో, టీవీల్లో ఎక్కడ చూసినా నువ్వే వుంటావు. కుర్రాళ్ళు నీ పేరే కలవరిస్తూ ఆరాధిస్తుంటారు. నీకు ముందు నీ తర్వాత అంతటి హీరోయిన్ రాలేదు. రాబోదంటూ ప్రపంచమంతా పొగుడుతుంది.

"ఇదంతా జరుగుతుందా సార్?" ఆ అమ్మాయి ఆశగా అడిగింది.

"ఎందుకు జరగదు? ఈ సిన్మాలో నువ్వు హీరోయిన్‌గా చేస్తే నీ జీవితమే మారిపోతుంది. వంటిమీద బంగారం తొడుగులు చేయించుకోవచ్చు నీ అందం, నటనా, గ్లామర్ చూసి జనం పిచ్చివాళ్ళయిపోతారు"

దివ్య కళ్ళు తళుక్కుమంటూ మెరిశాయి. ఆశలు పురివిప్పుకుంటున్నాయి. మనస్సు ఆకాశంలో తేలిపోతోంది. ఎనిమిదో తరగతి చదువుతున్నప్పటినుంచీ సిన్మా హీరోయిన్ కావాలనేది ఆ అమ్మాయి లక్ష్యం. ఆ బట్టలూ, పాటలూ, గ్లామర్... డబ్బూ... చుట్టూ ఆరాధించే జనం ఓహ్... సిన్మా హీరోయిన్ జీవితం అంటే స్వర్గంకంటే ఎక్కువ.

తను అందంగా వుంటానని దివ్యకు తెలుసు. స్కూల్ టైంనుంచే అబ్బాయిలు తనవైపు దొంగచూపులు చూస్తుంటే నవ్వుకునేది. వాళ్ళను పట్టించుకోనట్లుగా నటించేది. తన అపురూప సౌందర్యం గురించి గర్వపడేది.

సిన్మాలు విపరీతంగా చూసేది.

ఏ సిన్మా చూసినా అందులో తననే హీరోయిన్‌గా ఊహించుకునేది. సిన్మాల్లో మాదిరిగా రకరకాల డ్రస్సులు కుట్టించుకుని వేసుకుని అద్దంలో తనను తాను చూసి మురిసిపోయేది.

తను ఏనాటికయినా గొప్ప హీరోయిన్ అయిపోతుందన్న బలమైన నమ్మకం ఆమెకు టీనేజ్‌లోనే పడింది. తను జగదేక సుందరి కాకపోతే అబ్బాయిలు తన చుట్టూ ఎందుకు తిరుగుతారు? అనుకునేది.

అప్పటినుంచే చదవటం, చదువుకోవటం అనేది శుద్ధబోరింగ్ విషయంగా మారిపోయింది. సిన్మాలే ప్రపంచమైపోయింది.

మధ్యతరగతి నుంచి వచ్చిన దివ్య ఆలోచనలు సిన్మాలు, డబ్బూ, సుఖాల చుట్టూ తిరుగుతూ వుండేది. పదవతరగతి తప్పటంతో చదువు మాన్పించి ఇంట్లో కూర్చోబెట్టారు. దాంతో కావల్సినంత తీరిక... ఇరవై నాలుగుగంటలూ టీవీలో సిన్మాలు చూస్తూనే వుండేది. పెళ్ళిచేసి పంపేస్తే తమ బాధ్యత తీరిపోతుందని తల్లిదండ్రులు అనుకుంటారు. కానీ వాళ్ళ ఆలోచనలూ, భ్రమలూ, ఊహలూ ఎక్కడకు దారితీస్తున్నాయో అర్థం చేసుకోలేకపోవడం దురదృష్టకరం. ఇక కాలక్షేపపు స్నేహితులు మరింత హానిచేస్తారు. నీరజ అనే పక్కింటి అమ్మాయి టీవీ చూట్టానికి దివ్యా వాళ్ళ ఇంటికి వస్తుండేది. ఇద్దరూ టీవీలో సిన్మాలు చూస్తుండగా నీరజ, 'నీ ముందు, నీ అందం ముందు ఆ హీరోయిన్ ఎంత? నువ్వే కనుక సిన్మాల్లోకి వెళితేనా?' అన్న డైలాగులేస్తూ వుండేది. నిజానికి దివ్యది అద్భుతమైన అందం. సిన్మా హీరోయిన్ కావాలంటే కేవలం అందం ఒక్కటే సరిపోదని ఇద్దరికీ తెలీదు. ఇద్దరూ గంటల తరబడి సిన్మా హీరోయిన్ల గురించీ, వాళ్ళ నగలు, బట్టలూ, వాళ్ళు ఏ హీరోలతో చేస్తే బాగుంటుంది అన్న నిరర్థక విషయాల గురించి చర్చిస్తూ వుండేవాళ్ళు. 'అమ్మాయి ఇంట్లోనే వుందికదా సేఫ్' అని తల్లిదండ్రులు అనుకుంటారు. కానీ ఆ అమ్మాయి బుర్రలో ఎన్ని విషసర్పాలు తిరుగుతున్నదీ వాళ్ళకు తెలీదు.

సరే ఈవిధంగా సహజసిద్ధమైన కోరిక, స్నేహితురాలి ప్రోద్బలం, చూస్తున్న సిన్మాలు, చేయటానికి ఇంకేం పనిలేకపోవటం ఇవన్నీ కలిసి దివ్యను 'నూతన నటీ నటులు కావలెను' అన్న ప్రకటనతో ఇచ్చిన అడ్రస్ వైపుకు అయస్కాంతంలా నడిపించాయి. ఇంట్లో తెలీకుండా దివ్య స్నేహితురాలిని వెంటబెట్టుకుని మార్నింగ్‌షో సిన్మా కని చెప్పి సిన్మా ఆఫీసుకు వచ్చింది.

"లంగా ఓణీల్లోనే ఇలా వున్నావంటే జీన్స్, మిడ్డీస్‌లాంటి మోడ్రన్ డ్రస్సుల్లో నువ్వు అదిరిపోతావు" డైరెక్టర్ అన్నాడు.

దివ్య, సిగ్గుగా నవ్వింది. అప్పుడే ఆమె తననుతాను వివిధ మోడ్రన్ డ్రస్సుల్లో ఊహించేసుకోవటం ప్రారంభించింది. తను కనుక ఈ సిన్మాలో హీరోయిన్ అయితే తమ వీధివీధంతా తన గురించి గొప్పగా చెప్పుకుంటారు. తను ఫారిన్ కార్లలో వళ్లంతా నగలు పెట్టుకుని మోడ్రన్ డ్రస్సు లేసుకుని తిరుగుతుంటే 'కోటేశ్వరరావు కూతురేనా?' అంటూ అందరూ ఆశ్చర్యపోతారు. కట్నం సరిపోలేదని పెళ్లిచేసుకోని పెళ్లికొడుకుల ముఖాన చెప్పుకు పేడరాసి కొట్టినట్లవుతుంది. వాళ్లు పెళ్లాలతో సిన్మాకు వస్తే తెరమీద తన అందం, గ్లామర్ చూసి 'ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకోకపోతిమే!' అని కుళ్ళుకు చస్తారు. తమకు వాళ్ళంత డబ్బులు, నగలు లేవని చులకనగా చూసే బంధువులంతా తన ఇంటిముందు గజ్జికుక్కల్లా తిరుగుతూవుంటారు.

"అమ్మా దివ్యభారతీ..."

దివ్య ఊహల్లోంచి ఉలిక్కిపడి తేరుకుని, "నా పేరు దివ్యభారతి కాదండీ దివ్య సార్..." అంది సిగ్గుగా.

"పేరులో ఏముందమ్మాయ్. అంతా నీ అందం, పర్సనాలటీల్లో వుంది. నా మాట నమ్ము. నువ్వు పెద్ద సిన్మా హీరోయిన్ అయి వెండితెరను దున్నేస్తావు"

"అంతా మీ దయ సార్"

"సరేకానీ సాయంత్రం ఆరున్నరకల్లా ఇక్కడకు వచ్చేయమ్మా..."

"ఎందుకు సార్?" దివ్య ఆశ్చర్యంగా అడిగింది.

"మేకప్ టెస్ట్ తల్లీ... కెమేరా ముందు ఎలా వుంటావో చూసుకోవాలికదా! సాయంత్రం ఆరున్నరకు వస్తే మేకప్ చేయించి హీరోయిన్‌గా ఎంతవరకూ పనికి వస్తావో చూడాలి..."

"అమ్మో! సాయంత్రమే... మా ఇంట్లో చంపేస్తారు..."

డైరెక్టర్ నవ్వాడు. అతని అనుభవమంతా ఆ నవ్వులోనే వుంది. "మరేం చేద్దాం... పోనీ మానేద్దామా?"

అదృష్టం అందుబాటులో వచ్చి ఆఖరుక్షణంలో చేజారిపోతున్నట్లుగా దివ్య గిలగిలలాడిపోయింది. ఏంచేయాలో అర్థంకాలేదు. మంచి అవకాశం కానీ ఇంట్లో చంపేస్తారు. పగలే బైటకు రానీరు. సాయంత్రమంటే సమస్యేలేదు. హీరోయిన్ ఛాన్స్ చూస్తూ చూస్తూ చేజారిపోతుంది. ఏం చేయాలి?"

ఆమె లోపల జరుగుతున్న భావసంచలనాన్ని గమనిస్తున్న డైరెక్టర్ "బాగా ఆలోచించుకో తల్లీ... మంచి అవకాశం" అన్నాడు. ఐదు నిమిషాల డైలమా తర్వాత దివ్య ఓ నిర్ణయానికి వచ్చింది.

"వస్తాను సార్. కానీ ఈరోజు సాయంత్రం కాదు. రేపు పొద్దున పదింటికి..." అంది.

డైరెక్టర్ ఆలోచిస్తున్నట్లుగా నటించాడు. "రేపు వస్తానంటావా? కష్టమేనే... సరే ఏంచేస్తాం. ఖచ్చితంగా రేపొద్దున్న పదింటికల్లా వచ్చేస్తావుగా. మళ్ళీ రాకపోతే కష్టం. మేకప్‌మెన్, కెమేరామెన్, కాస్ట్యూమర్ అందరూ వెయిట్ చేస్తుంటారు. ముందే ఆలోచించుకుని చెప్పు"

"వస్తాను సార్... తప్పకుండా రేపు పదింటికి వస్తాను" ఆమె గొంతులో దృఢ నిశ్చయం ధ్వనించింది.





"మంచిది తల్లీ... రేపు నీ మేకప్ టెస్ట్‌కు అన్ని ఏర్పాట్లూ చేస్తాను"

"సార్..." అంది దివ్య సందేహంగా "రేపు ఏమీ ప్రాబ్లమ్ వుండదుకదా సార్?"

"ఎంత మాటవున్నావు తల్లీ..." డైరెక్టర్ కళ్ళజోడు తీసి కళ్లు తుడుచుకున్నాడు. "నాకూ ఇద్దరు ఆడపిల్లలున్నారు తల్లీ. నీ తండ్రిలాంటివాడిని. మనసులో ఏమీ సందేహాలు పెట్టుకోకుండా రేపు వచ్చేయ్. ఆరు నెలలు తిరిగేసరికల్లా పెద్ద హీరోయినయిపోతావు. నన్ను నమ్ము తల్లీ..." అన్నాడు గద్గదమైన గొంతుతో.

దివ్య డైరెక్టర్‌కు నమస్కరించి బైటకు నడిచింది.

తిరిగి వెళుతుండగా ఆటోలో నీరజ అడిగింది. "దివ్యా... ఏమయ్యిందే... డైరెక్టర్ గారు ఏమన్నారు?" చాలా ఆత్రుతగా అడిగింది.

దివ్య నిరాశగా పెదవి విరిచింది. "లేదే బాడ్‌లక్... నేను హీరోయిన్‌గా సెలక్ట్ కాలేదు"

"నిన్ను హీరోయిన్‌గా సెలక్ట్ చేయలేదా?" నీరజ మరింత ఆశ్చర్యంగా అడిగింది. "వచ్చిన వాళ్ళందరిలో నువ్వే మెరిసిపోతున్నావే... నిన్ను సెలక్ట్ చేయలేదంటేనే తెలుస్తుంది డైరెక్టర్‌గాడి కళ్ళజోడు పవర్ తగ్గిందని" అంది కసిగా. దివ్య తప్పకుండా హీరోయిన్ అవుతుందని ఆ అమ్మాయి ప్రగాఢ నమ్మకం.

"పోన్లేవే వదిలేయ్. అదృష్టం లేకపోతే ఏం చేస్తాం? ఈ విషయం మాత్రం ఎవరి దగ్గరా అనకు..."

"నువ్వు అంతగా చెప్పాలా? చచ్చినా ఎవ్వరికీ చెప్పను" నీరజ భరోసా ఇస్తున్నట్లుగా అంది. "బోడి వీళ్ళు కాకపోతే ఇంకో సిన్మా వాళ్ళు తీసుకుంటారు. నీకేం తక్కువ?" ఓదారుస్తున్నట్లుగా అంది.

దివ్య మనసులోనే నవ్వుకుంది.

'తను హీరోయిన్‌గా సెలక్ట్ అయిన విషయం అప్పుడే నీరజకు చెప్పదల్చుకోలేదు. ఒకేసారి అందరితోపాటు నీరజ కూడా పేపర్లలో చూసి ఆశ్చర్యపోవాలి. థ్రిల్ అయిపోవాలి. అప్పటిదాకా అంతా సస్పెన్స్' అనుకుంది మనసులో. అదే ఆమె చేసిన ఘోరమైన తప్పు.

★ ★ ★

దివ్య వెళ్ళిపోయిన తరువాత డైరెక్టర్ సిగరెట్ తీసి వెలిగించాడు.

అతని పేరు ఏమిటో చాలామందికి తెలీదు. గతం కూడా తెలీదు. శ్రీకాకుళంలోని ఓ మారుమూల కుగ్రామంనుంచి చిన్నతనంలోనే సిన్మా పిచ్చితో ఇంట్లోంచి పారిపోయాడు. పదేళ్ళ ప్లాట్‌ఫారం బతుకు తర్వాత ప్రొడక్షన్‌బాయ్ అయ్యాడు. ఆ తర్వాత ఏడేళ్ళకు ప్రొడక్షన్ మేనేజర్. అప్పటికే నలభైఏళ్ళ వయసొచ్చింది.

సిన్మా ఫీల్డు అంటే ఏమిటో నీచమైన కోణంలోంచి బాగా అర్థమైంది.

సిన్మాఫీల్డులో సక్సెస్ కావాలంటే అద్భుతమైన టాలెంట్ వుండాలి. సిన్మాఫీల్డులో నిలదొక్కుకోవాలంటే కొన్ని లక్షణాలు అలవాటు చేసుకోవాలి. అతనికి కావల్సింది సక్సెస్ కావటం కాదు, నిలదొక్కుకుని డబ్బు సంపాదించి సుఖపడటం. ఆకలీ, కష్టాలూ, బూతులూ, దెబ్బలూ, ముఖంమీద పడ్డ వేడి టీ తాలూకూ మచ్చలూ, ఇవన్నీ కలిపి అతన్ని ఓవైపుకు లాక్కువెళ్ళాయి. దాదాపు పాతికేళ్ల జీవితం సిన్మా ఫీల్డులోనే గడిచిపోయింది. ఎప్పుడూ నిర్మాతలూ, డైరక్టర్లూ, నటులనుంచి తిట్లు తప్పితే ఏనాడూ ప్రశంసలు లేవు. 'ఒరేయ్... టీ ఏదిరా నాకొడకా!', 'టీ ఇంత చల్లగా వుందేంట్రా నీయమ్మా', 'గుట్కాలు చెప్పి ఎంత సేపయ్యిందిరా బాడ్కోవ్!', 'నీకు వళ్ళు బలిసిందిరా కొడకా' ఇలా తిట్లు... బూతులు... తన్నులు. ఎదురుతిరిగితే ఆ ఒక్కపూట

తిండి కూడా పోతుందని నోర్మూసుకుని పైకి నవ్వుతూ భరించేవాడు. ఆ నవ్వు వెనుక కసీ, కడుపుమంటా వుండేది. అది బైటపడకుండా జాగ్రత్తపడేవాడు.

సిన్మా ఇండస్ట్రీలో పాతికేళ్లపాటు రకరకాల పనులుచేసిన తర్వాత అతనికో విషయం అర్థమైంది. తనకు ఇండస్ట్రీలో భవిష్యత్తు లేదు. ఎందుకంటే తను నటుడో, రైటరో, దర్శకుడో కాదు. టాలెంట్ లేదు. జీవితాంతం టీలు, మందుబాటిల్స్ అందిస్తూ బతకాల్సిందే. అందుకే ఏం చేయాలని దీర్ఘంగా ఆలోచించాడు. సిన్మా జీవితం అతనికి సమాధానం చెప్పింది.

సిన్మాఫీల్డులో బతుకు ఎంత దరిద్రంగా, దుర్భరంగా, నీచంగా వున్నా బైట జనాలకు సిన్మాలంటే విపరీతమైన క్రేజ్... పిచ్చి... అభిమానం. ఆ క్రేజ్‌ను క్యాష్ చేసుకుంటే?

★ ★ ★

క్రేజీ హీరోస్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్.

ఈ దేశంలో అమ్మాయిలు, అబ్బాయిలకు ఆత్మవిశ్వాసం ఎక్కువ. ఆత్మవిశ్వాసం అంటే జీవితాన్ని ఎదుర్కొనే ఆత్మవిశ్వాసం కాదు. తాము విపరీతమైన అందగాళ్ళమనే ఆత్మవిశ్వాసం. చదువు, వ్యక్తిత్వం, క్రమశిక్షణ, నీతి నిజాయితీలతో వచ్చే ఆత్మవిశ్వాసంకంటే మేకప్, డ్రస్సులవల్ల వచ్చే ఆత్మవిశ్వాసం ఎక్కువ. ఐశ్వర్యారాయ్ కంటే నేను అందంలో ఏం తీసిపోయాను? అని అమ్మాయిలు, హృతిక్‌రోషన్ నా పర్సనాలిటీ ముందు నిలబడతాడా? అని అబ్బాయిలు తరచూ అనుకుంటూ ఆనందపడుతూవుంటారు. దీనితోపాటు రాత్రికిరాత్రే కోట్లు సంపాదించేసి ఎంజాయ్ చేయాలన్న ఆరాటం. వాళ్ళ దృష్టిలో అందుకు దగ్గర దారి సిన్మాఫీల్డు. సిన్మాల్లో నటిస్తే లక్షలూ, కోట్లు వర్షంలా కురుస్తుందన్న ఆశ.

సిన్సియర్ ఐఏయస్ ఆఫీసర్‌తోనో, ప్రముఖ డాక్టర్‌తోనో ఐడెంటిఫై చేసుకునే వాళ్ళకంటే సిన్మా హీరోహీరోయిన్లతో ఐడెంటిఫై చేసుకునే వాళ్లు ఎక్కువగా వుంటారు.

తెరమీద కన్పించేదంతా అందమైన భ్రాంతి అనే జనాల్ని ఆ టైపు ఇంద్రజాలంతో సమ్మోహనపరచి వాళ్లు వ్యాపారం చేసుకుంటారని వీళ్ళకు తెలీదు. ఆ అజ్ఞానం మీదే కోట్లాదిరూపాయలు బిజినెస్ నడుస్తుంది. యూత్‌లోని ఆ క్రేజ్‌ను ఆయుధంగా చేసుకొని 'క్రేజీ హీరోస్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్' ఏర్పడింది.

'మీరు హీరో కావాలనుకుంటున్నారా? మీరు కూడా సిన్మా హీరోయిన్ కావచ్చు' టైపు ప్రకటనలు పత్రికల్లో కనబడగానే జనం పొలోమని ఎగబడతారు.

ప్రపంచంలో ఎక్కడా కూడా సిన్మానటులకు దేవాలయాలు కట్టి ఆరాధించిన దాఖలాలు లేవు. భారతీయ యువత మాత్రం ఈ విషయంలో అన్ని దేశాలకంటే ఎంతో ముందు వుంది. సిన్మా ఫీల్డు అంటే అది స్వర్గం. సుఖాలు తప్ప వేరే వుండవు. ఏదో విధంగా ఫీల్డులో స్థానం సంపాదిస్తే ఇక జీవితాంతం బ్రహ్మాండంగా సుఖపడిపోవచ్చన్న నమ్మకంతో అమ్మాయిలూ, అబ్బాయిలూ సిన్మా ఛాన్సులకోసం వెంపర్లాడిపోతారు.

'నువ్వు హీరోయిన్‌గా వున్నావంటే ఏ కుర్రాడు మాత్రం కలల్లో తేలిపోడు? నీ అందం ముందు సుస్మితాసేన్ చిత్తయిపోతుంద'నగానే అమ్మాయిలు మంచులా కరిగిపోతారు. అంతేకానీ ఇదే డైలాగు అదే వ్యక్తి ఎంతమందికి ఆల్‌రెడీ చెప్పివుంటాడన్నది ఆలోచించరు. వాళ్ళనసలు ఆలోచించుకునే స్థితిలో వుండనివ్వరు. అద్భుతమైన స్వప్నలోకంలోకి తీసుకెళ్ళిపోతారు. అది స్వర్గం అనుకుంటారుకానీ త్రిశంకు స్వర్గమని తెలీదు. ఈ టైపు ఛీటింగ్‌గాళ్ళు ఎంతద్భుతమైన డైలాగులు చెబుతూ తియ్యగా మాట్లాడుతారో ఊహించటమే కష్టం. ఒక్కొక్కడిదీ ఒక్కో విభిన్నమైన శైలి. ఈ టాలెంట్ అంతా జనాన్ని దారుణంగా





ఛీటింగ్ చేయటానికి.

కాలు కదపకుండా కేవలం మాటలు చెప్పి, ఛీటింగ్ చేస్తూ వీళ్ళు చేసే జల్సాలు, కార్లు, సెల్‌ఫోన్స్, చేతికి ఉంగరాలు, మెడలో పలుపుతాడులాంటి మందమైన బంగారపు చెయిన్లు... 'మోసపోవటానికి మేం రెడీ' అన్నట్లు జనం క్యూల్లో నిలబడి మరీ ఎగబడితే పాపం వాళ్ళు మాత్రం ఏంచేస్తారు? గత పది సంవత్సరాల్లో ఎన్ని బోగస్ సిన్మా సంస్థలు, ఫిల్మ్ ఇన్స్టిట్యూట్‌లు వచ్చాయి ఎన్ని ప్రకటనలిచ్చారు? ఎంతమంది వచ్చారు? ఎంతమందిని ఛీటింగ్ చేశారు. వీళ్ళలో ఎంతమంది సిన్మాలు తీశారు? ఎన్ని సిన్మాలు రిలీజ్ అయ్యాయి అన్న స్టాటిస్టిక్స్ తీస్తే నూటికి ఒక్కశాతం కూడా వుండరు. దీనివల్ల రాజకీయ నాయకులకేమీ నష్టం వుండదు కాబట్టి వాళ్ళు పట్టించుకోరు. పైపెచ్చు ఈ తరహా కార్యక్రమాలు చేసేవాళ్ళు సహజంగానే వాళ్ళ చెంచాలో, ఆశ్రితులో అయివుంటారు కాబట్టి వచ్చి రిబ్బన్ కటింగులు చేస్తారు. వీళ్ళు ఆ ఫొటోలను ఆఫీస్ రూమ్ ముందు గదిలో ప్రముఖంగా లామినేషన్ చేయించి మరీ పెట్టి బకరాలను ఆకర్షిస్తారు.

డైరెక్టర్ సిగరెట్ తాగుతూనే ఫోన్ ఎత్తి నెంబర్ డయల్ చేశాడు. అవతలనుంచి స్వరం విన్పించగానే ఒక్కసారిగా డైరెక్టర్ ప్రవర్తనలో మాటల్లో సినిమా తొంగిచూసింది. ఇందాకటి దర్పం, స్టయిల్ మచ్చుకైనా లేవు.

"సార్... నేన్సార్... రాజేంద్రని..."

"..............."

"అబ్బే... తమని మర్చిపోవటమా సార్... మహారాజ పోషకులు"

"..............."

"బ్రహ్మాండమైన ఫిగరొచ్చింది సార్... నాకే మతిపోయిందన్సార్..."

"..............."

"సాయంత్రం కుదరదు సార్... రేపొద్దున్న పదిన్నరకు..."

"..............."

"నిజమే సార్... తమరు ఎంత బిజీనో నాకు తెలీదా? కాకపోతే కొత్త పిట్టకదా భయపడుతోంది..."

"..............."

"మీరే చూస్తారుకదా సార్... నాలుగేళ్ళనుంచి చూస్తున్నాకదా సార్... ఎక్స్‌లెంట్ బ్యూటీ... ఐశ్వర్యరాయ్ రేంజ్‌లో వుంది..."

"..............."

"అమ్మతోడు సార్ అబద్ధాలు కాదు.... ఆ ప్రారంభోత్సవం మీ చేతులమీదుగా జరిగితే నాకదో తృప్తి...".

"..............."

"పాతికవేలు సార్... ఆ అమ్మాయి అందానికి అది చాలా తక్కువ..."

"..............."

అమ్మమ్మా... తమతో బేరాలాడగలనా సార్... మీరు తృప్తిపడ్డాక మీకు తోచినంతే ఇవ్వండి... తమరి సంగతి నాకు తెలీదా... ఇంకో ఐదు కలిపి విసిరేసే మహాదాతలు..."

"..............."

"దానిముఖం అదేం చేస్తుంది సార్... మనకు ఇదేం కొత్తా ఏంటీ? నోర్మూసుకుని పోతుంది. లేకపోతే కళ్ళు మూసుకుని సుఖపడుతుంది..."

"..............."

"అబ్బబ్బ... ఏం జోకేశారు సార్... హ్హిహ్హిహ్హి..."

"..............."

"రేపు పదిన్నరకల్లా రెడీగా వుండండి సార్... మాంచి ఎంజాయ్‌మెంట్... ఈ దీనుడిని మాత్రం కాస్త గుర్తుంచుకోండి సార్... ఏ కొత్త ఫిగర్ వచ్చినా తమరి చేతే కదా సార్ ప్రారంభోత్సవం చేయించేది... వుంటాన్సార్... దండాలు... నమ

స్కారం..."

బిజినెస్ డీల్ పూర్తయిన తర్వాత డైరెక్ట ర్‌గా చెప్పుకునే మాజీ ప్రొడక్షన్ మేనేజర్ రాజేంద్ర సిగరెట్ విసిరేసి బద్ధకంగా వళ్ళు విరుచుకున్నాడు. ఎరను మింగేముందు కొండచిలువ అలాగే వుంటుంది. ప్రస్తుతం రేపు రాబోయే పాతికవేలతో ఎలా 'మజా' చేయాలా అన్న ఆలోచనల్లో పడ్డాడు రాజేంద్ర.

★ ★ ★

స్వామీజీ బద్ధకంగా ఆవలించి సిగరెట్ వెలిగించాడు.

రాత్రి సింగిల్‌లైన్ ఆర్డర్ వేసేసరికి లేట య్యింది. నిద్ర సరిపోక కళ్లు మండుతు న్నాయి. ఛెయిర్‌లోంచి పైకి లేచి గదిలో అటు ఇటూ తిరిగాడు. ఆ తర్వాత ఫ్లాట్ తలుపులు తీశాడు.

మెట్లమీద శంకర్ కూర్చుని వున్నాడు. అతని చేతిలో కాగితాలున్నాయి.

అంత పొద్దుటే శంకర్ని చూసి స్వామీజీ ఆశ్చర్యపోయాడు.

"ఎంతసేపయ్యింది శంకర్ నీవు వచ్చి?"

శంకర్ మొహమాటంగా నవ్వాడు. "ఇప్పుడే సార్..." అన్నాడు మెట్లమీద నుంచి పైకిలేస్తూ. కానీ అతను చాలాసేప టినుంచీ వెయిట్ చేస్తున్నాడని అర్థమ య్యింది.

"అక్కడ కూర్చున్నావెందుకు? కాలింగ్ బెల్ వున్నది దేనికి?"

"మీరు నిద్రపోతూ వుంటారని డిస్టర్బ్ చేయలేదు సార్..."

"బానేవుంది నీ మొహమాటం... రా..." అంటూ లోపలకు దారితీశాడు. శంకర్ అనుసరించాడు.

సింగిల్‌బెడ్‌రూమ్ ఫ్లాట్ అది. ఫ్లాట్ అంతా పుస్తకాలు, కాగితాలు, ఫైల్స్ నేల మీద దొర్లుతున్నాయి.

"భయపడమాకు... నాకు కొంచెం శుభ్రం తక్కువలే... కూర్చో..." అన్నాడు స్వామీజీ కుర్చీ చూపిస్తూ.

"పర్లేదు సార్..."

"ఏంటీ పర్లేదు. నిల్చున్నంత మాత్రాన అది గౌరవం అయిపోదు. కూర్చున్నంత మాత్రాన నువ్వు నాతో సమానం అయి పోవు. ఇవన్నీ మూర్ఖులు ఫాలో అయ్యే విధానాలు. గౌరవం, భయం మనస్సులో, ప్రవర్తనలో వుండాలి... కూర్చో"

శంకర్ కూర్చున్నాడు.

"చెప్పు... ఏంటీ ఇంత పొద్దున్నే వచ్చావు?"

శంకర్ చేతిలో వున్న కాగితాలను స్వామీ జీకి అందించాడు.

"ఏంటివి?"

"మీరు ఏదైనా సీన్స్ రాయమన్నారు కదా సార్..."

స్వామీజీ తలమీద కొట్టుకున్నాడు. "మర్చేపోయాను. అసలే నాది ఆబ్సెంట్ మైండ్... సిన్మా ఫీల్డులోకి వచ్చాక టోట ల్‌గా మైండే పోయింది. అఫ్‌కోర్స్ సినిమా ఫీల్డులో రైటర్‌గా బతకాలంటే పెద్దగా మైండ్ అవసరం లేదనుకో..." అంటూ పేపర్లు అందుకున్నాడు.

స్వామీజీ దీక్షగా చదవటం ప్రారంభిం చాడు. శంకర్ ఆత్రుతగా స్వామీజీ వంకే చూస్తున్నాడు. రాత్రంతా మేలుకుని అతను రెండు సీన్లు రాశాడు. పదిసార్లు రాసింది నచ్చక చింపేసి మళ్ళీ మళ్ళీ రాశాడు. తను రాసిన సీన్స్ చాలా బాగా వున్నాయని అతని ఫీలింగ్. ఎందుకంటే చాలా కష్టపడి రాశాడు కాబట్టి. అందుకే టెన్షన్‌గా స్వామీజీ రియాక్షన్ కోసం చూస్తున్నాడు.

స్వామీజీ మొత్తం అంతా చదివేందుకు పదినిమిషాలు పట్టింది. చదివి తల ఎత్తి శంకర్ వంక చూశాడు.

"నువ్వేం చదువుకున్నావు శంకర్?"

అసందర్భమైన ఆ ప్రశ్న ఎందుకు అడి గాడో అర్థంకాలేదు. "డిగ్రీ సార్" అన్నాడు.

"పుస్తకాలు బాగా చదువుతావా?"
"చదువుతాను సార్..."
"అందుకే నీకు తెలిసిందంతా చెప్పేయాలని ప్రయత్నించావు..."
"ఇంతకీ నేను రాసిన సీన్స్ ఎలా వున్నాయి సార్..."
"సీన్స్ ఇలా వుంటే సిన్మా డబ్బాలు రెండోరోజుకే తిరిగి రావటం గ్యారంటీ..." తాపీగా అన్నాడు స్వామీజీ.
శంకర్ ముఖం వాడిపోయింది.
ఎంతో కష్టపడి రాసిన సీన్స్ చూసి స్వామీజీ మెచ్చుకుంటాడని ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. అటువంటిది స్వామీజీ తేలిగ్గా తీసిపారేయటం మనస్సు చివుక్కుమంది. అసలు తనలో టాలెంట్ లేదా? లేకపోతే సిన్మావాళ్ళు టాలెంట్‌నే గుర్తించరా?
శంకర్ రియాక్షన్స్‌ను స్వామీజీ జాగ్రత్తగా గమనిస్తూనే వున్నాడు.
"అలా అన్నానని ఫీలయ్యావా శంకర్?"
"లేదు సార్... సీన్స్ బాగా లేకపోతే మీరు మాత్రం ఏంచేస్తారు?" శంకర్ నిరాశగా అన్నాడు.
"సీన్స్ బాగా లేవని ఎవరన్నారు?"
శంకర్ విపరీతమైన ఆశ్చర్యంతో స్వామీజీ వంక చూశాడు.
"ఇప్పుడేగా సార్ బాలేదన్నారు..."
"నేను బాగా లేదన్నానా?"
"సీన్స్ ఇలా రాస్తే సిన్మా డబ్బాలు రెండో రోజే తిరిగిరావటం గ్యారంటీ అన్నారు..."
"అవును... అన్నాను. అంతేకానీ సీన్స్ బాగాలేదని అనలేదే నేను"
శంకర్ అర్థం కానట్లుగా స్వామీజీ వంక చూశాడు. తనకు కన్ఫ్యూజన్‌గా వుందా? ఆయన కన్ఫ్యూజ్డ్‌గా మాట్లాడుతున్నాడా?
స్వామీజీ మరో సిగరెట్ వెలిగిస్తూ నవ్వాడు.
"చూశావా... క్షణకాలంలో నీకు ఎన్ని సందేహాలు వచ్చాయో! సహజమే... కొత్తలో మహామహులకే ఇదంతా తప్పదు. ఇంతకీ నేను చెప్పిందేమిటో అర్థమైందా?"
"అర్థం కాలేదు సార్"
"నువ్వు రాసిన సీన్స్ అద్భుతంగా వున్నాయి"
సంతోషం మెరుపులా అతని ముఖంలో తళుక్కుమంది. ఈలోగా స్వామీజీ మిగతాది పూర్తి చేశాడు.
"కానీ ఇలాగే రాస్తే సిన్మా ఫేలయిపోతుంది"
అది వినగానే శంకర్ ముఖం మళ్లీ వాడిపోయింది. ఈయన మెచ్చుకుంటున్నాడా? తిడుతున్నాడా?
"చూడు శంకర్... ప్రతి ఒక్కడూ తనను గురించి తను ఎక్కువగా ఊహించేసుకుంటాడు. ఓ సిన్మా చూసి నేనయితే ఇంత కంటే బాగా డైరెక్ట్ చేయగలను అని, ఓ నవల లేదా కథ చదివి నేనయితే ఇంకా అద్భుతంగా రాసేవాడిననీ, ఓ నటుడి నటన చూసి నేనయితే యాక్షన్ చింపేసేవాడిని అనుకుంటారు. అందులో తప్పేమీ లేదు. అసలు క్రియేటివిటీ అనేది ఇతరులతో పోలికతోనే మొదలవుతుంది. అది చాలా సహజం. ఇక నీ విషయానికి వస్తే నీకు గొప్ప డైరెక్టర్ కావాలని వుంది. అవకాశం అంటూ వస్తే నీ టాలెంట్‌తో అద్భుతమైన సిన్మాలు తీయగలను అనుకుంటున్నావు. అందుకే నిన్న నేను ఏదైనా రెండు సీన్స్ రాసి తీసుకు రమ్మని చెప్పాను. నువ్వు చాలా కష్టపడి రాసి తెచ్చావు. బాగుంది. నువ్వు రచయితవుకాదు అయినా సీన్స్ ఎందుకు రాయమన్నానో తెలుసా! మంచి డైరెక్టర్ అనేవాడు స్వంతంగా తన స్క్రిప్ట్‌తో రాసుకోగలిగి వుండాలి. విజువలైజేషన్ వుండాలి. డిఫరెంట్‌గా ప్రెజెంట్ చేయగల కెపాసిటీ వుండాలి.
నువ్వేమిటన్నది నువ్వు రాసిన సీన్సే చెబుతున్నాయి. నీ వయసు కుర్రాడు రాశాడని చెబితే నమ్మటం కష్టం... ఆ భాష,

భావం, డైలాగ్స్ అన్నీ చాలాచాలా మెచ్యూర్డ్‌గా వున్నాయి. నువ్వు ఎంతగా లిటరేచర్ చదివావన్నది అర్థమైపోతుంది. నిజంగా నీ సీన్స్ చాలా బాగున్నాయి అద్భుతం.

ఇది ఓ రచయితగా నా ఫీలింగ్.

కానీ సిన్మా రచన అనేది పాండిత్య ప్రదర్శనకాదు. కమర్షియల్ ఫీట్. అక్షరాలతో చేసే గమ్మత్తయిన గారడీ. ఎంతబాగా ఆ గారడీ చేస్తే ఆ సిన్మా అంత బాగా ఆడుతుంది. నువ్వు రాసినట్లుగా రాస్తే ఆ సిన్మా సూపర్ ఫ్లాప్.

"సిన్మాలు చూసే ప్రేక్షకుల్లో ఎక్కువ శాతం సాధారణమైన ప్రజలు. వాళ్లు మేధావులుకాదు. వాళ్లకు సాహిత్యం గురించి అవసరంలేదు. వాళ్లను కడుపుబ్బేలా నవ్వించాలి. కర్చీఫ్‌లు తడిచేలా ఏడ్పించాలి. పిడికిళ్లు బిగించేంతగా రెచ్చగొట్టాలి. గిలిగింతలు పెట్టాలి. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రేక్షకుడిని నవరసాల్లో ముంచి తేల్చాలి. ప్రేక్షకుడు ఎప్పుడయితే సిన్మాలో తాదాత్మ్యతతో మునిగిపోతాడో ఆ సిన్మా సూపర్ హిట్టవుతుంది. రచయిత తన సంభాషణ, సన్నివేశాల ద్వారా ప్రేక్షకుడిని మైమరిపించాలి. ఇంకో ముఖ్య విషయం ఏమిటంటే సిన్మా అనేది ఉపన్యాసాలు ఇచ్చే వేదిక కాదు.

నీ అభిప్రాయాలు, ఫీలింగ్స్ జనం నెత్తిన రుద్దకూడదు. ఉదాహరణకు నీకు తాగుడంటే పరమ అసహ్యం. అంతమాత్రాన నీ సిన్మాలో ఓ పాత్ర తాగుబోతులందరినీ వరసబెట్టి నరకాలి అంటూ ఆవేశంగా డైలాగులు చెబుతూ తాగుడువల్ల సంభవిస్తున్న అనర్థాలు, కూలిపోతున్న కాపురాల గురించి ఆవేదన వ్యక్తం చేసిందనుకో జనం ఆ సిన్మా చూడరు. ముఖ్యంగా మందు అలవాటువున్న ప్రేక్షకులంతా నీ సిన్మాలు చూడటం మానేస్తారు.

ఏ విషయాన్నీ జనరలైజ్ చేసి చెప్పకూడదు. కట్నం తీసుకునే అత్తామామల్ని కోడళ్లు కిరోసిన్ పెట్టి తగలెట్టాలీ అని రాశావు. అది నీ ఆవేశాన్ని సూచిస్తుంది. ఓ సామాజిక దురన్యాయం పట్ల నీకున్న ఆవేదననీ, ఆక్రోశాన్నీ వెల్లడిచేస్తుంది. కానీ సమాజంలోని అత్తామామలైన ప్రేక్షకులందరినీ నువ్వు కోల్పోతున్నావు. ఇక నీ సిన్మా ఎవరు చూస్తారు? ఈ సమాజంలో వివిధ వర్గాలుంటాయి. అలాగే సిన్మాకు వివిధ ప్రేక్షకులుంటారు. యూత్, మహిళలు, చిల్డ్రన్, ఫ్యామిలీలు. ఫ్యామిలీ సిన్మాలు అందరూ చూస్తారుకానీ అదే యూత్ బేస్డ్ సిన్మాలు కేవలం యూత్ కాలేజీ స్టూడెంట్స్‌కు మాత్రమే పరిమితమవుతాయి. నువ్వు ఏ వర్గం ప్రేక్షకులను దృష్టిలో పెట్టుకుని సిన్మా తీస్తున్నావో ముందుగా నీకు తెలియాలి.

తాగుబోతు వెధవల్లారా! అన్న డైలాగ్ రాశావంటే థియేటర్‌లోని సగంమంది ప్రేక్షకులు ఉలిక్కిపడతారు. ఎవరికి వాళ్లు తన గురించే తిడుతున్నావనుకుంటారు. సిన్మా చూడటం మానేస్తారు. ఆవేశాన్నీ సిద్ధాంతాలనూ ఫీలింగ్స్‌నీ అదుపులో పెట్టుకోవటం ఒక ఎత్తు. అదేవిధంగా నీ పరిజ్ఞానం అంతా ప్రదర్శించకుండా నిగ్రహించుకోవటం... నీకు అంతరిక్షం నుంచీ ఆవకాయ పచ్చడిదాకా ప్రతి టాపిక్కుమీదా బోలెడంత నాలెడ్జ్ వుండచ్చు. నువ్వు గొప్ప మేధావి కావచ్చు. అపరిమితమైన జ్ఞానం వుండచ్చు. ప్రపంచ సాహిత్యాన్ని అంతా చదివేసి వుండచ్చు. కానీ దీనంతటితో సగటు ప్రేక్షకుడికి ఏమాత్రం సంబంధంలేదు.

అసలు ప్రేక్షకుడనే వాడికి ఏమాత్రం మొహమాటం వుండదు. పదవ తరగతి తప్పినవాడు సంభాషణలు రాశాడా! మహా పండితుడు రాశాడా! అని చూడడు. వాడికి కావాల్సింది ఎంటర్‌టైన్‌మెంట్. మూడు గంటలపాటు వాడు తన జీవిత కష్టాలను మర్చిపోయేంతగా ఎవరైతే ఎంటర్‌టైన్ చేస్తారో వాళ్ల సిన్మాలే సూపర్‌హిట్




చేస్తాడు. వాడికి నచ్చకపోతే నువ్వు సిన్మా ఎంత అద్భుతంగా తీసినా ప్రయోజనం లేదు.

ఎన్నికల్లో ఓడిపోతే రాజకీయ నాయకుడి ముఖం ఎవ్వరూ ఎలా చూడరో సిన్మా ఫ్లాప్ అయితే ఏ ఒక్కడూ నిన్ను పట్టించుకోడు. వీలయితే ఇంకొంచెం పాతాళంలోకి తొక్కాలని చూస్తారు.

లవ్ అండ్ వార్ హేజ్ నో రూల్స్ అంటారు. అంటే ప్రేమలో, యుద్ధంలో రూల్స్ వుండవు. ఏం చేసినా గెలవటమే కరెక్ట్. అదేవిధంగా సిన్మా హేజ్ నో రూల్స్ సిన్మా సక్సెస్ కావటమే ప్రధానం. ప్రతి శుక్రవారం ఇక్కడ మహామహుల జాతకాలు మారిపోతూ వుంటాయి. ఎవడి సిన్మా హిట్టయితే వాడే మేధావి. వాడే ప్రముఖుడు. అందరూ వాడి వెనకే పడతారు. ఫ్లాఫ్ అయిందా అంతే సంగతులు. తీసి చెత్తబుట్టలో పడేస్తారు. అంతేకానీ గతంలో ఇతగాడే సూపర్ డూపర్ హిట్ లిచ్చాడని ఎవ్వరూ చెప్పుకోరు. మరో శుక్రవారం కోసం సిన్మా జగన్నాధ రథచక్రాలు ఆ నిర్భాగ్యుడి దేహంమీద నుంచి వెళ్లిపోతాయి.

సక్సెస్... సక్సెస్... సక్సెస్...

ఇదే సిన్మా తారకమంత్రం. అందుకే ఆ సక్సెస్ కోసం అందరూ పరితపించిపోతారు. సిన్మాఫీల్డులో నీకు కోట్లు వున్నాయా, కోటలు వున్నాయా అని ఎవ్వడూ చూడడు. నీ లేటెస్ట్ హిట్ ఏమిటని చూస్తారు.

నీ లేటెస్ట్ సక్సెసే గౌరవం, కీర్తి, ప్రతిష్ఠ. అది లేకపోతే యువార్ ఫినిష్డ్.

ఒక్కసారి నీమీద ప్రేక్షకులు, సిన్మా ఇండస్ట్రీ ఓ అంచనా ఏర్పరచుకున్నాక దాంట్లోంచి బైటపడటం అంత సులువుకాదు "అబ్బో! ఇతగాడు అన్నీ ఎర్ర సిన్మాలే తీస్తాడు" అన్న ముద్ర పడిందంటే నువ్వు బ్రహ్మాండమైన లవ్‌స్టోరీ తీసినా జనం చూడకపోవచ్చు. అందుకే ఇమేజ్ లేకపోవటం ఎంత ప్రమాదమో ఓ ఇమేజ్ పడిపోవటం కూడా అంతే ప్రమాదం.

సిన్మా అనేది రంగుల ప్రపంచం. ఆ రంగుల ప్రపంచాన్ని సృష్టించేందుకు నిర్మాత, దర్శకుడు, నటీనటులు, టెక్నీషియన్స్ ఎంతో కష్టపడతారు. అసలు ఓ సిన్మా ఎందుకు హిట్టవుతుందో, ఎందుకు ఫట్ మంటుందో ఎవ్వడూ అంచనా వేయలేడు.

బాక్సాఫీస్ హిట్ ఫార్ములా అనేది ఎవ్వరికీ అర్థంకాని నిగూఢ మర్మం. నా సిన్మా గ్యారంటీ హిట్ అని ఏ మగాడూ చెప్పలేడు. ఒకవేళ పైకి జనంకోసం చెప్పినా లోపల్లోపల మాత్రం వణికిపోతూ వుంటాడు. పెద్ద పెద్ద సిన్మా ప్రముఖులు కూడా రిలీజ్ డేట్ రోజున దారుణమైన టెన్షన్ అనుభవిస్తారు. అది మొదట సిన్మా అయినా వందో సిన్మా అయినా ఆ టెన్షన్ తప్పదు. అసలు ఓ సిన్మా ఎందుకు హిట్టయ్యింది ఎందుకు ఫట్టయ్యింది అన్న విషయం రిలీజ్ ముందు అంచనా వేయలేకపోయినా సిన్మా రిలీజ్ అయిన తర్వాత విశ్లేషించి తీరాలి.

ఆ విశ్లేషణ కోణంగానే ప్రేక్షకులకు ఏ సిన్మాలు నచ్చుతున్నదీ ఎందుకు నచ్చుతున్నదీ అర్థం అవుతుంది. బాగా గమనిస్తే సక్సెస్‌ఫుల్ సిన్మాలకు ఫెయిల్యూర్ సిన్మాలకు కొన్ని కామన్ పాయింట్స్ వుంటాయి.

వేగంగా మారిపోతున్న ట్రెండ్స్, ప్రేక్షకుల అభిరుచిని ఎవడయితే నిరంతరం ఫాలో అవుతూ వుంటాడో అతను సూపర్ హిట్స్ తీయకపోయినా మిజరబుల్ ఫ్లాప్స్ మాత్రం తీయడు... మొదట్లో కేవలం క్రేజ్‌తోనే ఎవరయినా సిన్మాఫీల్డులోకి ప్రవేశిస్తారు.

కాలం గడిచేకొద్దీ ఆ క్రేజ్ కరిగిపోతుంది. టాలెంట్, హార్డ్‌వర్క్, కమిట్‌మెంట్‌తోనే ఎవరయినా సక్సెస్ అవుతారు.

కాకాపట్టేవాళ్లూ, భజంత్రీపరులూ కూడా ఇండస్ట్రీలో వుంటారు. కేవలం వుంటూ వుంటారంతే. ఎప్పటికీ ఆ టైపు వ్యక్తులు చరిత్ర సృష్టించలేరు.

టాలెంట్, ఆత్మవిశ్వాసం ఎంత ముఖ్యమో లౌక్యం కూడా చాలా అవసరం. టాలెంట్ వున్నా లౌక్యంలేక దెబ్బతిన్న వాళ్లున్నారు. తక్కువ మాట్లాడుతూ ఎక్కువ గమనిస్తూ మరింత ఎక్కువగా కష్టపడాలి.

సిన్మాఫీల్డు ఓ జూ లాంటిది... ఇక్కడ సింహాలూ, పులులూ, నక్కలూ, తోడేళ్లూ, కట్ల పాములూ, కొండచిలువలా వుంటాయి. అదేవిధంగా లేళ్లు, కుందేళ్ల వంటి సాధు జంతువులూ వుంటాయి. గోముఖ వ్యాఘ్రాలుంటాయి. తేనెపూసిన కత్తులుంటాయి. నీ కర్చీఫ్ తీసుకుని నీ మంచినీళ్ల గ్లాసులో దాన్ని ముంచి,/కూల్‌గా, తాపీగా ఏమాత్రం ఒక్క శాతం జాలీ, ఫీలింగ్‌లేకుండా నీ గొంతు కోసేస్తారు.

సిన్మాఫీల్డులో నేను పండిపోయాననుకునే వాడు మూర్ఖుడు. పదేళ్లనుంచీ వుంటున్నా నాకే టెన్ పర్సెంట్ కూడా తెలీదు. ఇదో విచిత్రమైన మాయాలోకం. స్వర్గం, నరకం, ఉద్యానవనం, జంతుప్రదర్శనశాల, యూనివర్సిటీ, సర్కస్, లైబ్రరీ, వ్యభిచారపు కొంప, వేదపాఠశాల, జిమ్, నాట్యశాల, పిచ్చాసుపత్రి, కూరగాయల మార్కెట్, ఫూల్స్ పారడైజ్ ఇంకా చాలాచాలా...

నీకు ఏం కావాలో నువ్వు అది తీసుకోవచ్చు. ఎత్తైన శిఖరాలు ఎలా వుంటాయో లోతైన అఘాతాలూ వుంటాయి.

నువ్వు కనుక నీ లక్ష్యాన్ని మర్చిపోనంత కాలం తింటున్నా, తాగుతున్నా, పడుకున్నా, నడుస్తున్నా అనుక్షణం నీ గమ్యాన్ని విస్మరించనంతకాలం కృషి, పట్టుదల, దీక్ష అనే కవచాలను ధరించి ఆత్మవిశ్వాసం అనే కరవాలం పట్టుకుని సక్సెస్ అనే యుద్ధం నిరంతరం చేస్తున్నంతకాలం, ఈ ప్రపంచంలో ఏ శక్తీ నిన్ను ఆపలేదు శంకర్... అర్థమయ్యిందా?" స్వామీజీ భావోద్వేగంతో చెప్పటం ముగించాడు. శంకర్ స్థబ్దుడై వింటుండిపోయాడు.

అతనికి ఏదో తెలీని భయం వేసింది. పిల్లకాలువలే అని దూకేసిన తర్వాత అదో మహా సముద్రమని తెలిస్తే ఎంత దిగ్భ్రాంతి కలుగుతుందో అంతటి దిగ్భ్రాంతి కలిగింది.

"భయపడకు శంకర్! ఇదంతా నిన్ను భయపెట్టేందుకు చెప్పలేదు. నాకు నేనే స్వగతంలా చెప్పుకున్నాను. పట్టుదలవుంటే ఏదీ అసాధ్యంకాదు. ఇక్కడ మహామహులు గర్వంతో విర్రవీగి నాశనం అయిపోయారు. సామాన్యులు కూడా వినయవిధేయతలతో కష్టాన్ని నమ్ముకుని పైకి వచ్చారు. నాకు నీలో తపన కనబడుతోంది. కేవలం తపన వుంటే చాలదు. చాలాచాలాకావాలి. అవి ఏమిటన్నది నీకు పోనుపోనూ తెలుస్తుంది" అంటూ చెయిర్ లోంచి పైకిలేచి కప్‌బోర్డు దగ్గరకు వెళ్లి ఓ పుస్తకం తీశాడు.

"ఇది సిన్మా చరిత్రకు సంబంధించిన పుస్తకం. వాస్తవానికి ఇదంతా అవసరం లేదుకానీ తెలుసుకుంటే నష్టం ఏమీలేదు. మూకీల నుంచి టాకీలదాకా బ్లాక్ అండ్ వైట్, గేవాకలర్ నుంచి ఈస్ట్‌మన్‌కలర్ దాకా, థర్టీఫైవ్ ఎమ్ఎమ్ నుంచీ సెవెన్టీ ఎమ్ఎమ్‌దాకా సిన్మా పరిణామక్రమం ఇందులో వుంది. శ్రద్ధగా చదువు. ఎంతో మంది మహనీయుల కఠోరకృషీ, అవిరళ శ్రమే నేటిసిన్మా. చార్లీచాప్లిన్, హిచ్‌కాక్, దాదాసాహెబ్‌ఫాల్కే, రఘుపతి వెంకయ్య, ఎల్‌వీప్రసాద్, పృధ్వీరాజ్‌కపూర్, రాజ్‌కపూర్... ఇలా చెప్పుకుంటూపోతే సిన్మా కోసం తమ జీవితాలనే ఫణంగా పెట్టిన మహనీయులు ఎందరో! ఎందరెందరో! నువ్వు సిన్మాలు బాగా చూస్తావా?"

"ఫర్లేదు సార్"

"ఫర్లేదు కాదు బాగా చూడాలి. క్లాసిక్స్




చూడాలి. ఏమాత్రం టెక్నిక్, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లేని కాలంలో వాళ్లు ఎంతగా శ్రమించి అద్భుతమైన క్లాసిక్స్ తీశారో తల్చుకుంటేనే వళ్లు జలదరిస్తుంది. అదో యజ్ఞం శంకర్. అందుకే ఇన్ని సంవత్సరాలు జనరేషన్స్ గడిచినా ఆ సిన్మాలు నిలిచిపోయివు న్నాయి. కేవలం సిన్మాలు చూడటం కాదు. అది అందరూ చేసే పనే. క్రియేటివ్ ఐ|తో చూడాలి: సబ్జెక్ట్ ఏమిటీ? డైరెక్టర్ ఎలా డీల్ చేశాడు? రైటర్ ఎటువంటి సంభాష ణలు రాశాడు? నటీనటులు ఎలా అభిన యించారు? కొందరే చరిత్రలో నిలిచిపో యేంత మహానటులు ఎలా అయ్యారు? ఇదంతా విశ్లేషించాలి. ఏ అంశం ప్రేక్షకుల్ని కదిలిస్తుంది. ఏది బోర్ కొడుతుంది? ఏది నవ్విస్తుంది? ఏది ఏడిపిస్తుంది? మేధా వులు తీసిన సిన్మాలుకూడా ఘోరంగా ఎందుకు ఫ్లాప్ అయ్యాయి?

వరల్డ్ సిన్మానుంచి మలయాళ సిన్మాల వరకూ నీకో అవగాహన వుండాలి.

మొట్టమొదట మూకీ సిన్మా ఏమిటో తెలీ కుండా డైరెక్టర్లు అయినవాళ్లున్నారు. కానీ యుద్ధానికి వెళ్లేముందు సర్వసన్నద్ధంగా వెళ్లటం మంచిదికదా! ఇంకో ముఖ్య విషయం ఇక్కడ ఏమున్నా లేకపోయినా దరిద్రమైన అలవాట్లు ఏర్పడతాయి. నీకు మందు, సిగరెట్‌లాంటి అలవాట్లు లేవు కదా? "

"లేవు సార్"

"వెరీ గుడ్... సగం పీడ తప్పినట్లే. ఎంతో టాలెంట్ వున్నవాళ్లు కూడా వ్యస నాల కబంధ హస్తాల్లో ఇరుక్కుని సర్వనా శనం అయిపోయారు. ఈ ఫీల్డులో భయం కరమైన టెన్షన్ వత్తిడీ వుంటుంది. ఇరవై నాలుగు గంటలూ నిర్విరామంగా పని చేయాల్సిన పరిస్థితులు వస్తాయి. అందు కోసం డిసిప్లిన్ కావాలి. ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోవాలి. ఒక్కోసారి నెలల తరబడీ గోళ్లు గిల్లుకోవాలి లేకపోతే ఊపిరి తీసుకోలేనంత పని వుంటుంది. అన్నింటికీ సిద్ధంగా వుండాలి. ఛాన్స్ దొరికింది కదాని ఉపన్యాసం దంచుతున్నానా? "

"లేదు సార్"

"మంచిది ఈ రోజునుంచీ నీకు వచ్చిన ఐడియాస్ నోట్ చేసుకో. నువ్వు చూసిన సిన్మాలోని సీన్స్ నువ్వయితే ఎలా తీస్తావో ఎలా రాస్తావో రాసుకో. రోజుకు కనీసం రెండు సీన్స్ అయినా ప్రాక్టీస్ చేయి. వీల యినంత తరచుగా మనం కలుద్దాం. చర్చిం చుకుందాం. ఇందులో ఇగోలకు స్థానం లేదు. నిరంతరం నేర్చుకుంటూ విద్యార్థుల్లా ముందుకు సాగుదాం. ఎప్పటికయినా నువ్వు అద్భుతమైన సిన్మాలు తీసేంతటి గొప్ప డైరెక్టర్ అవుతావని నాకు నమ్మకం వుంది. ఆల్ ది బెస్ట్"

"థాంక్యూ సర్! మీ నమ్మకాన్ని నిలబెట్టేం దుకు కృషి చేస్తాను" అన్నాడు శంకర్ ఎమోషనల్‌గా కదిలిపోతూ.

యుద్ధం మొదలయ్యింది.



రంచనుగా చెప్పిన టైంకి వచ్చింది దివ్య. రాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు. తెల్లవా రుఝామున కాస్త నిద్రపట్టినా కూడా అందులో నిండా తను హీరోయిన్

అయిపోయినట్లుగా వచ్చిన కలలే. ఉదయాన్నే లేవగానే తను హీరోయిన్‌గా సెలక్ట్ అయిన విషయం ఇంట్లో చెప్పేద్దామా అనుకుంది. మళ్లీ భయమేసింది. ఇంట్లో ఒప్పుకోకపోతే? గదిలో పెట్టి తాళం వేస్తే? బంగారంలాంటి ఛాన్స్ మిస్సయిపోతుంది. ఎటుతిరిగీ హీరోయిన్ అయిపోయిన తర్వాత ఇంట్లో తెలిస్తే సంతోషిస్తారు. అదే ముందే అయితే తాట వలుస్తారు.

శ్రద్ధగా అలంకరించుకుంటున్న దివ్యను చూసి తల్లి అడిగింది. "ఎక్కడికే బయలుదేరావు? "

"సుబ్బలక్ష్మి లేదూ దానికీ రోజు పెళ్లిచూపులు"

"అయితే? "

"కాస్త తోడుగా వుండటానికి ఆంటీ రమ్మంది"

"ఏం పెళ్లి చూపులో! మీ నాన్నకు బాధ్యతేలేదు. ఇంట్లో పెళ్లీడుకొచ్చిన కూతురుందన్న ధ్యాసేలేదు. ఇప్పట్నుంచీ చూస్తే రెండేళ్లకి కుదిరినా కుదిరినట్లే" దివ్య తల్లి గొణుక్కుంది.

"అక్కకేం తక్కువమ్మా? బంగారు బొమ్మ. పెళ్లి చూపులకెళుతుందిగా పెళ్లికొడుకు అక్కనే చేసుకుంటాననంటాడేమో!" ముదురు మాటలు నేర్చిన పదమూడేళ్ల తమ్ముడు అన్నాడు.

"తప్పు అలా అనకూడదు" తల్లి మందలించింది కానీ మనసులో ఎక్కడో ఆమెకు కూడా ఏదో ఆశ వుంది. తమ కూతురు సౌందర్యరాశి. కట్నాలు ఇచ్చి తాము పెళ్లి చేయలేరు. దీని అందం చూసే ఏ పెళ్లికొడుకయినా చేసుకుంటాడు అన్నది ఆవిడ నమ్మకం.

"ఛీ పోరా" అంటూ తమ్ముడిని కసిరింది కానీ ఆమె మనసు ఆకాశంలో తేలిపోతోంది. "నేను సిన్మా హీరోయిన్ అయిపోయానహో" అంటూ ఊరంతా చాటాలని వుంది.

సరిగ్గా పదింటికి ఆఫీసుకి చేరుకుంది.

"వచ్చావా... వెరీగుడ్... ఇప్పుడే నీ గురించి అనుకుంటున్నాను. బయలుదేరదామా? " అన్నాడు డైరెక్టర్ దివ్యవంక పరీక్షగా చూస్తూ.

ఆ చూపుల వరస ఆమెకు నచ్చలేదు. అయినా తలాడించింది.

ఆటోలో ఇద్దరూ బయలుదేరారు. దివ్య మనస్సంతా చాలా టెన్షన్‌గా వుంది. ఏం ప్రశ్నలడుగుతారో ఏమిటో? ఏమైనా డైలాగులిచ్చి చెప్పమంటే తను చెప్పగలుగుతుందా? డాన్స్ చేయమంటారేమో! తను నచ్చుతుందో నచ్చదో?

నేను హీరోయిన్ అయిపోతే నీకు నూటపదహారు కొబ్బరికాయలు కొడతానని దేముడికి మొక్కుకుంది.

సకల చరాచర సృష్టినీ, ప్రకృతినీ, సృష్టించిన దేముడు ఆఫ్టాల్ నూటపదహారు కొబ్బరికాయల లంచానికి టెంప్ట్ కాడన్న విషయం చాలామంది మేధావులైన భక్తులకు తెలీదు. వాళ్ల స్థాయిలో వాళ్లు ఆలోచిస్తారు. దివ్య కూడా అదే స్థాయి కాబట్టి ఆ విధంగా కోరుకుంది.

ఆటోలో తన పక్కన కూర్చుని నీ కన్న తండ్రిలాంటి వాడినమ్మా అన్న డైలాగ్ చెప్పిన వ్యక్తి కట్లపాముకంటే ప్రమాదకరమైన వ్యక్తి అనీ పాతిక వేల రూపాయలకు తనను తార్చేందుకు తీసుకువెళుతున్నాడనీ తెలీని దివ్య రంగురంగుల ఊహాలోకంలో మునిగివుంది.

ఇరవై నిమిషాల ప్రయాణం తర్వాత ఆటో ఓ అధునాతన భవంతి ముందు ఆగింది. డైరెక్టర్ ఆటో ఫేర్ చెల్లించాక ఇద్దరూ లోపలకు నడిచారు. గేటు దగ్గరున్న గూర్ఖా డైరెక్టర్‌ని చూసి వంకరగా నవ్వాడు.

దివ్య మాత్రం కన్ను రెప్పవేయకుండా ఆ భవంతినే చూస్తూ వుండిపోయింది.

తను హీరోయిన్ అయిపోయిన తర్వాత ఇలాంటి ఇల్లే కట్టించుకోవాలి. వీళ్ల అమ్ము తానంటే ఇదే కొనుక్కుంటే సరి. మళ్లీ కట్టించే శ్రమ తప్పుతుంది. ఎంత బాగుందీ ఇల్లు?

లోపల ఫర్నిచర్, డెకొరేషన్ చూసిన తర్వాత దివ్యకు మతిపోయినంత పన య్యింది. ఇవన్నీ తనెప్పుడు కొనుక్కోగలుగు తుంది? ఒళ్లంతా నగలు పెట్టుకుని ఫారిన్ కారులో తిరుగుతూ ఇటువంటి ఇంట్లో నౌక ర్లతో...

"అమ్మా! దివ్యభారతీ"

దివ్య ఆలోచనలు తెగిపోయాయి "ఏంటి సార్? " అంది డైరెక్టర్‌గా పరిచయం చేసు కున్న రాజేంద్ర వంక చూస్తూ.

"నీకు ఇప్పుడు పరిచయం చేయబోయే ఆయన కోటీశ్వరుడు. ఇది ఆయన గెస్ట్ హౌస్. దీన్ని చూస్తుంటేనే తెలియటంలా ఆయన ఎంత ధనవంతుడో! ఆయన తల్చు కుంటే వంద సిన్మాలు తీయగలడు. నిన్నే ఆ వంద సిన్మాల్లోనూ హీరోయిన్‌గా బుక్ చేయ గలడు. ఆయనకు కోపం వస్తే ఇండస్ట్రీలో నీకు పుట్టగతులుండవు. నీకు చిన్న వేషం కూడా ఎవ్వరూ ఇవ్వరు. ఆయన తల్చుకుంటే ఏమైనా చేయగలడు. నీ జీవితరేఖే మారిపో తుంది. నువ్వో పెద్ద సిన్మా హీరోయిన్ అయి పోతావు. ప్రపంచం అంతా నీ చుట్టూ తిరు గుతుంది. ఇదంతా నీ చేతుల్లోనే వుంది. ఆయన సంతోషపడేలా నడుచుకో. నోట్ల వర్షం కురుస్తుంది అర్థమైందా? "

ఆ అమ్మాయికి ఏమీ అర్థం కాలేదు. అయినా తలాడించింది. రాజేంద్ర చెప్పిన అర్థం వేరు. ఆమెకు అర్థమయ్యిందేమిటంటే లోపలవున్న పెద్ద మనిషి దగ్గర వినయవి ధేయతలతో ప్రవర్తించాలి. కానీ రాజేంద్ర చెప్పిన సెన్స్ అది కాదని ఆమెకు తెలీదు. ఎందుకంటే ఆమె ప్రొఫెషనల్ కాదు. సిన్మా హీరోయిన్ అయిపోవాలని కలలుకంటున్న పద్దెనిమిదేళ్ల సగటు అమ్మాయి.

రాజేంద్ర ఆ అమ్మాయిని తీసుకుని మేడ పైన వున్న విశాలమైన బెడ్‌రూమ్‌లోకి ప్రవే శించాడు.

కింగ్‌సైజ్ బెడ్‌మీద బాసింపట్టు వేసు కుని కూర్చుని పక్కనే టీపాయ్‌మీద బాటిల్ తదితర సరంజామా పెట్టుకుని తాగుతున్నాడో వ్యక్తి. దుక్కలాగా, నల్లగా వున్నాడు. లాల్చీపైజామా వేసుకున్నాడు. పదివేళ్లకు పన్నెండు బంగారు ఉంగరాలు, మెడలో చెయిన్స్‌తో రిచ్‌గా వున్నాడు. ముఖంలో మాత్రం శాడిజంతో కూడిన క్రూరత్వం. యాభై నుంచి అరవై మధ్య వుంటుంది వయస్సు. వీళ్లు ప్రవేశించటం చూసి,

"ఏమిటంత లేట్? " అన్నాడు విసుగ్గా.

రాజేంద్ర దాదాపుగా సాష్టాంగ నమ స్కారం చేశాడు. "ఆటోలు దొరకలేదు సార్" అన్నాడు వినయంగా.

"సర్లే ఇదేనా నువ్వు చెప్పిన ఫిగర్" అన్నాడు దివ్యవంక నఖశిఖపర్యంతం పరీ క్షగా చూస్తూ.

ఆమెకు అతడి వాలకం, చూపులు చూస్తుంటే వంటిమీద గొంగళిపురుగులు పాకినట్లుగా వుంది. కానీ డైరెక్టర్ చెప్పిన మాటలు గుర్తుకు వచ్చి నిగ్రహించుకుని "నమస్కారం సార్" అంది రెండు చేతులూ జోడించి.

"ఏంటి నీ పేరు? " దరిద్రమైన కంఠస్వ రంతో అడిగి గ్లాసెత్తి రెండు గుటకలు వేశాడు.

"దివ్య సార్"

"దివ్య భారతిలాగా ఫీలయిపోతు న్నావా? " అని తన జోక్‌కి తానే రూమ్ దద్దరిల్లేలా నవ్వాడు. "రా ఇక్కడ కుర్చో" అంటూ తన పక్కన మంచంమీద అరచేత్తో చరిచి చూపించాడు.

దివ్య భయంగా రాజేంద్రవైపు చూసింది.

రాజేంద్ర వెళ్లమన్నట్లుగా కంటితోనే సైగ చేశాడు. కానీ ఆ అమ్మాయికి అర్జంటుగా ఆ

గదిలోంచి బైటకు పారిపోవాలన్పించింది. గుండెలు భయంతో వేగంగా కొట్టుకోసా గాయి. ఆ వాతావరణం, ఆ మనిషి వాలకం ఏమాత్రం నచ్చలేదు.

మౌనంగా వెళ్లి మంచం చివర్న కూర్చుంది.

"అక్కడ కాదు దగ్గరకురా"

ఆ అమ్మాయి భయం మరింతగా పెరిగి ముడుచుకుపోయి కూర్చుంది.

"మనుషుల్ని చూస్తే వణికిపోతోంది ఇంకేం హీరోయిన్ అవుతుంది డైరెక్టరూ? " మరోసారి ఆ శాల్తీ భారీ ఎత్తున నవ్వింది.

"కొత్త కదా సార్"

"సర్లే నువ్వెళ్లి కింద జిలానీగాడున్నాడు స్వీట్ పాకెట్ తీసుకో. ఈ లోపల నేను మీ హీరోయిన్ పనికొస్తుందో లేదో టోట ల్‌గా పరీక్షిస్తాను" వంకరగా నవ్వుతూ అన్నాడు.

స్వీట్‌పాకెట్ అన్న పదం వినబడగానే రాజేంద్ర ముఖం వికసించింది. అది వాళ్ల కోడ్. వచ్చినప్పటినుంచీ చేతిలో డబ్బులె ప్పుడు పడతాయా అన్న ఆత్రంలో వున్నాడు.

"నేను ఇప్పుడే వచ్చేస్తా" అంటూ గబగబా రాజేంద్ర బెడ్‌రూమ్‌లో నుంచి బైటకు నడి చాడు. వెళ్లేటపుడు తలుపులాగడంతో డోర్ ఆటోమేటిక్ లాక్ పడిపోయింది.

భయంభయంగా చూస్తున్న దివ్యవైపు చూసి ఆ శాల్తీ విచిత్రమైన నవ్వొకటి నవ్వేడు. పైకి లేచి బద్ధకంగా వళ్లు విరుచు కుని దివ్యవైపు అడుగులువేశాడు.

ఆ తర్వాత చెప్పటానికేమీలేదు.

దివ్య ఏమైపోయిందన్న సందేహం రావచ్చు

ఏమౌతుంది? హైటెక్ కాలంలో ఆడ దాని శీలానికి ఎంత విలువుందనీ? దివ్య ఏమైవుంటుందీ? ఆత్మహత్య చేసుకోవచ్చు లేదా హత్య చేసుండచ్చు లేదా రెడ్‌లైట్ ఏరియాలో తేలివుండచ్చు లేదా సిన్మాల్లో ఎక్స్‌ట్రా ఆర్టిస్ట్‌గా మారిపోయివుండచ్చు. లేదా జరిగింది మర్చిపోయి గుట్టుగా పెళ్లి చేసుకుని మొగుడితో కాపురం చేసుకుంటూ వుండచ్చు లేదా తొండముదిరి ఊసరవెల్లి అయినట్లుగా తనే మరో నలుగురు అమ్మా యిల్ని పెట్టుకుని ఫ్లెష్‌ట్రేడ్ ప్రారంభించి వుండచ్చు.

ఏదైనా జరగచ్చు. దివ్య తర్వాత సునీత, తర్వాత ఝాన్సీ... నిరంతరం ఇది సాగిపో తూనే వుంటుంది. టీనేజ్ అమ్మాయిల్లో సిన్మా వ్యామోహం వున్నంతకాలం ఇదంతా నిరంతరం సాగుపోతూనే వుంటుంది.

★ ★ ★

సాహచర్యం... దుష్టులతో సాహచర్యం పాతాళంలోకి లాగేస్తే సన్మార్గులతో సాహ చర్యం అంతర్గత శక్తుల్ని బైటకు తీస్తుంది. మంచి సాహచర్యం దొరక్కపోతే ఏకాం తంగా వుండిపోవటం మంచిది. అంతేకానీ కాలక్షేపపు స్నేహాలూ, ఉబుసుపోక కబుర్లూ మనిషిని నిర్వీర్యం చేస్తాయి. స్వామీజీతో స్నేహం, శంకర్ జీవితంలో మార్పును తీసుకు వచ్చింది.

తన లక్ష్యం సాధించాలంటే ఎంత కష్టప డాలో అర్థమైంది. అవమానాలకు క్రుంగిపో కుండా నిరంతర ప్రయత్నం చేస్తూ ముందుకు దూసుకుపోవాలని తెల్సి వచ్చింది.

సీన్స్ రాయటం మొదలుపెట్టాడు. మొదట్లో అదంత తేలిగ్గా సాధ్యంకాలేదు. ముఖ్యంగా స్వామీజీ చెప్పినట్లుగా సామా న్యులకు కూడా అర్థమయ్యేలా రాయటం నిజంగా కత్తిమీద సాములాంటిది. కానీ రానురాను టెక్నిక్ అలవడింది.

అభ్యాసం కూసువిద్య అన్నారందుకే పెద్దలు. నిరంతరం సాధన చేస్తూ వుంటే దేన్నయినా సాధించవచ్చు. పుట్టుకతోనే ఎవ్వరూ ఏదీ నేర్చుకుని రాలేదుకదా! ఆ విధంగా శంకర్ సాధన మొదలయ్యింది. రాసిన సీన్స్ స్వామీజీ కరెక్ట్ చేస్తూ వుండే




వాడు. లోపాలువుంటే చెప్పేవాడు. మంచి డైలాగో, సీనో రాస్తే మెచ్చుకుని ప్రోత్సహిం చేవాడు.

సిన్మాకు సంబంధించి స్వామీజీ ఇచ్చే పుస్తకాలు చదవటం, పాయింట్స్ నోట్ చేసుకోవటం, సీన్స్ రాసుకోవటం ఇలా కాలం గడుస్తూ వుండేది. రెండు నెలల తర్వాత ఓ రోజు స్వామీజీ కవరొకటి శంకర్‌కు ఇచ్చాడు.

"ఏమిటి సార్ ఇది? "

"తెరిచి చూడు నీకే తెలుస్తుంది" అన్నాడు స్వామీజీ.

శంకర్ కవర్ తెరిచి చూశాడు. లోపల వంద రూపాయల నోట్లు వున్నాయి. మొత్తం పది. అంటే వెయ్యి రూపాయలు.

"ఈ డబ్బులు నాకెందుకు ఇస్తున్నారు సార్? " ఆశ్చర్యంగా అడిగాడు.

"నీ డబ్బులు కాబట్టి"

"నా డబ్బులా? " మరింత ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును... నువ్వు రాసిన సీన్ ఒకటి ప్రొడ్యూసర్‌కు నచ్చింది. ఆఫ్‌కోర్స్ తెరమీద నీ పేరు కన్పించదు. ఈ వెయ్యి రూపాయలు నీ సీన్‌కు వచ్చిన రెమ్యూనరేషన్"

శంకర్ మనసులో ఆనందం కెరటంలా ఎగిసింది.

తను రాసిన సీన్ సిన్మాకు తీసుకున్నారు. వెయ్యి రూపాయలు పారితోషికం ఇచ్చారు... వెయ్యి రూపాయలు.

తన మొదటి సంపాదన.

సిన్మా ఫీల్డులో తన మొదటి సంపాదన.

శంకర్ భావోద్వేగాన్ని స్వామీజీ అర్థం చేసుకున్నాడు. "నీ ఫీలింగ్ నాకు అర్థమైంది శంకర్. రెండు నెలల్లోనే నువ్వు ఎంతో పికప్ అయ్యావు. నీ స్టైయిల్ ఆఫ్ రైటింగ్ చూస్తుంటే తప్పకుండా మంచి డైరెక్టర్ అయ్యే సూచనలు కన్పిస్తున్నాయి"

"నిజంగానా సార్? " శంకర్ ఆనందంగా అడిగాడు.

"అవును.. నువ్వు కేంద్రీకరిస్తే మంచి రచయితవు కూడా అవుతావు"

"థాంక్యూ సర్... ఇదంతా మీ దయే" అన్నాడు శంకర్.

"నాదేంలేదు శంకర్. నాకు తోచిందేదో చాలామందికి చెబుతూ వచ్చాను. నువ్వు పట్టుదలతో అభ్యాసం చేస్తున్నావు. ఇది కేవలం నీ కృషీ టాలెంట్ అంతే. వజ్రాన్ని మెరుగుపెట్టగలమేకానీ వజ్రాన్ని సృష్టించ లేము శంకర్. నీలో లేనిది నేను ఏమీ సృష్టించలేను" స్వామీజీ చాలా నిజాయితీగా అన్నాడు.

శంకర్ ఆనందంతో మాటలు రానట్లుగా చూస్తుండిపోయాడు.

"మంచి సబ్జెక్టులు ఆలోచించు. వెరైటీగా వుండాలి. ప్రేక్షకులు ఏ ట్రెండ్స్ ఇష్టపడుతున్నారో అబ్జర్వ్ చేయి. నువ్వో మంచి సబ్జెక్ట్ చెప్పగలిగితే సెటిల్ అయిపోతావు. ఇదివరకులా సంవత్సరాల తరబడి వెయిట్ చెయ్యనక్కరల్లేదు. ఆల్ ది బెస్ట్"

ఆ రోజు నుంచీ శంకర్ మరింతగా కష్టపడడం ప్రారంభించాడు. రాత్రుళ్లు నిద్రపట్టనపుడు తల్లీతండ్రీ, చెల్లెలూ గుర్తుకు వచ్చేవాళ్లు. స్వంత వూరు గుర్తుకు వచ్చేది. తను దాచుకున్న రెండు వేలు ఇచ్చి ప్రోత్సహించి పంపించిన చందూ గుర్తుకు వచ్చేవాడు. కళ్లు అప్రయత్నంగానే తడి అయ్యేవి.

తను ఏనాటికయినా సాధించగలుగుతాడా? తన కుటుంబం, స్నేహితులు గర్వంగా చెప్పుకునే స్థాయికి చేరుకోగలుగుతాడా? 'యస్ నేను సాధించగలను' అని పట్టుదలగా మనసులో అనుకునేవాడు. రోజులు ఇలా సాగుతుంటే శంకర్ దేవీబాబు రూమ్‌నుంచి ఖాళీ చేయవల్సిన పరిస్థితి ఏర్పడింది.

అందుకు రెండు ముఖ్యకారణాలున్నాయి. ఒకటి తాగుడు, రెండు అమ్మాయిలు.

దేవీబాబు ఏమాత్రం ఖాళీ దొరికినా తాగుతూ వుండేవాడు. క్రమంగా అతని

తాగుడు భరించలేని స్థాయికి చేరుకుంది. స్వతహాగా దేవీబాబు మంచివాడే కానీ తాగితే మాత్రం ఏం మాట్లాడుతుందీ తెలీకుండా మాట్లాడతాడు.

శంకర్ సీరియస్‌గా సీన్స్ రాసుకుంటున్నా, చదువుకుంటున్నా డిస్టర్బ్ చేస్తాడు. చెప్పిన సోదే మళ్లీమళ్లీ చెప్పి బోర్‌కొట్టేవాడు. శంకర్ ఈ హింసనంతా భరించేవాడు.

తనకు ఎనిమిది నెలలుగా ఆశ్రయం ఇస్తున్న దేవీబాబు అంటే శంకర్‌కు ఎంతో అభిమానం.

దేవీబాబు లేకపోతే తను ఎక్కడ వుండేవాడు?

దేవీబాబుకు వున్న మరో వ్యసనం అమ్మాయిలు.

సిన్మాఫీల్డులో ఎక్స్‌ట్రా నటీమణులకు కొదవలేదు. కాబట్టి దేవీబాబు వీలయినప్పుడల్లా రూమ్‌కు అమ్మాయిలను తెచ్చేవాడు.

దేవీబాబు తాగుడును భరించటంకంటే ఇది మరింత హింస అయిపోయింది. ఒకప్పుడయితే దేవీబాబు ఒక్కడే వుండేవాడు. ఏం చేసినా అడిగేవాడులేడు. కానీ ఇప్పుడు రూమ్‌లో శంకర్ కూడా వుంటున్నాడు.

సమస్య అంతా శంకర్ దగ్గరే మొదలయ్యేది. శంకర్ ఇటువంటి విషయాలకు వంద మైళ్ల దూరంలో వుంటాడు.

"సాయంత్రం ఏదైనా పనుందా బైట? " అని అడుగుతాడు దేవీబాబు.

"లేదు... ఎందుకు? " అంటాడు శంకర్.

దేవీబాబు ఇబ్బందిగా ముఖం పెడతాడు. చెప్పలేక చెబుతాడు "సాయంత్రం ప్రవీణ వస్తానంది" అంటాడు.

"రానీ..."

"నువ్వుంటే తను ఫ్రీగా వుండలేదేమో!"

అవును ఇద్దరు లవర్స్ మధ్య అడ్డుగా తనెందుకు అనుకుని సాయంత్రమే రూమ్‌లోనుంచి బైటకు వెళ్లిపోయి ఫస్ట్‌షో, సెకండ్‌షో సిన్మాలు చూసి వెళ్ళి రైల్వేస్టేషన్‌లో కూర్చునేవాడు. బలవంతాన వస్తున్న నిద్ర ఆపుకునేవాడు. ఉదయం ఆరున్నరకు రూమ్‌కు చేరుకునేవాడు.

కానీ క్రమంగా ఇది రెగ్యులర్ కార్యక్రమం అయిపోయింది.

వారానికి కనీసం రెండురోజులయినా దేవీబాబు రూముకు అమ్మాయిలను తెచ్చేవాడు. శంకర్ మౌనంగా రూమ్‌లోనుంచి బైటకు వెళ్ళిపోయేవాడు. తడవకో అమ్మాయి కన్పించేసరికి ఇది ప్రేమ వ్యవహారం కాదని అర్థమయ్యేది.

అతనికి చాలా ఆశ్చర్యంగా వుండేది.

'అమ్మాయిలు అంత నిర్భయంగా అబ్బాయిల రూమ్‌లకు ఎలా వచ్చేస్తారా!' అనుకునేవాడు. ఈ ఎఫైర్స్ కాలక్షేపపు స్నేహాల తాలూకు విషయాల గురించిన నాలెడ్జ్ అతనికిలేదు. ఓవిధంగా అదే అతన్ని దారి మళ్ళించకుండా కాపాడింది. శరీర సుఖాల వ్యామోహంలో పడిపోయిన వాడు ఎప్పటికీ లక్ష్యంకోసం నిద్రాహారాలు మానేసి శ్రమించలేడు.

దేవీబాబు తాగుడు, అమ్మాయిల వ్యసనం అతన్ని బాధించేది. రెండుమూడు సార్లు నచ్చచెప్పాలన్న ప్రయత్నం కూడా చేశాడు.

అయినా ఫలితం లేక పోయింది.

ఆరోజునుంచీ ఇదో పెద్ద సమస్య అయిపోయింది శంకర్‌కు. ఓ్రోజు సీన్స్ చూశాక స్వామీజీ అడిగాడు.

"నువ్వు ఏదో మనస్సులో పెట్టుకుని బాధపడుతున్నట్లున్నావు"

"అదేంలేదు సార్..."

"బుకాయించకు... నీ ఫీలింగ్స్ ఏమిటో నువ్వు రాస్తున్నదాంట్లో తెలిసిపోతాయి. ఇంతకుముందులా నువ్వు మంచి సీన్స్, డైలాగ్స్ రాయలేకపోతున్నావు. ఏదో నిన్ను బాధిస్తోంది. అది బైటకు చెప్పుకోలేక బాధపడుతున్నావు. నీకు అభ్యంతరం లేకపోతే అదేంటో చెప్పు... నేనేమయినా చేయగల





నేమో చూద్దాం"

ఆమాత్రం ఓదార్పుకే అతని కళ్ళవెంట నీళ్ళొచ్చాయి.

మొత్తం అంతా వివరంగా చెప్పాడు.

శంకర్ చెప్పిందంతా విన్నాక స్వామీజీ అడిగాడు. "అయితే ఇప్పుడేం చేద్దామనుకుంటున్నావు? "

"అదే అర్థంకాకుండా వుంది సార్..."

"ఇక్కడ వుండటానికేదైనా అభ్యంతరమా? "

శంకర్ నమ్మలేనట్లుగా స్వామీజీవంక చూశాడు.

"ఈ బాధలేంటో నాకు తెలుసు శంకర్. నేను కూడా ఇవన్నీ అనుభవించినవాడినే. నేను పొద్దున్న లేస్తే స్టోరీ సిట్టింగులకు వెళతాను. ఒక్కోసారి రాత్రుళ్లు గెస్ట్‌హౌసులోనే పడుకుంటాను. అసలు నాకు ఫ్లాట్ అనేది వేస్ట్. నువ్వు వుంటానంటే అంతకంటే ఏం కావాలి? దగ్గర్లోనే మెస్ కూడా వుంది కాబట్టి ఫుడ్ సమస్య కూడా లేదు"

"నేను డిగ్రీదాకా చదివాను సార్. పోనీ ఏదైనా ఉద్యోగంలో చేరమంటారా? ఉద్యోగం చేసుకుంటూ సిన్మా ప్రయత్నాలు చేసుకుంటాను"

"ఏ ఉద్యోగం దొరుకుతుంది నీకు"

ఏదైనా ప్రైవేట్ కంపెనీలో దొరుకుతుందేమో ప్రయత్నిస్తాను సార్"

"ఎంత వస్తుంది? "

"నెలకు వెయ్యో పదిహేను వందలన్నా ఇవ్వచ్చు కదా సార్"

"పదిహేను వందలకోసం నువ్వు ఉద్యోగం చేస్తూ టైం వేస్టు చేసుకోనక్కరలేదు. ఎందుకంటే రెండు సీన్స్ రాస్తే నీకు ఆ డబ్బులు వచ్చేస్తాయి. ఇంకో విషయం ఏమిటంటే టీవీ సీరియల్స్ సంఖ్య పెరుగుతోంది. టీవీ సిన్మా అన్న తేడా తప్పితే రెండూ ఒక్కటే... టాలెంట్ వున్నవాళ్ళకోసం టీవీల్లో కూడా అన్వేషణ సాగుతోంది. నువ్వు నెలకు రెండు ఎపిసోడ్స్ రాసుకున్నా నీక్కావల్సిన డబ్బులు సంపాదించుకోవచ్చు. బైట ఏదో ఉద్యోగం చేస్తూ వుంటే ఆ ఉద్యోగం నీ శక్తి సామర్థ్యాలను పీల్చేస్తుంది. నీ ఉద్యోగం పూర్తిచేసుకుని రూమ్‌కు వచ్చేసరికి ఎగ్జాస్ట్ అయిపోతావు. నీలో వుండే క్రియేటివిటీ చచ్చిపోతుంది. ఉద్యోగాలు చేస్తూ సిన్మా ప్రయత్నాలు చేసే వాళ్ళు కూడా వుంటారు కానీ వాళ్ళలో 'చావో్బ్రతుకో తేల్చుకుందాం' అనే తత్వం వుండదు. నెలకు ఏదో రూపంలో డబ్బులు వస్తున్నాయి. కాబట్టి రిలాక్స్ అయిపోతారు. క్రమక్రమంగా వాళ్ళు తమ సిన్మా లక్ష్యానికి దూరం అయిపోతారు. అదే ఇక్కడే వుండి పోరాటం చేస్తూ వున్నావనుకో నీలో స్పిరిట్, కిల్లర్ ఇన్‌స్టింక్ట్ పెరుగుతూ వుంటాయి. ఇక్కడే సంపాదించి నిలదొక్కుకోవాలన్న పట్టుదల, కసీ వుంటాయి. ఇది నాకు తెలిసింది. మిగతాది నీ ఇష్టం"

"ఉద్యోగం చేస్తూ టైంవేస్ట్ చేసుకోవాలని నాకూ లేదు సార్. కానీ నా పరిస్థితి... తలదాచుకోవటానికి మీ ఫ్లాట్‌లో అవకాశం ఇస్తారు కానీ ఫుడ్? " నిస్సహాయంగా అన్నాడు శంకర్.

"మెస్‌లో నేను చెబుతాలే శంకర్"

"అదయినా నేను మీకు రుణపడిపోయినట్లేగా సార్"

"ఎవరన్నారు అలా? నీ దగ్గరకు డబ్బులు రాగానే నా బాకీ ముక్కుపిండి మరీ వసూలు చేసుకుంటాను. ఆ సందేహాలేమీ పెట్టుకోకు" నవ్వుతూ అన్నాడు స్వామీజీ.

"నాకు ఎప్పటికీ డబ్బులు రాకపోతే? "

స్వామీజీ ఓదార్పుగా అతని భుజంమీద చేయివేసి తట్టాడు. ఆశ శంకర్... అదే మనిషిని ముందుకు నడిపించేది. నీ విషయంలో ఆశతోపాటు లక్ష్యం. ఈ రెండే నిన్ను గొప్పవాడిని చేస్తాయి. నీమీద నమ్మకం లేకపోతే నేను ఇదంతా చేయను. ఓ వి



ధంగా నీమీద నేను పెట్టుబడి పెడుతున్నా ననుకో. నువ్వు పెద్ద డైరెక్టర్ అయిపోతే నేను నీ ఆస్థాన రైటర్‌గా వుండిపోవచ్చుగా అన్న స్వార్థంతో ఇదంతా చేస్తున్నాననుకో"

అది నిజంకాదనీ కేవలం తన గిల్టీఫీలింగ్ పొగొట్టేందుకే స్వామీజీ ఆవిధంగా మాట్లాడుతున్నాడని అర్థమైంది? అప్రయత్నంగా రెండుచేతులూ జోడించి "నేను ఎవరో తెలీకుండా ఇంత సహాయం చేస్తున్నారు సార్" అన్నాడు గద్గదస్వరంతో.

"ఇక్కడ ఎవరూ ఎవరికీ తెలీదు. సిన్మా అనే సముద్రం ఒడ్డున మనమంతా గవ్వలేరుకునేవాళ్ళం. నేను ఆకలితో ఫ్లాట్‌ఫారాల మీద బతికిన కాలంలో ఓ ధర్మాత్ముడు ఆదుకుని తిండిపెట్టి, విద్య నేర్పాడు. నేను ఈరోజు ఈవిధంగా వున్నానంటే ఆయనే కారణం. నాకు ఈ స్ట్రగుల్, వేదన తెలుసు. నువ్వు నిశ్చయంగా గొప్పవాడివి అవుతావు. మా అందరిలాగే సముద్రం ఒడ్డున గవ్వలేరుకోకుండా నువ్వు సముద్ర గర్భంలోకి వెళ్లి ముత్యాలు తేగలవన్న నమ్మకం నాకుంది. ఇక నీకు చేస్తున్న సహాయం అంటావా! నువ్వు వున్నా లేకున్నా ఫ్లాట్ తప్పదు. నెలకు మెస్‌బిల్ ఎంతవుతుంది? ఏడెనిమిది వందలు. నీ ఖర్చు నువ్వే సంపాదించుకోగలవు భయపడకు. ఏదో ఓ స్టేజ్‌లో సాహసంచేసి దూకేయాలి తప్పదు. ఆచీతూచీ అడుగు ముందుకేస్తానంటే ఒక్కో సందర్భంలో అది సాధ్యపడకపోవచ్చు నువ్వు మాత్రం ఈ సంఘటన మర్చిపోకు. చాలామంది గతం మర్చిపోతారు. నువ్వు నాకోమాట ఇవ్వగలవా?" అడిగాడు స్వామీజీ.

"ఏమిటి సార్ అది?"

"నువ్వు సిన్మాఫీల్డులో నిలదొక్కుకుని గొప్పవాడివయిన తర్వాత ఎవరైనా కొత్తగా ఫీల్డులో ప్రవేశిస్తూవుంటే వాళ్ళకు ప్రోత్సాహం ఇవ్వు. ఆదరించి అన్నం పెట్టు. సహాయం చేయి. ఎందుకంటే వాళ్ళే ఈ పరిశ్రమను బతికిస్తారు. తమ మేధస్సుతో కొత్త భావాలు, ఆలోచనలతో సరికొత్త సిన్మాలు సృష్టించి ఈ పరిశ్రమ పదికాలాల పాటు పచ్చగావుండేట్లు చేస్తారు. ఓవిధంగా ఇది మనం మన మనుగడకు స్వయంగా చేసుకునే సహాయం. చాలామంది మూర్ఖులు దీన్ని అర్థంచేసుకోలేరు."

స్వామీజీ చెప్పింది అక్షరసత్యం... నగ్న సత్యం.

సిన్మా ఫీల్డులో వుండే చాలామందికి ఆ విషయం తెలియకపోవటం, తెలిసినా నిర్లక్ష్యంగా వుండటం ప్రేక్షకుల దురదృష్టం.



శంకర్ స్వామీజీ ఫ్లాట్‌కు మారిపోయాడు.

దేవీబాబు పెద్దగా ఫీలయినట్లు కన్పించలేదు. మనస్సులో సంతోషించాడేమో తెలీదు. శంకర్ కారణంగా తన కార్యక్రమాలకు ఇబ్బంది కలుగుతుంది కాబట్టి అతను వెళ్ళిపోవటం ఆనందాన్నే ఇచ్చి వుండచ్చు

శంకర్. మాత్రం బాగా ఫీలయ్యాడు.

దాదాపు తొమ్మిది నెలల అనుబంధం. ఆశ్రయం ఇచ్చి ఆదుకున్న దేవీబాబు అంటే శంకర్‌కు ఎంతో అభిమానం. దేవీబాబు అప్పుడప్పుడు హేళనగా నిర్లక్ష్యంగా మాట్లా

డినా కూడా శంకర్ అదేమీ మనస్సులో పెట్టుకోలేదు. రూమునుంచి దూరంగా వెళ్ళిపోయినంత మాత్రాన దేవీబాబు మీద వున్న అభిమానం ఏమీ తగ్గలేదు. కాకపోతే అది గత్యంతరంలేని పరిణామం.

స్వామీజీది సింగిల్ బెడ్‌రూం అపార్ట్‌మెంట్.

ఫ్లాట్‌లో సామానుకంటే పుస్తకాలే ఎక్కువ. అవి కూడా నేలమీద దొర్లుతూ వుంటాయి. శంకర్ వచ్చాక ఫ్లాట్ స్వరూపం మారిపోయింది. శుభ్రంగా పుస్తకాలు షెల్ఫుల్లో చేరాయి. ఎక్కడి వస్తువులు అక్కడ సర్దుకున్నాయి. ఫ్లాట్‌లోని శుభ్రత స్వామీజీకి ఆనందాన్నిచ్చింది. శంకర్ తన పరిధిలో తాను వుండేవాడు. మొదటిరోజు స్వామీజీ కల్సినపుడు ఎంత గౌరవంగా వున్నాడో ప్రస్తుతం కూడా అదే విధంగా ప్రవర్తిస్తున్నాడు. అతి చనువు తీసుకోవటం కానీ అతివినయం కానీ వుండేది కాదు. బాలెన్స్‌డ్‌గా ప్రవర్తించే శంకర్ అంటే అందుకే స్వామీజీకి అభిమానంతో కూడిన ఇష్టం. కొంచెం దార్లో పడాలేకానీ శంకర్ సంచలనం సృష్టిస్తాడని స్వామీజీ బలంగా నమ్మేవాడు.

మెస్సునుంచి ఉదయాన్నే టిఫిన్, రెండు పూటలా కారేజ్ వచ్చేది.

స్వామీజీ వుంటే ఇద్దరూ తినేవాళ్లు. స్వామీజీ ఫ్లాట్‌లో వుండటం తక్కువే. ఎక్కువగా స్టోరీ డిస్కషన్స్‌లో తిరుగుతూ వుండేవాడు. రేపు షూటింగ్ అంటే రాత్రిళ్ళు గెస్ట్‌హౌస్‌లో కూర్చుని సీన్స్ హడావుడిగా రాస్తూ వుండేవాడు స్వామీజీ. ఫ్లాట్‌లో వున్నపుడు మాత్రం ఇద్దరూ అవిశ్రాంతంగా సిన్మాల గురించి చర్చించుకుంటూ వుండేవాళ్ళు. సాధారణంగా సిన్మా తప్పితే వేరే టాపిక్కు మాట్లాడుకోరు. ఒకవేళ వేరే ఏదైనా టాపిక్కులు మధ్యలో వచ్చినా అవి ఫైనల్‌గా సిన్మాలవైపే రూపాంతరం చెందుతాయి. ఉదాహరణకు పేపర్‌లో రాజకీయాలు, రాజకీయనాయకుల గురించిన చర్చలు వస్తే సిన్మాల్లో ఏవిధమైన క్యారెక్టరైజేషన్‌కు ఇవి ఉపయోగపడతాయన్న చర్చలే వచ్చేవి.

స్వామీజీ కూడా సాయంత్రం అయ్యేసరికి కనీసం రెండు మూడు పెగ్గులు తాగుతాడు. అదృష్టం ఏమిటంటే దేవీబాబులాగా మాట్లాడడు. మౌనంగా తాగేసి భోజనం చేసి పడుకుంటాడు. రాత్రంతా నిద్ర మానుకుని గెస్ట్‌హౌస్లుల్లో సీన్స్ రాసేటప్పుడు మాత్రం స్వామీజీ కొంచెం ఎక్కువగా తాగుతాడు. అంత టెన్షన్‌గా సీన్స్ రాయటం ఎందుకో శంకర్‌కు అర్థమయ్యేదికాదు.

"నువ్వు ఎంత అద్భుతమైన సీన్ అన్నా చెప్పు. ఈ మేధావులకు నచ్చదు. అదే రేపు షూటింగ్ అనుకో ఎంత చెత్త సీన్స్ రాసినా కిక్కురుమనరు" అని చెప్పాడు స్వామీజీ ఓసారి.

"ఎందుకంత టెన్షన్? ముందే స్క్రిప్ట్ రడీ చేసుకోవచ్చుగా?"

"అంత తీరిక ఎవరికుంది నాయనా ఇక్కడ? ప్రతి ఒక్కడూ బౌండ్ చేసిన స్క్రిప్ట్ చేతిలో లేనిదే షూటింగ్‌కెళ్ళద్దు అని కబుర్లు చెబుతారు కానీ వాస్తవానికి జరిగేది మాత్రం వేరు. సిన్మాకు సబ్జెక్టు ప్రాణం. అది లేనిదే ఏమీలేదు కానీ ఆఖరు క్షణాల్లో సీన్స్ వండమంటారు. చెబితే గీరంటారు. నన్ను పీకేసి ఆవిధంగా రాసే వేరే రైటర్ని పెట్టుకుంటారు. నాదేం పోయే వాళ్ళ ఖర్మకు నేను బాధ్యుడిని కాలేను కాబట్టి రేపు షూటింగ్ అంటే రాత్రి సీన్స్ రాయటం... ఇండస్ట్రీలో ఈ లాస్ట్ మినిట్ టెన్షన్ ఓ భాగం"

"సిన్మా ఫ్లాప్ అయితే రైటర్ పేరు పోతుందిగా!"

"కరెక్టే... కానీ తప్పదు. నేను మీకు అద్భుతమైన స్క్రిప్ట్ ఇస్తాను. ఆరునెలలు ఆగండి అంటే ఎవ్వడూ ఆగడు. ఎవడికీ అంత తీరికలేదు పోనీ అంత తీరిక



లేకుండా ఏం వెలగబెడుతున్నారంటే ఏమీ వుండదు. క్యాంపులు పెట్టటం, రాజకీయాలు పైరవీలు నడపటం, డబ్బాలు కొట్టడం, ఇవన్నీ అయ్యాక పాపం వాళ్ళకు మాత్రం ఓపిక ఎక్కడుంటుంది? అందుకే ఇంత దరిద్రపు సిన్మాలు తీసేది. నాలాంటి వాడికి ఇదంతా పడదు. అయినా తప్పదు. డైరెక్టర్ ఏం చెప్పినా 'ఆహా... ఓహో' అనాలి. నిరంతరం గ్యాప్ ఇవ్వకుండా నిర్మాతను కాకాపడుతూ వుండాలి. అప్పుడే నేనా సిన్మాలో వుండేది"

"అందరూ అంతేనా?"

"మెజారిటీ అంతే... చాలా తక్కువ మంది నిర్మాతలు మాత్రం పూర్తి స్క్రిప్ట్ లేనిదే సెట్స్‌కు వెళ్ళరు. అందుకే వాళ్ళు నాన్‌స్టాప్‌గా సంవత్సరాల తరబడి హిట్స్ తీస్తూ వస్తున్నారు. అలాగే ఇద్దరు ముగ్గురు రైటర్స్ నిక్కచ్చిగా వుంటారు. మిగిలిన నాలాంటి అటుఇటూ కాని రైటర్స్ ముందు డబ్బు, ఆ తర్వాత తెరమీద పేరు చూసుకోవటం కోసం రాస్తూ వుంటాం"

శంకర్‌కు ఆశ్చర్యమేసేది.

సిన్మాకు సబ్జెక్ట్ అనేది ప్రాణం... అంత ముఖ్యమైన విషయంలో ఇంత ఉదాసీనంగా ఎందుకుంటున్నారు? సబ్జెక్ట్ లేకుండానే ముందుగా ఫైట్స్, పాటలు, కామెడీ ట్రాకులు ఎందుకు తీసేస్తున్నారు?

ఏమో, ఆ ప్రశ్నకు సమాధానం ఎవ్వరూ చెప్పలేరేమో!

స్వామీజీ ఫ్లాట్‌లో శంకర్ని డిస్టర్బ్ చేసే వాళ్ళే లేరు. ప్రశాంతంగా చదువుకుంటూ రాసుకుంటూ వుండేవాడు.

ఇంకో ముఖ్యమైన విషయం టీ.వీ.

డిస్కవరీనుంచి స్టార్ మూవీస్, న్యూస్ నుంచి వీ ఛానెల్‌దాకా అన్నీ చూస్తూ వుండేవాడు. చూసేకొద్దీ ఆలోచనా పరిధి విస్తృతం అవుతున్నట్లుగా వుండేది.

ఇడియట్ బాక్స్‌గా పిలవబడే టీవీ ఆటమిక్ ఎనర్జీలాంటిది. దాంతో కరెంట్ సృష్టిస్తామా లేక విధ్వంసాన్నా అన్నది మన ఆలోచనా జ్ఞానంమీద ఆధారపడి వుంటుంది.

రోజులు సాగిపోతూ వున్నాయి.

ఓరోజు మధ్యాహ్నం శంకర్ మెస్‌కు వెళ్ళి భోజనం చేసి తిరిగి ఫ్లాట్‌కు బయలుదేరాడు. ఇంతలో ఎవరో తనను పిలుస్తున్నట్లుగా అన్పించి వెనుదిరిగి చూశాడు. మహేష్ కన్పించాడు.

"హల్లో శంకర్... బావున్నావా?"

"బాగున్నాను."

"నీకు ఏదైనా అర్జంటు పనుందా?"

"లేదు... ఎందుకు?"

"నాతోరా... చెబుతాను" అంటూ మహేష్ ముందుకు కదిలాడు.

"నేను రాను..." అని చెబుదామని నోటిదాకా వచ్చింది. అయినా చెప్పలేకపోయాడు. తన జీవితంలో మొట్టమొదటిసారిగా షూటింగ్‌కు తీసుకువెళ్ళిన వ్యక్తి మహేష్. అది డమ్మీ షూటింగ్ కావచ్చు, వేరే విషయం.

ఆ విశ్వాసంతో మారుమాట్లాడకుండా ముందు నడుస్తున్న మహేష్‌ను అనుసరించాడు శంకర్.

మహేష్ నేరుగా శంకర్ని ఓ ఫిల్మ్ ఇన్స్టిట్యూట్‌కు తీసుకువెళ్ళాడు. దాని పేరు క్రేజీ హీరోస్ ఫిల్మ్ ఇన్స్టిట్యూట్. తీసికెళ్ళి డైరెక్టర్‌కు పరిచయం చేశాడు.

"నా ఫ్రెండ్ శంకర్"

"హల్లో..." అన్నాడు డైరెక్టర్ షేక్‌హేండ్ఇస్తూ, "ముందు ఇంటర్వ్యూలు లాగించేద్దాం... ఆ తర్వాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు ఇంకా నిలబడే వున్నారే, కూర్చోండి" అన్నాడు.

ఇంటర్వ్యూలు మొదలయ్యాయి.

శంకర్ జరుగుతున్నదంతా ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు.

చాలామంది అమ్మాయిలు, అబ్బాయిల్ని ఇంటర్వ్యూ చేస్తున్నాడు డైరెక్టర్. నీకు




ఫైట్స్ వచ్చా? డ్యాన్స్ వచ్చా? స్టేజ్ అను భవం వుందాని అడుగుతున్నాడు. రకరకా లుగా చెప్పి యాక్ట్‌చేసి చూపించమంటు న్నాడు. వాళ్ళు వాళ్ళకు వచ్చినవిధంగా చేస్తున్నారు.

ఓ అమ్మాయి వచ్చింది.

"నువ్వు కోతిలాగా గెంతి చూపించు" అన్నాడు.

పాపం ఆ అమ్మాయి అష్టకష్టాలూ పడుతూ కోతిలా గెంతుతూవుంటే పకపకా నవ్వాడు.

శంకర్‌కు ఇదంతా చూస్తుంటే ఎందుకో అసహ్యంగా అన్పించింది.

ఇంకో కుర్రాడు వచ్చిన తర్వాత డైరెక్టర్ శంకర్‌వైపు చూపించి చెప్పాడు "అతనెవరో తెలుసా? "

"తెలీదు సార్" అన్నాడా కుర్రాడు.

"తెలీదా? మహేష్‌భట్ దగ్గర కో-డైరెక్టర్... తను తల్చుకున్నాడంటే తెలుగేంటి ఏకంగా హిందీ సిన్మాల్లోనే నిన్ను హీరోని చేసేయగలడు"

ఆ కుర్రవాడు అత్యంత వినయంగా తనకు నమస్కరిస్తూవుంటే శంకర్ ఆశ్చర్యంగా మహేష్‌వంక చూశాడు.

మహేష్ నవ్వుతున్నాడు.

శంకర్‌కి అర్థంకాలేదు.

తను మహేష్‌భట్ దగ్గర కోడైరెక్టర్ ఏమిటి?

తెలుగులోనే ఇంతవరకూ ఏ డైరెక్టర్ దగ్గరా కనీసం అసిస్టెంట్ డైరెక్టర్‌గా కూడా పని చేయలేదు.

కొంపదీసి మహేష్ తన గురించి భారీ ఎత్తున బిల్డప్ ఇచ్చి డైరెక్టర్‌కు చెప్పాడా?

అనే విషయాన్ని మహేష్‌ను అడుగుదా మనుకుని నోరు తెరిచాడు. మహేష్ 'ఇప్పుడేం మాట్లాడద్దు' అన్నట్లు సైగ చేశాడు. శంకర్ మౌనంగా కూర్చుండిపో యాడు. తన కళ్ళముందు జరుగుతున్న దంతా చూస్తుంటే బాధా, జాలీ, అసహ్యం లాంటి భావాలన్నీ కలుగుతున్నాయి. లేచి వెళ్ళి పోదామనుకున్నాడు. కానీ సభ్యత కాదని బలవంతాన నిగ్రహించుకుని కూర్చు న్నాడు.

గంటన్నర తర్వాత ఇంటర్వ్యూ ప్రహ సనం ముగిసింది.

ఈలోగా ఫోన్ మోగింది. డైరెక్టర్ రిసీవర్ ఎత్తి మాట్లాడాడు. "ఆ...సార్... ఇప్పుడే వస్తున్నాం సార్" అంటూ అత్యంత వినయంగా మాట్లాడాడు. ఫోన్ పెట్టేసి బెల్ కొట్టి బాయ్‌ని పిలిచాడు.

"బైట ఇంటర్వ్యూలకు వచ్చిన అమ్మాయిల్లో భువన అనే అమ్మాయి వుంటుంది పిలువు" అన్నాడు బాయ్‌తో.

భువన అనే అమ్మాయి ప్రవేశించింది.

"నిన్నే మా సిన్మాలో హీరోయిన్‌గా బుక్ చేద్దామనుకుంటున్నాం" అన్నాడు డైరెక్టర్.

భువన ముఖం వెయ్యివోల్టుల బల్బులా వెలిగింది.

"నిర్మాతగారు నిన్ను చూడాలనుకుంటున్నారు. వెళదామా? "

రెండో ఆలోచనేమీ లేకుండా భువన ఆనందంగా తలవూపింది. డైరెక్టర్ కుర్చీలోంచి పైకిలేచి శంకర్‌కు షేక్‌హాండ్ ఇచ్చాడు. "అర్జంటు పని తగిలింది. మళ్ళీ కలుద్దాం" అంటూ గబగబా భువనను తీసుకుని గదిలోంచి బైటకునడిచాడు.

"ఏంటీ వీళ్ళు తీసే సిన్మా? "

మహేష్ నవ్వాడు "నాకు తెలీదు"

"తెలీదా? " ఆశ్చర్యంగా అడిగాడు శంకర్. "మరి ఇదంతా ఏమిటీ? "

"ఇంకా అర్థంకాలేదా? " మహేష్ సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు "ఇంటర్వ్యూ"

"ఇంటర్వ్యూ అని తెలుస్తూనే వుంది. దేనికోసం ఈ ఇంటర్వ్యూ అంతా? "

"అది నాకు తెలీదు"

"వీళ్ళు నిజంగానే సిన్మా తీస్తున్నారా? "

"ఎందుకలా అడుగుతున్నావు? "

"నాకెందుకో అలా అన్పించింది"

"అదంతా నాకనవసరం బాసూ. నాకెప్పుడయినా డబ్బులు అవసరమైతే రాజేంద్ర సర్దుతాడు. 'మధ్యాహ్నం ఇంటర్వ్యూలు వున్నాయి కాస్త కుదురుగా వున్న కుర్రాడిని తీసుకురమ్మన్నాడు. వెదుకుతుంటే నువ్వు కన్పించావు"

"మరి నేను మహేష్‌భట్ దగ్గర కో-డైరెక్టరని ఎందుకు చెప్పినట్లు? "

"ఆ మాత్రం బిల్డప్ తప్పదులే బాసూ"

"అసలు సిన్మా తీయనపుడు ఇదంతా ఏమిటీ? "

"బిజినెస్... ఆరేంజ్‌లో బిల్డప్ ఇవ్వకపోతే జనం వస్తారా ఏమిటీ? "

"దీన్ని ఛీటింగ్ అంటారు మహేష్" సీరియస్‌గా అన్నాడు శంకర్.

"ఏమీ అనరు. దురదని క్యాష్ చేసుకోవటం అంటారు. నిలబడి నాలుగు అక్షరాలు పలకలేనివాడు హీరో అయిపోవాలని కలలు కంటాడు. 'నువ్వు పనికిరావురా నాయనా!' అంటే వింటాడా? వినడు. ఇంకో ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌కు పోతాడు. వాడు 'నీకేం ఫర్లేదు నిన్ను సిన్మా హీరోని చేసేస్తాం' అంటూ వీడిదగ్గర భారీ ఎత్తున గుంజేస్తాడు. అదేదో మనమే చేసేస్తే పోలా! అనేది రాజేంద్ర పాలసీ. వాళ్ళ దురదను రాజేంద్ర క్యాష్ చేసుకుంటున్నాడు. అందులో తప్పేముందీ? "

"మరిప్పుడీ అమ్మాయిని ఎవరో నిర్మాత దగ్గరకంటూ తీసుకెళ్ళాడు. సిన్మాయే లేనపుడు నిర్మాతేంటీ? హీరోయిన్ ఏమిటీ? " మహేష్ వంకరగా నవ్వాడు.

"సిన్మా హీరోయిన్ అనేసరికి అది ఎట్లా ఎగేసుకుంటూ వెళ్ళిపోయిందో చూశావా! వాళ్ళకంత దురదవుంటే రాజేంద్రలాంటి వాళ్ళు ఎందుకు వదులుతారు? ఇక్కడ ఇదంతా మామూలే. వదిలేయ్. ఇంకేంటీ సంగతులు? "

జరుగుతున్న ఛీటింగ్ గురించి మహేష్ అంత తాపీగా, తేలిగ్గా చెప్పేసరికి శంకర్ వళ్లు అసహ్యంతో జలదరించింది.

ఎంతో ఘోరమైన వంచన?

అమాయకంగా వచ్చే అమ్మాయిల్నీ, అబ్బాయిల్నీ సిన్మా పేరుమీద చేసే దారుణమైన ఛీటింగ్. వాళ్ళ భవిష్యత్తుతో ఆడుకునే నికృష్టమైన గేమ్. మహేష్‌లాంటి మూర్ఖులకు ఎంత చెప్పినా అర్థంకాదు. ఎక్కడ వందరూపాయలు వస్తే అది కరెక్ట్.

అతనికి భరించలేనంత దుఃఖం కలిగింది.

ఎవరు కాపాడతారు వీళ్ళని? ఎప్పుడు అర్థం చేసుకుంటారు వీళ్ళు? ఎంతకాలం కొనసాగుతుందీ నీచత్వం.

ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌నుంచి ఫ్లాట్‌కు వచ్చాక రెండు గంటలపాటు అస్థిమితంగా అటూఇటూ తిరుగుతూ వుండిపోయాడు. రెండుగంటల తీవ్రమైన అంతర్మథనం తర్వాత ఫ్లాట్ తాళంవేసి కిందకు వచ్చి ఫోన్ చేశాడు.

"హల్లో..."

"నేను అసిస్టెంట్ కమీషనర్ ఆఫ్ పోలీస్‌తో మాట్లాడాలనుకుంటున్నాను"

"మీరెవరు? ఏం కావాలి? "

"ఓ ముఖ్యమైన విషయం కేవలం ఆయనతోనే మాట్లాడాలనుకుంటున్నాను"

నిమిషం తర్వాత అవతలినుంచి విన్పించింది. "వెస్ట్‌జోన్ ఏసీపీ స్పీకింగ్"

"క్రేజీ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ అనే సంస్థ సిన్మాలు తీస్తామని నమ్మిస్తూ అమాయకులైన యువతీయువకుల్ని దారుణంగా మోసం చేస్తోంది"

"మీరెవరు? "

"నేను ఎవరన్నది ముఖ్యంకాదు సార్. బాధ్యతాయుతమైన పౌరుడిగా సంఘంలో జరుగుతున్న ఘోరాన్ని మీ దృష్టికి తెచ్చాను. మీరు ఇన్వెస్టిగేట్ చేస్తే దారుణమైన విషయాలు బైటకువస్తాయి. ఓ పోలీస్ ఆఫీసర్‌గా మీరు పూనుకుంటే





ఎంతోమంది యువతీయువకుల భవిష్య త్తులు సర్వనాశనం కాకుండా రక్షింపబడ తాయి. నమస్తే" అని ఫోన్ పెట్టేశాడు.

ఫోన్ చేసిన తర్వాత శంకర్‌కు మనశ్శాం తిగా అన్పించింది. చిన్నప్పటినుంచీ అతను అంతే. కళ్ళముందు ఏదైనా అన్యాయం జరుగుతుంటే చూస్తూ కూర్చోలేడు.

నెల రోజుల తర్వాత పేపర్లలో ఓ వార్త వచ్చింది.

సిన్మాల్లో నటింపచేస్తామని నమ్మిస్తూ యువతీయువకులను దారుణంగా మోస గిస్తూ యువకులనుంచి భారీ ఎత్తున డబ్బు గుంజుతూ, యువతులచేత బలవంతంగా వ్యభిచారం చేయిస్తున్న క్రేజీ ఫిల్మ్ హీరోస్ ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ రాజేంద్రను నిన్న రాత్రి రెడ్‌హాండెడ్‌గా టాస్క్‌ఫోర్స్ పోలీ సులు అరెస్టు చేశారు. సిన్మా వ్యామోహాన్ని అడ్డుపెట్టుకుని అమాయకులైన యువతీ యువకులను...

శంకర్ వార్త మొత్తం చదవలేదు.

రిలీఫ్‌గా నిట్టూర్చాడు. డైరెక్టుగా జరుగు తున్న అన్యాయాల్ని ఎదుర్కోలేకపోవచ్చు కానీ ఏదైనా ప్రయత్నం అదీ ముఖ్యం. 'నా కెందుకులే' అని నిర్లక్ష్యంగా, నిర్లిప్తంగా కూర్చుంటే మొత్తం అంతా కుళ్ళిపోయి సమాజం అనే కుప్పతొట్టిలో ఎవడికివాడు వంటరిగా మిగిలిపోతాడు.

★ ★ ★

"నభూతో నభవిష్యతి... అంటే అర్థం ఏమిటి? "

"గతంలో లేదు భవిష్యత్తులో వుండబో దని"

"కాదు... బూతులేనిదే భవిష్యత్తులేదని అర్థం. రైటర్‌వి ఈ మాత్రం తెలీదా నీకు? "

శంకర్ ముఖం ఎర్రబడింది.

"దాని అర్థం అది కాదు" అన్నాఢు వాది స్తున్నట్లుగా.

"కాకపోవచ్చు" ఆయన వింతగా నవ్వాడు. "కానీ ఇక్కడ మాత్రం దాని అర్థం అదే"

శంకర్ మౌనంగా వుండిపోయాడు. స్వామీజీ చెప్పింది విని దాదాపు ఎగిరి గంతేసినంత పనిచేశాడు. ఎవరో నిర్మాత సిన్మా తీయటంకోసం మంచి సబ్జెక్ట్ కోసం వెతుకుతున్నాడు. వెళ్ళి కథ చెప్పమన్నాడు స్వామీజీ.

"నేనా? " అన్నాడు శంకర్ ఆశ్చర్యంగా.

"అవును... నువ్వే"

"నేను సబ్జెక్ట్ చెబితే వింటారా? "

"ఎందుకు వినరు. బాగుంటే తీసుకుం టారు. ప్రయత్నం చేయటంలో తప్పులేదు. ఎంతకాలం ఫ్లాట్‌లోనే కూర్చుంటావు? మహా యుద్ధానికి ముందు కనీసం వీధి పో రాటాల్లోనయినా అనుభవం వస్తుంది. వెళ్ళి కలువు" అనేసి ఫోన్ నెంబర్ ఇచ్చాడు.

శంకర్ ఆ నంబర్‌కు ఫోన్‌చేశాడు. ఏడు సార్లు చేసిన తర్వాత ఎక్కడకు ఏ టైముకు రావాలో చెప్పారు.

ఠంచనుగా చెప్పిన టైముకి ఆఫీసుకి వెళ్ళాడు.

మనస్సంతా టెన్షన్‌గా వుంది. మొదటిసా రిగా తను సిన్మాకథ చెప్పబోతున్నాడు. ఇక్కడకు వచ్చిన పధ్నాలుగు నెలల తర్వాత వచ్చిన అవకాశం... తను బాగా హోమ్ వర్క్ చేసిన సబ్జెక్ట్ చెప్పేందుకు సిద్ధమ య్యాడు. చాలామంచి సబ్జెక్ట్ అది. మొత్తం ఎనభై ఆరు సీన్స్ సీనిక్ ఆర్డర్ రాసుకు న్నాడు రాత్రుళ్లు మేలుకుని. నిర్మాత తన సబ్జెక్ట్‌ని ఖచ్చితంగా తీసుకుంటాడని అతని నమ్మకం. సబ్జెక్ట్ అంత బాగా వచ్చింది.

★ ★ ★

తెల్లవారుఝామున మూడింటికి పడు కున్నా ఆరున్నరకల్లా లేచి స్నానంచేసి దగ్గ రలో వున్న గుడికి వెళ్ళొచ్చాడు. మైండ్ అంతా బ్లాంక్‌గా వుంది. తొమ్మిది గంట లకు ఆఫీసుకి రమ్మని చెప్పారు. స్వామీజీని

కూడా వెంట రమ్మని అడుగుదామనుకు న్నాడు కానీ నవ్వుతాడేమోనని వూరుకు న్నాడు. స్వామీజీ ఎనిమిది గంటలకల్లా వేచి హడావుడిగా వెళ్ళిపోయాడు. అతని స్టోరీ సిట్టింగుల టెన్షన్‌లో అతను వున్నాడు.

ఆఫీస్‌కు వెళ్లిన గంటన్నర తర్వాత పిలు పొచ్చింది.

లోపలకు వెళ్ళాడు. ముగ్గురు భారీగా వున్న వ్యక్తులు పరుపులమీద కూర్చుని వున్నారు. శంకర్ వాళ్లకు నమస్కరించి కూర్చోమన్నాక కూర్చున్నాడు.

"కథ మొదలెట్టు రైటరూ" అన్నాడు వాళ్లలో ఓ వ్యక్తి. అందులో ఎవరు నిర్మాతో తెలీదు. ముగ్గురూ నిర్మాతలేమో కూడా తెలీదు.

శంకర్ చెప్పటం ప్రారంభించాడు.

ఆరు నెలలనుంచీ అతను ఎంతో ప్రాణ ప్రదంగా ఫీలవుతున్న సబ్జెక్ట్ చెప్పసాగాడు. దాదాపు అరగంట గడిచింది. శంకర్ ఏదో ట్రాన్స్‌లో వున్నట్లుగా చెప్పుకుపోయాడు. తదేక దీక్షతో చెప్పుకుపోయాడు. చెప్పటం పూర్తయిన తర్వాత ఇంకోవ్యక్తి అడిగాడు.

"ఈ సబ్జెక్ట్ బాగా లేదు... ఇంకోటి చెప్పు"

శంకర్ హతాశుడయ్యాడు.

"నా దగ్గర వేరే సబ్జెక్టులు లేవండీ. ఇదొక్కటే వుంది"

"ఇదొక్కటే వుందా? అదేంటయ్యా రైటరూ! సబ్జెక్టులు చెప్పమనగానే గబగబా వందస్టోరీలు విన్పించేస్తారే మిగతా రైటర్లు. సర్లే కానీ నీ దగ్గర షకీలాకోసం పనికొచ్చే సబ్జెక్ట వుందా? "

"షకీలా ఎవరు? " శంకర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"షకీలా తెలీదా? నీ బండబడా, నువ్వేం రైటర్‌వయ్యా. ఆమె డెబ్బై రాత్రులు, మధుర స్వప్నాలు, తీపివయస్సు... ఈ సిన్మాలన్నీ చూడలా? కుర్రాళ్ళు ఎగబడుతు న్నారు కదయ్యా. ఆ...షకీలాకు సూటయ్యే సబ్జెక్ట్ ఏదైనా వుంటే చెప్పు"

ఫ్లాట్‌ఫారాలమీద అర్ధనగ్నంగా కన్పించే మలయాళ సిన్మాపోస్టర్లు గుర్తుకువచ్చాయి. తనను ఓ థోర్డ్‌రేట్ బూతు సిన్మాకథ చెప్పమని అడుగుతున్నారా?

ఆవేశం బుస్సుమంటూ పొంగింది.

"నా దగ్గర అటువంటి నీచమైన స్టోరీలు ఏమీలేవు సార్" అన్నాడు కోపంగా.

"లేవా? " అంతవరకూ మౌనంగా కూర్చున్న మూడోవ్యక్తి అన్నాడు. "ఈ రోజుల్లో మినిమం గ్యారంటీ సిన్మాలు అవే నండీ రైటర్‌గారూ... రిస్కులేకుండా టేబుల్ ప్రాఫిట్ మిగులుతుంది"

"వాటిని సిన్మాలనరండీ"

"మరింకేమంటారు" ముగ్గురూ ఆశ్చర్యంగా అడిగారు.

"సెమీ బ్లూఫిల్మ్‌లంటారు"

"ఏదో ఒకటి. మనకేంబోయె. జనం ఏది సొంగకార్చుకుంటూ చూస్తారో ఆ సిన్మాలు తీయాల. ఇప్పుడు షకీలా సిన్మాల ట్రెండ్. ఆ టైపులో సిన్మా లాగించేస్తే సక్సెస్ గ్యారంటీ. రెండు సిన్మాలు తీస్తే బ్యానర్ నిలబడిపోద్ది"

"క్షమించండి. అటువంటి నీచమైన సిన్మాలకు నేను వ్యతిరేకిని. లేత మెదళ్లలో విషం నింపే ఆ రకం చౌకబారు సిన్మాలు బ్యాన్‌చేస్తే కానీ దేశం బాగుపడదు" అన్నాడు శంకర్ ఆవేశంగా.

"ఏందయ్యా రైటర్... కథ చెప్పమని పిలిస్తే ఉపన్యాసం చెబుతావుండావు! జనం చూస్తుంటే నీకేంటీ దొబ్బుడాయి? నీ వరస చూస్తుంటే ఆర్ట్ సిన్మాలు తీయమనేట్టు న్నావే? " వేళాకోళంగా అన్నాడో వ్యక్తి.

"ఆర్ట్ సిన్మాలు కాదు, హార్ట్ సిన్మాలు తీయాలి. ప్రేక్షకుల గుండెలూ, మెదళ్ళూ, మస్తిష్కాలను కదిలించే సిన్మాలు తీయాలి" శంకర్ మరింత ఆవేశంగా అన్నాడు.

"ఆ లెఖ్ఖన మమ్మల్ని నెత్తిన చెంగేసుకు





పొమ్మంటావా? "

శంకర్‌కు వళ్ళు మండింది. ఎంతో ఆశ పెట్టుకుని వస్తే ఇలా జరుగుతుందని ఊహించలేదు. ఏమనుకుంటున్నారు వీళ్ళు. రైటర్ అంటే సరస్వతీ పుత్రుడు. నీచమైన బూతు కథలు రాయమంటారా?

శంకర్ తన ఫైలు అందుకుని పైకి లేచాడు.

"చూడండి సార్... సిన్మా అనేది వ్యాపారమే. కాదని ఎవ్వరూ అనరు. బూతు సిన్మాలు తీసి డబ్బు సంపాదించటంకంటే బ్రోతల్ కంపెనీ పెట్టుకుంటే మరింత ఎక్కువ డబ్బులు వస్తాయేమో ఆలోచించండి" అంటూ శంకర్ చరచరా బైటకు నడిచాడు.

★ ★ ★

"నీకసలు బుద్ధుందా? "

శంకర్ తల వంచుకుని కూర్చుని వున్నాడు. స్వామీజీ మండిపడుతూ అరుస్తున్నాడు.

"వాళ్ళెవ్వరో సిన్మా తీద్దామనుకుంటున్నారు, స్టోరీ చెప్పిరమ్మంటే వాళ్ళతో గొడవపెట్టుకొస్తావా? "

"నేనేం గొడవపెట్టుకోలేదండీ... నేను చెప్పిన సబ్జెక్ట్ వాళ్ళకు నచ్చలేదు"

"నచ్చకపోతే నోర్మూసుకుని రావాలి అంతేకానీ వాళ్ళను అడ్డమైన తిట్లు తిడతావా? " స్వామీజీ కోపంగా అడిగాడు.

"నేనేం తిట్టలేదు సార్"

"నువ్వేం చేశావో మొత్తమంతా వివరంగా చెప్పారు. ఏమనుకుంటున్నావు నీ గురించి? పదిమంది నోట్లో పడ్డావంటే పాతాళంలోకి తొక్కేస్తారు"

"నేను అద్భుతమైన సబ్జెక్ట్ చెప్పాను సార్. అంతమంచి సబ్జెక్ట్ వాళ్ళకు నచ్చలేదు" శంకర్ ఉక్రోషంగా అన్నాడు.

"లక్షలు ఖర్చుపెట్టి సిన్మాతీసేది వాళ్ళు వాళ్ళకు ఇష్టమైన సిన్మా వాళ్ళు తీసుకుంటారు. మధ్యలో వద్దనటానికి నువ్వెవరు? నిన్ను కథ చెప్పమన్నాను. చెప్పావు. అంతవరకే నీ పని. అంతే కానీ వాళ్ళు ఎలాంటి సిన్మాలు తీయాలన్నది చెప్పటానికి నువ్వెవరు? నీ అనుభవం ఎంత? నిన్ను ఇలా వదిలేస్తే పీకలమీదకు తెస్తావు. ఎవరైనా డైరెక్టర్ దగ్గర అసిస్టెంట్‌గా పడేస్తే కానీ నీకు ప్రాక్టికల్ నాలెడ్జ్ పెరగదు" స్వామీజీ పది నిమిషాలపాటు తిడుతూనే వున్నాడు.

★ ★ ★

"స్టార్ట్ కెమేరా... యాక్షన్" డైరక్టర్ గట్టిగా అరిచాడు.

శంకర్ క్లాప్‌కొట్టి వేగంగా పక్కకు తప్పుకున్నాడు.

"ఏంటి అబ్బాయా! ఈ మధ్య కనబడటం లేదు"

"ఏం... నాతో ఏదైనా పనుందా? "

"చాలా చాలా పనుందబ్బాయా"

"ఏంటో ఆ చాలా పని? "

"ఏంటంటే... ఏటి అంటే..."

"కట్..." డైరెక్టర్ పూనకం వచ్చినట్లుగా అరిచాడు.

"ఎన్నిసార్లు చెప్పాలి తల్లీ నీకు... రెండు ముక్కలు చెప్పలేవు. నీలాంటివాళ్ళంతా వచ్చి మమ్మల్ని చంపుతారు" డైరెక్టర్ ఆ ఎక్స్‌ట్రా ఆర్టిస్ట్‌మీద అరుస్తున్నాడు. పక్కనే వున్న ఓ మోస్తరు సీనియర్ కామెడీ నటుడు దాన్నంతా చిద్విలాసంగా నవ్వుతూ చూస్తున్నాడు.

శంకర్ మనస్సులోనే పళ్ళు కొరుక్కున్నాడు.

ఎనిమిదో టేకు... కామెడీ సన్నివేశం చిత్రీకరణ జరుగుతోంది. "దీన్ని కామెడీ అంటారా? " అని శంకర్ ఎవ్వరినీ అడగలేదు మనసులో మాత్రం అనుకున్నాడు. మొత్తానికి మరో రెండు టేకుల తర్వాత ఆ షాట్ పూర్తయ్యింది.

"ఎక్సలెంట్ సార్" అంటూ డైరెక్టర్ తాలూకు భజంత్రీలు అరుస్తున్నారు. డైరె



క్టర్ గర్వంగా ఛాతీ విరుచుకుని తర్వాత షాట్ గురించి కెమేరామెన్‌కు చెబుతున్నాడు.

అతనికి భరించలేనంత డిప్రెస్డ్‌గా అన్పించింది.

ఎన్ని కలలు కన్నాడు? ఓ మంచి డైరెక్టర్ దగ్గర అసిస్టెంట్‌గా చేరి ఆ తర్వాత అసోసియేట్, కో-డైరెక్టర్ ఇలా అంచెలంచెలుగా పైకి వచ్చి డైరెక్షన్ నేర్చుకుని అద్భుతమైన డైరెక్టర్‌గా రూపాంతరం చెంది మంచి సిన్మాలు తీయాలని... ఎంతకాలం డైరెక్టర్ల చుట్టూ తిరిగాడు. తిట్లూ, ఛీత్కారాలూ, హేళనలనూ భరిస్తూ? కానీ ఇపుడు స్వామీజీ పుణ్యమా అంటూ అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేరాడు. అయినా ఎక్కడో ఏదో లోపం... ఏమిటది? తన చేత క్లాప్‌కొట్టిస్తున్నందుకా? కాదు.

మరెందుకు?

రెండురోజులయ్యింది అతను ఆ యూనిట్‌లో జాయినయ్యి. స్వామీజీకి తెల్సిన ఫ్రెండ్‌కు ఈ డైరెక్టర్ క్లోజ్ ఫ్రెండ్. ఆ పరిచయంమీద శంకర్ గురించి చెప్పిన తర్వాత 'నాకు ఇప్పటికే అసిస్టెంట్స్ ఎక్కువయ్యారే' అన్నా కూడా తర్వాత "సరే పంపండి చూద్దాం... ఈ సిన్మాకు అప్రెంటిస్‌గా వుంటాడు" అన్నాడు. అదే విషయం స్వామీజీ చెప్పినపుడు శంకర్ ఆనందంతో నాట్యంచేసినంత పని చేశాడు.

ఎంతకాలానికి తన కలలు ఫలించబోతున్నాయి?

రెండు మూడేళ్ళు డైరెక్షన్ డిపార్ట్‌మెంట్‌లో పనిచేసి మెళకువలు నేర్చుకుంటే ఆ తర్వాత తను కూడా మంచి డైరెక్టరయిపోతాడు. ఆ తర్వాత ఏముంది అద్భుతమైన సిన్మాలు తీయటమే. శంకర్‌కు ఒక్కసారిగా లోకం, జీవితం అంతా సుందరమైన స్వప్నంలా కన్పించటం ప్రారంభమయ్యింది. రెండురోజుల తర్వాత స్వామీజీ స్వయంగా వెంటబెట్టుకుని తీసుకువెళ్ళాడు షూటింగ్ స్పాట్‌కు.

"ఇతనేనా?" డైరెక్టర్ శంకర్ని ఎగాదిగా చూస్తూ స్వామీజీని అడిగాడు.

"అవున్సార్... పేరు శంకర్... చాలా మంచి కుర్రాడు"

"సిన్మాఫీల్డుకి రాకముందు మేం కూడా మంచి కుర్రాళ్ళమేనండీ..." జోకులాంటిది వేశాడు. "ఈరోజునుంచే జాయినయిపోతాడు. మీరేం వర్రీకాకండి. నా దగ్గర చేసిన వాళ్ళు పెద్ద డైరక్టర్లయిపోయారు" అన్నాడు. ఆల్‌దిబెస్ట్ చెప్పేసి స్వామీజీ వెళ్ళిపోయాడు.

చంద్రశేఖరం ఒకప్పుడు పేరున్న డైరెక్టరే. గత పాతికేళ్ళుగా తీసిందే తీస్తూ వుండటంవల్ల ప్రస్తుతం హిట్స్, సిన్మాలూ రెండూ లేవు. నాలుగేళ్ళ గ్యాప్ తర్వాత ఈ సిన్మా వచ్చింది. అందుకే విపరీతమైన హడావిడి పడిపోతున్నాడు. కో-డైరక్టర్ని కేకేసి పిలిచాడు. "సత్తిబాబును కంటిన్యుటీలు చూసుకోమను. వీడిచేత క్లాప్ కొట్టించు" అన్నాడు శంకర్‌వైపు చూపిస్తూ.

ఛెళ్ళుమంటూ తగిలిందా పదం...వీడు... ఒక్కసారిగా రక్తం మరిగింది. అయినా నిగ్రహించుకున్నాడు. ఈ లోపల కోడైరెక్టర్ క్లాప్ బోర్డ్ తెప్పించి బోర్డ్‌మీద చాక్‌పీస్‌తో షాట్ నెంబర్, సీన్ నెంబర్, టేక్ నెంబర్ ఏవిధంగా రాయాలో చెప్పి అడిగాడు. "ఏంటీ నీ పేరు?"

"శంకర్"

"షో జేయకుండా వళ్ళు దగ్గరెట్టుకుని పనిచేయి" అనేసి వెళ్ళిపోయాడు.

అదీ మొదలు...

సిన్మా షూటింగ్ తాలూకు ఉత్సాహమంతా మొదట్లోనే అంటే మొదటిరోజే ఆవిరయిపోయింది. మధ్యాహ్నం లంచ్ టైమ్‌లో అతన్ని ఎవ్వరూ పట్టించుకోకుండా ఎవరికి వాళ్ళు భోజనం చేస్తూ వుండిపోయారు. అరగంట తర్వాత కో డైరెక్టర్ పాన్ నములుతూ వచ్చాడు. ఓ పక్కన





నిలబడ్డ శంకర్ని చూసి 'భోజనం చేశావా?' అనడిగాడు. లేదన్నాడు శంకర్. "ఇప్పటి దాకా ఏంచేస్తున్నావ్? నిన్నెవ్వరూ బొట్టెట్టి పిలవరు. ప్లేట్ తీసుకో వెళ్ళు" అని ప్రొడక్షన్ బాయ్ని పిల్చి "వీడికిక్కాడా భోజనం పెట్టండి" అన్నాడు. పెళ్ళయిపోయిన తర్వాత బైట ఆత్రుతగా వెయిట్ చేస్తున్న ముష్టివాడికి అన్నంపెట్టమని చెప్పినట్లుగా చెప్పాడు.

శంకర్కు అన్నం సయించలేదు. రెండు ముద్దలు తినేసి చేయి కడిగేసుకున్నాడు. లంచ్ బ్రేక్ తర్వాత మళ్ళీ షూటింగ్ ప్రారంభం అయ్యింది. కామెడీ ట్రాక్ తీస్తున్నారు.

నాలుగ్గంటల్లోనే అతనికి విషయం అర్థమైపోయింది.

అతనికి కెమేరా యాంగిల్స్ తెలీవు, షాట్ డివిజన్ తెలీదు. సీన్స్ కంటిన్యూటీ, ఎడిటింగ్ తదితర టెక్నికల్ విషయాలేమీ తెలీదు. కానీ... అతనిలో మంచి ప్రేక్షకుడు, అంతకంటే మంచి పాఠకుడు వున్నాడు.

శంకర్ మేధావేమీకాదు. అతనిది సాధారణస్థాయి ఐక్యూనే... అయినా కూడా జరుగుతున్నదేమిటో అర్థం అవుతోందంటే అందుకు కారణం ముందు విస్తృతంగా చదవటం ఆ తర్వాత స్వామీజీ సాహచర్యంలో సీన్స్ రాయటం నేర్చుకోవటం.

పాతికేళ్ళక్రితంనుంచీ అరిగిపోయిన సంభాషణలు, సీన్సే మళ్ళీ తీస్తున్నాడు చంద్రశేఖరం. పాతికేళ్ళ క్రితం అతని సిన్మాలు హిట్టయి వుండచ్చు కానీ కాలం మారిపోయింది. ట్రెండ్స్, ప్రేక్షక అభిమానుల్లో విపరీతమైన మార్పు వచ్చింది. దాన్నంతా స్టడీ చేసేంత ఓపికా, తీరికా చంద్రశేఖరానికిలేదు. ఒకప్పుడు నేను పెద్ద డైరెక్టర్ని అనే అహం. అది ఇప్పుడు కాదు, ఒకప్పుడన్న విషయం ఆయన ఎప్పుడో మర్చిపోయాడు.

★ ★ ★

కాలం, సమాజంతోపాటు సిన్మాలు, క్రియేటివ్ అంశాలు మారాయి.

శంకరాభరణం, సాగరసంగమం అద్భుతమైన సిన్మాలే. కానీ అదే సిన్మాలు ఈ రోజు విశ్వనాథ్గారు తీస్తే తప్పకుండా ఆ షాట్ డివిజన్, టేకింగ్ ఈవిధంగా వుండదు. కాలంతోపాటే కళలూ కళాకారుడూ మారక తప్పదు. లేకుంటే అది చరిత్రవుతుంది. చంద్రశేఖరం డైరెక్షన్ ప్రతిభ ఏపాటిదో అతనికి రెండురోజుల్లోనే అర్థమైపోయింది.

ఈ రెండు రోజులూ రెండు యుగాలుగా గడిచింది. తోటి అసిస్టెంట్ డైరెక్టర్లు, అసోసియేట్లు, ప్రొడక్షన్ బాయ్స్, లైట్బాయ్స్ అందరూ అతనిమీద కుళ్ళు జోకులేసేవాళ్ళు. క్లాప్కొట్టే అతను తిరిగి ఏమీ అనలేడని వాళ్ళకు తెలుసు. కానీ దాన్నంతా అతను మౌనంగా భరించటానికి కారణం అతని సంస్కారమని వాళ్ళకు తెలీదు. సిన్మాఫీల్డులో బాగా చదువుకుని టాలెంట్ వున్న వాళ్ళు కళ్ళముందు ఏం జరుగుతున్నా వాళ్ళకు సంబంధించకపోతే పట్టించుకోరు. కేర్ చేయరు. మిగతావాళ్ళు అందుకు పూర్తి వ్యతిరేకంగా ప్రవర్తిస్తారు. ప్రతి చిన్న విషయాన్నీ, తమకు సంబంధంలేని విషయాన్ని కూడా పట్టించుకుని కామెంట్లు చేసి ఆనందిస్తారు. మంచి బట్టలేసుకువస్తే 'హీరోగారు వచ్చారోయ్' అంటూ నవ్వుతారు. కూర్చుంటే ఒకటి, నిల్చుంటే ఒకటి. కాలు మీద కాలేసుకుని కూర్చోకూడదు. డైరెక్టర్, నిర్మాత, హీరో తదితరులు కన్పించగానే నక్క వినయం నటించాలి. అది నటనని అందరికీ తెలుసు కానీ అదే గౌరవంగా ఇక్కడ చెలామణీ అవుతుంది. మళ్ళీ అదే వ్యక్తి పక్కకెళ్ళి డైరెక్టర్ని హీరోని నీచమైన బండబూతులు తిడతాడు. అందరూ అని కాదు కానీ యూనిట్లో ఎక్కువమంది ఓ విధమైన శాడిజం, రాక్షసానందంతో వుంటారు. ఎవడు దొరుకుతాడా అని నిరం

తరం ఎదురుచూస్తూనే వుంటారు.

రెండు రోజులకే శంకర్‌కు పిచ్చెక్కినంత పనయ్యింది.

ఈ అసిస్టెంట్ డైరెక్షన్ కోసమా తను ఇంతగా తహతహలాడింది? అనుకున్నాడు. యూనిట్‌లో ప్రతి ఒక్కడికీ అసిస్టెంట్ డైరెక్టర్ అంటే లోకువ. క్లాప్‌కొట్టే అసిస్టెంట్ అంటే మరింత లోకువ. ఇక కోడైరెక్టర్ అయితే తను డైరెక్టర్ కాకుండా ఎవడికివాడే అడ్డుపడిపోతున్నట్లుగా ఫీలయిపోయి డైరెక్షన్ డిపార్ట్‌మెంట్‌లో ఎవడైనా అమాయకుడు దొరికితే అడ్డంగా ఆడుకుంటాడు. అదో రాక్షసానందం.

అందరూ ఇలా వుండరు.

గౌరవంగా, క్రమశిక్షణతో, సంస్కారంగా ప్రవర్తించే డైరెక్టర్లూ, నిర్మాతలూ, నటీనటులు కూడా వుంటారు కానీ దురదృష్టవశాత్తూ వాళ్ళ సంఖ్య తక్కువ. శంకర్ చేరిన చంద్రశేఖరం విచిత్రమైన వ్యక్తి. ఆయనకు ఏ ఫీలింగులూ, నమ్మకాలూ కుదురుగా వుండవు. రెండు నెలలు విపరీతంగా జాతకాలు, వాస్తులు నమ్ముతాడు. ఆ తర్వాత 'జాతకంలేదూ... బొంగూలేదూ!' అంటాడు. మళ్ళీ ఆరు నెలల తర్వాత 'నాడీ జ్యోతిష్యం మంచిందంటున్నారే! అని మొదలుపెడతాడు. ప్రస్తుతం ఆయనకు విపరీతమైన కసి. తన టాలెంట్‌ను ఇండస్ట్రీ, ప్రేక్షకులూ గుర్తించటంలేదన్న ఉక్రోషంతో కూడిన బాధ. తన దగ్గర 'సరుకు అయిపోయింది. విషయం లేదన్న' సంగతిని చచ్చినా ఒప్పుకోడు.

రచయితకానీ, నటుడు కానీ, డైరెక్టర్ కానీ, గాయకుడు కానీ ఏ క్రియేటివ్ వ్యక్తి అయినా నిరంతరం సాధన చేస్తూ వుండాలి. నేర్చుకుంటూ వుండాలి. ఫీడ్ చేస్తూ వుండాలి. ఎప్పుడయితే ఫీడింగ్ ఆగిపోయిందో అప్పుడే బైటకు వచ్చే 'అవుట్ పుట్' తగ్గిపోతుంది. ఎవడి కళాత్మకమైన అవుట్‌పుట్ తగ్గిపోయిందో వాడు మరణించినట్లే. క్రియేటివ్ డెత్. భౌతికంగా బతికి వున్నా కళాత్మకంగా చచ్చిపోయినట్లే లెక్క.

ఇది చాలా సింపుల్ ఫిలాసఫీ... మహామహులు ఆ విధంగానే తెరమరుగైపోయారు. మూర్ఖులు మాత్రం ఈ మాత్రం చిన్న విషయాన్ని కూడా అర్థంచేసుకోరు. చంద్రశేఖరం ఆ విధమైన మూర్ఖుడు. అటువంటి మూర్ఖుడి దగ్గర శంకర్ అసిస్టెంట్‌గా చేరటంతో హింస మొదలయ్యింది. ప్రతిసారీ శంకర్ బలయిపోయేవాడు. ప్రతి ఒక్కడూ 'అరే... ఒరే' అనేవాళ్ళు. రాత్రిళ్ళు ఫ్లాట్‌కు వచ్చిన తర్వాత వంటరిగా తనలో తను ఏడ్చుకునేవాడు. జరుగుతున్నదంతా చెబుదామంటే స్వామీజీ స్టోరీ సిట్టింగులో బిజీగా వుంటున్నాడు. రాత్రి కూడా ఫ్లాట్‌కు రాకుండా గెస్ట్‌హౌస్‌లోనే పడుకుంటున్నాడు. ఇదంతా స్వామీజీకి చెప్పాలా! వద్దా! అన్న సందిగ్ధం... తను కష్టపడి అసిస్టెంట్ డైరెక్టర్‌గా చేరిస్తే మూడురోజులకే ఫిర్యాదులు చెబుతున్నాడని అనుకుంటాడేమోనన్న శంక... ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం అనేవి సిన్మా ఫీల్డులో ప్రారంభదశలో ప్రతి బంధకమవుతాయనీ, ఒకవేళ వున్నా అవి బైటకు ప్రదర్శించకుండా అందరితో యాక్టింగ్ చేయాలని అతనికి తెలీదు. అతనికి తెలిసిందల్లా ఒకటే తను ఏదైతే ఫీలవుతాడో దాన్ని ముఖంమీదే చెప్పేయటం.

నాలుగోరోజు అగ్నిపర్వతం బద్దలయ్యింది.

ఆరోజు అందరికంటే గంట ముందుగానే షూటింగ్ లొకేషన్‌కు చేరుకున్నాడు. ఆరోజు ముఖ్యమైన సీన్స్ అంటే హీరో, హీరోయిన్ లవ్‌లో పడటం తాలూకు సీన్స్ కాబట్టి డైరెక్షన్ డిపార్ట్‌మెంట్ శ్రద్ధగా వుండాలని ముందురోజే చంద్రశేఖరం పదే పదే చెప్పాడు. అందుకే శంకర్ ఉత్సాహంగా వచ్చాడు. షూటింగ్ అంటే అతను పూర్తిగా విరక్తిచెందాడని కాదు. ఎన్నో





హేళనలూ, వ్యంగ్యాలూ, తిట్లూ భరిస్తూ కూడా 'ఏదైనా నేర్చుకోగలనా?' అని నిరంతరం అబ్ జర్వ్ చేస్తూ వుండేవాడు. ముఖ్యంగా అతనికి షూటింగ్ వాతావరణం, ఆ హడావుడి, కష్టపడటం అంటే చాలా చాలా ఇష్టం. ఎవ్వరూ దరిద్రంగా ప్రవర్తించకపోతే ఇరవై నాలుగు గంటలు షూటింగ్ చేద్దామన్నా అతను రెడీనే.

తొమ్మిదిన్నరకి ఫస్ట్ షాట్ తీశారు.

రెండోషాట్ కు సన్నాహాలు జరుగుతుండగా వేరే అసిస్టెంట్ డైరెక్టర్ వచ్చి క్లాప్ బోర్డ్ తీసుకున్నాడు. శంకర్ ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు. గత మూడు రోజులుగా అతనే క్లాప్ కొడుతున్నాడు. మరిప్పుడు క్లాప్ బోర్డ్ సుదర్శనం ఎందుకు తీసుకున్నట్లు?

సుదర్శనం వెకిలిగా నవ్వుతూ చెప్పాడు. "నిన్ను డైరెక్టర్‌గారు రమ్మంటున్నారు"

శంకర్ డైరెక్టర్ వున్నవైపు నడిచాడు. చంద్రశేఖరం చెట్టునీడలో కుర్చీలో కూర్చుని హీరోతో మాట్లాడుతున్నాడు. "మన సిన్మా జూబ్లీగ్యారంటీ సార్" అంటున్నాడు, ఆ బీగ్రేడ్ హీరో మనస్సులో నవ్వుకుంటున్నాడు. సిన్మాలు లేకపోబట్టి కానీ చంద్రశేఖర్ డైరెక్షన్‌లో చచ్చినా చేసేవాడుకాదు. పరిశ్రమ దృష్టిలో చంద్రశేఖరం 'వట్టిపోయిన గేదె'లాంటివాడు.

"సార్..."

చంద్రశేఖరం తలతిప్పి శంకర్‌వైపు విసుగ్గా చూశాడు "ఏంటీ?"

"రమ్మన్నారట సార్"

"నిన్నా?"

"అవును సార్... సుదర్శనంగారు చెప్పారు, క్లాప్ బోర్డ్ తీసుకున్నారు"

"చూశారా సార్" డైరెక్టర్ హీరో వైపు తిరిగి అన్నాడు. "సుదర్శనం క్లాప్ బోర్డ్ తీసుకున్నాడని వీడు సింహాసనం కోల్పోయిన చక్రవర్తిలా ఎలా ముఖం పెట్టాడో?"

హీరోగారు చిన్నగా నవ్వాడు.

శంకరానికి మనస్సులో భగ్గుమంది. అయినా తమాయించుకున్నాడు.

"షఫీగాడు అమ్మగారు పిలిస్తే ఇంటికెళ్ళాడు. నువ్వు నా ప్రక్కనే వుండు" అన్నాడు.

శంకర్ తలవూపాడు. షఫీ చంద్రశేఖరం పర్సనల్ బాయ్.

క్లాప్‌బోర్డ్‌నుంచి డైరెక్టర్ అడిగినప్పుడల్లా సిగరెట్లు, గుట్కాలు, టీలు, జ్యూస్‌లు అందించే స్థాయికి దిగజారింది శంకర్ పరిస్థితి. ఇంకో అరగంటలో లంచ్ బ్రేక్ ఇస్తారనగా జరిగిందా సంఘటన.

చంద్రశేఖరం విపరీతంగా గుట్కాలు తింటాడు. గుట్కాలు తిని ఎక్కడబడితే అక్కడ వూస్తుంటే సిన్మాస్టూడియోవాళ్ళు మర్యాదగా చెప్పారు. అప్పటినుంచీ చంద్రశేఖరం గుట్కా తిని ఉమ్మివేసేటపుడు పక్కనే ఆయన అసిస్టెంట్ షఫీ పెద్ద ప్లాస్టిక్ డబ్బా పట్టుకుని నిలబడితే చంద్రశేఖరం ఆ డబ్బాలో ఉమ్ముతాడు.

ప్రస్తుతం షఫీ లేడు కాబట్టి ఆ డబ్బా శంకర్ చేతిలో వుంది. ఆ డబ్బా పట్టుకున్న శంకర్ని చూసి అందరూ నవ్వుకుంటున్నా శంకర్ మాత్రం నిర్వికారంగా నిలబడి వున్నాడు.

చంద్రశేఖరం విసుగ్గా, చిరాగ్గా వున్నాడు. హీరోయిన్ టేకులు కేకుల్లా తింటోంది. హీరోయిన్ని తిట్టలేడు. మింగలేడు, కక్కలేడు... అదే షాట్ పన్నెండో టేక్ చేస్తుండగా చంద్రశేఖరం గుట్కా నమిలి డబ్బాలో ఉమ్మాడు. అదే సమయంలో శంకర్ దృష్టి అంతా హీరోయిన్‌మీదకాదు కదులుతున్న కెమేరా ట్రాలీ మూమెంట్‌మీద వుంది.

హీరోయిన్‌మీద కోపం ఎవరిమీద చూపించాలో తెలీక చిరాగ్గా వున్న చంద్రశేఖరం గట్టిగా కేకపెట్టాడు శంకర్‌మీద. "నీయమ్మా... లం... కొడకా... డబ్బా సరిగ్గా పట్టుకోరా డబ్బానాకొడకా!"

శంకర్ తల తిప్పి డైరెక్టర్‌వైపు చూశాడు.



అతని కళ్ళు ఎర్రబడ్డాయి. సహనం చెలియలి కట్టదాటింది. అప్పుడు బలంగా విసిరేశాడు చేతిలో వున్న ప్లాస్టిక్ డబ్బా డైరెక్టర్ ముఖంమీదకు.

గుట్కా ఉమ్మితో నిండి వున్న డబ్బా డైరెక్టర్ నెత్తిమీద ధారగా ఉమ్మి అభిషేకంలా పడింది. ముఖం, వళ్లూ, బట్టలూ అన్నీ గుట్కా ఉమ్మి పడి అసహ్యంగా మారిపోయాయి. చంద్రశేఖరం స్వరూపం వికృతంగా మారింది.

జరిగింది ప్రత్యక్షంగా చూసిన ఆ సిన్మా యూనిట్ మొత్తం షాక్‌తో ఫ్రీజయిపోయింది.



"నువ్వు ఈ జన్మలో బాగుపడవు"

"... ...."

"అసలు నువ్వెవరు? నీకూ నాకు ఏమిటీ సంబంధం? నువ్వేమన్నా నా తమ్ముడివా? నిన్ను అంతకంటే ఎక్కువగానే చూసుకున్నాను. అయ్యోపాపం ఓ మంచి టాలెంట్ వున్న కుర్రవాడు డిప్రెషన్‌లోకి జారిపోతూ సర్వనాశనం అయిపోతున్నాడే అన్న జాలితో నీకు ఆశ్రయం ఇచ్చాను. నాలాగా కష్టపడకూడదు కాబట్టి నిన్ను ఆదుకున్నాను. రాయటం ఏమిటో నేర్పాను. కానీ నువ్వేం చేశావు? సిన్మా కథ చెప్పమని పంపితే వాళ్లను బండబూతులు తిట్టివచ్చావు.

అడ్డమైనవాడికాళ్లూ పట్టుకుని చంద్రశేఖరం దగ్గర అసిస్టెంట్ డైరెక్టర్‌గా జాయిన్ చేస్తే ఆయన్ని కొట్టావు. ఏమనుకుంటున్నావు నువ్వు? నువ్వేమన్నా సలీంజావేద్ అనుకుంటున్నావా? పరుచూరి బ్రదర్స్ అనుకుంటున్నావా? మణిరత్నం అనుకుంటున్నావా? రామ్‌గోపాల్‌వర్మలా ఫీలవుతున్నావా?

ఆఫ్ట్రాల్ శంకర్...

ఇండస్ట్రీలో ఎవడినైనా అడుగు నీ పేరు... ఎవ్వరూ గుర్తించరు. ఎవ్వడికీ తెలీదు. మహామహులే ఇక్కడ వళ్ళు దగ్గరపెట్టుకుని ప్రవర్తిస్తారు. ఆఫ్ట్రాల్ నువ్వెంత? అంత పౌరుషం వున్నవాడివి నీ ఇంట్లో నువ్వు కూర్చోవాలిసింది. ఇక్కడకు రావటం ఎందుకు! నన్ను చంపటం ఎందుకు? నీవల్లే నేను తల ఎత్తుకోలేని పరిస్థితి వచ్చింది. ఆ నిర్మాతలు సగం ఇండస్ట్రీకి చెప్పారు. ఇప్పుడు చంద్రశేఖరం మిగతావాళ్ళకు నీ గురించీ, నా గురించీ బాడ్‌గా ప్రచారం చేస్తాడు. నీ కారణంగా నేను కూడా నాశనం అయిపోతాను. నేను అరుస్తుంటే నువ్వు మాట్లాడవేంటీ? "

"ఆయన క్లాప్ బోర్డ్ తీసేసి నా చేతిలో గుట్కా ఉమ్మే డబ్బా పెట్టాడు సార్"

"అసిస్టెంట్ డైరెక్టరంటే కుర్చీవేసి కూర్చోబెడతారనుకున్నావా? అన్నీ చేయాలి. నా నోటితో చెప్పలేను కానీ మందు బాటిల్స్ నుంచి పక్కలేసే పనిదాకా కొంతమంది అసిస్టెంట్ డైరెక్టర్లు చేస్తారు తెలుసా నీకు? " స్వామీజీ హైపిచ్‌లో అరుస్తూ అన్నాడు. స్వామీజీకి వళ్ళు మండిపోతోంది. ఎవరితను? డైరెక్టర్‌ను కొడతాడా? అసలు తనదే తప్పు. మూర్ఖుడిలా జాలిపడి నెత్తినెక్కించుకున్నాడు. తను జాలిపడటం ఎందుకు. దారినపోయే దరిద్రాన్ని




నెత్తినెక్కించుకోవటం ఎందుకు? ఎంత మంది ప్లాట్‌ఫారాలమీద చావటంలా తన కెందుకు? వీడిని పక్కన పెట్టుకుంటే తనకు కూడా ఇండస్ట్రీలో మంచినీళ్ళు పుట్ట కుండా చేస్తాడు. మూర్ఖుడు... ఇడియట్... రాస్కెల్... వీడిని అర్జంటుగా తన ఫ్లాట్‌లోంచి బైటకు గెంటేయాలి.

శంకర్ కింద కూర్చుని వున్నాడు. స్వామీజీ ఆవేశంతో తిడుతూ అటూఇటూ తిరుగుతున్నాడు. ఆవేశం కాదు మండిపడుతున్నాడు. శంకర్ తల ఎత్తి సూటిగా స్వామీజీవంక చూశాడు. అతని ముఖం నిర్వికారంగా వుంది. ప్రచండమైన తుపాను వీచి సర్వం తీసుకుపోయిన తర్వాత తన పొలాన్ని చూసుకునే రైతు ముఖంలా వుంది. దుఃఖం, వేదన, నిస్పృహ యతా, ఉక్రోషం నిండిన స్వరంతో అన్నాడు 'సార్... నేను చాలా ఆశలుపెట్టుకుని సిన్మా పరిశ్రమలోకి వచ్చాను. నా ఆశలు అడియాశలైపోయాయి. నేను ఆత్మహత్య చేసుకోకుండా మీరు ఆదుకుని రక్షించారు. అన్నం పెట్టి ఆశ్రయం ఇచ్చారు. విద్యనేర్పారు. మీరు నాకు గురువు. మీరేంచెప్పినా, ఏం తిట్టినా పడతాను. మిగతా అసిస్టెంట్ డైరెక్టర్లలాగా పక్కలేయలేకపోయినా గుట్కా ఉమ్మి డబ్బా పట్టుకుంటాను. ఛీ... ఛా... అరే! ఒరే! అంటున్నా భరిస్తాను. హేళన చేసినా, బూతులు తిట్టినా గజ్జికుక్క కంటే నీచంగా ఛీదరించుకున్నా సహిస్తాను. ఎందుకంటే ఇండస్ట్రీ ఇలా వుంటుందని నాకు తెలీదు. కలలుకంటూవచ్చాను. ఇంట్లోంచి పారిపోయివచ్చాను. నేను అనుభవించాలి. అనుభవించి తీరాలి. ఎందుకంటే ఇది నేను కోరుకున్న జీవితం కాబట్టి. సిగ్గూ, శరం, నీతి, నిజాయితీ, పౌరుషం మర్చిపోయి బతకాలి. బతుకుతాను. ఇంత అద్భుతం కోసమే కదా సార్ నేను ఇంట్లోంచి పారిపోయి వచ్చింది. అందుకే బతికి తీరాలి. కానీ సార్...

"మా అమ్మ ఏం చేసింది సార్? వాడు లంజాకొడకా అని తిట్టాడు.

నాలాంటి దౌర్భాగ్యుడిని కన్నందుకు వాళ్ళు అనుభవించే క్షోభ చాలదా సార్? మళ్ళీ ఎవడో నా తల్లిని తిడతాడా? మా ఇంటికి నేనే ఏకైక మగపిల్లాడిని.

"తల్లిదండ్రులకు అండగా వుండవల్సిన వాడిని. సిన్మాపిచ్చిలో పడి దుర్మార్గంగా వాళ్లనూ నా బాధ్యతలనూ వదిలేసి పారిపోయి వచ్చాను. అందుకు నన్ను చెప్పుతో కొట్టినా, కత్తితో నరికినా తప్పులేదు. నేను చేసిన తప్పు అలాంటిది. కానీ మా అమ్మ ఏం చేసింది సార్?

"వాడు నన్ను కొట్టినా, నరికినా, ముఖాన ఉమ్మినా భరిస్తా... కానీ నా తల్లిని ఎందుకు తిట్టాలి సార్? దుఃఖంతో అతని గొంతు గద్గదమయ్యింది.

"మా అమ్మ ఎక్కడో పల్లెటూర్లో వుంది సార్. నేను ఎప్పటికైనా తిరిగి ఇంటికొస్తానని కళ్ళలో వత్తులేసుకుని ఎదురు చూస్తూ వుంటుంది. ఇరవై మూడేళ్ళు వచ్చినా పసి పిల్లాడిలా చూసుకునేది. మీగడ పెరుగేసి పెట్టి నిద్రపోయేదాకా కబుర్లు చెబుతూ జోకొట్టేది. మా అమ్మ ఎంతమంచిదో తెలుసా సార్. మా అమ్మేంటి. ఏ అమ్మ అయినా మంచిదే సార్. ప్రేమించటం తప్ప తల్లికి ఏం తెలుస్తుంది సార్. అటువంటి అమ్మను... అమ్మను వాడు... ఆ బ్లడీకుక్క తిడతాడా!" శంకర్ గొంతులో ఒక్కసారిగా రౌద్రం తొంగిచూసింది "అందుకే వాడ్ని కుక్కను కొట్టినట్లు బాదాను. యూనిట్‌వాళ్ళు అడ్డుపడుండక పోతే చంపేసేవాడిని. నేనూ నా లక్ష్యం, ఈ సిన్మాలూ అన్నీ సర్వనాశనం అయిపోయినా ఐ డోంట్‌కేర్. నా తల్లిని తిడితే మాత్రం వాడు ఎవడైనా సరే వాడిని ముక్కలుగా నరుకుతాను"

ఓ బలమైన కెరటం వచ్చి ఫెడేల్మని కొట్టినట్లుగా స్వామీజీ దిగ్భ్రాంతి చెందాడు.

శంకర్ డైరెక్టర్‌ని కొట్టటం వెనుక వున్న విషయం ఇదా?

చంద్రశేఖరం లంజాకొడకా అని శంకర్ని తిట్టాడా?

ఎంత దారుణం? అసిస్టెంట్ అయినంత మాత్రాన అలా తిట్టే హక్కు ఎవడిచ్చాడు?

శంకర్ ఆవేశపడటంలో ఆశ్చర్యం ఏముంది? తల్లిని తిట్టినా భరించేవాడు మగవాడు ఎలా అవుతాడు?

దాదాపు సంవత్సరంనుంచీ శంకర్ తనతో వుంటున్నాడు. ఏనాడైనా తన పరిధిని అతిక్రమించి ప్రవర్తించాడా? లేదు. ఏనాడైనా ఎవరితోనయినా గొడవపెట్టుకున్నాడా? లేదు. అనవసరమైన గొడవల్లో తలదూర్చాడా? లేదు. తన పనేంటో తను చూసుకుంటూ వుండేవాడు. మొదటిరోజు ఎంత నమ్రతగా, గౌరవంగా, ఒద్దికగా వున్నాడో ఈరోజుకీ అలాగే వున్నాడు. అతని వయస్సువాళ్ళంతా రోడ్లమీదా, ఇరానీ కేఫుల దగ్గరా తిరుగుతుంటే అతను మాత్రం చదువుకుంటూ, రాసుకుంటూ, సిన్మాలు చూసుకుంటూ వుండేవాడు.

ఈ ఇండస్ట్రీ స్వరూపం తనకు తెలియంది ఏముంది?

ఇంత వుంటే అంతచేసి చెబుతారు. ఎవరితో అవసరం వుంటే వాళ్లను వెనకేసుకువస్తారు. డైరెక్టర్ని కొట్టాడు అంటారే కానీ ఎందుకు కొట్టాడని అడుగుతారా? అడగరు... తెల్సినా నోరు విప్పరు. ఎందుకంటే శంకర్‌తో కంటే చంద్రశేఖరుతో అవసరం ఎక్కువ కాబట్టి. అందరిదాకా ఎందుకూ? తను మాత్రం ఎలా ప్రవర్తించాడు? డైరెక్టర్ని కొట్టాడని తెలీగానే మండిపడలేదూ? వీడిని తన ఫ్లాట్‌లోంచి బైటకు గెంటేయాలనుకోలేదూ? ఆ క్షణం స్వామీజీకి తన మీద తనకే అసహ్యం వేసింది.

స్వామీజీ లోపల జరుగుతున్న భావ సంచలనాన్ని పట్టించుకోకుండా శంకర్ ఏదో ట్రాన్స్‌లో వున్నట్లుగా చెప్పుకుపోసాగాడు.

"నా కారణంగా మీరు సమస్యలు ఎదుర్కోవటం నాకిష్టంలేదు సార్. ఇంతకాలం మీరు ఎంతో దయతో ఆదరించి అన్నం పెట్టారు. మీ రుణం ఎప్పటికీ తీర్చుకోలేనిది. నేను ఇక్కడ వుండలేను సార్. మీమీద కోపంతో వెళ్ళిపోతున్నాననుకోకండి. మిమ్మల్ని అనవసర వివాదల్లోకి లాగటం ఇష్టంలేక మీకు దూరంగా వెళ్ళిపోతున్నాను. నన్ను క్షమించండి సార్. మీకు ఇబ్బంది కలిగించినందుకు నన్ను క్షమించండి.

"కానీ సార్. నేను తిరిగి మావూరెళ్ళిపోతాననుకోకండి.

ఇక్కడే వుంటాను. ఇదే ఇండస్ట్రీలో వుంటాను.

"కప్పులు కడుగుతాను. కూలిపని చేసి నన్ను నేను పోషించుకుంటాను. డైరెక్టర్ కావటం అనేది నా జీవిత లక్ష్యం. దాన్ని సాధిస్తాను. డైరెక్టర్ అయితీరుతాను.

"ఇంత జరిగాక నిన్ను ఎవడు అసిస్టెంట్ డైరెక్టర్‌గా పెట్టకుంటాడని మీరు అడగచ్చు. అక్కర్లేదు సార్... నన్ను ఎవ్వరూ పెట్టుకోనవసరంలేదు. నేను ఎవ్వరిదగ్గరా చేరను.

"డైరెక్షన్ అనేది క్రియేటివ్ జాబ్. అది నేర్చుకుంటే వచ్చేది కాదు. నేర్చుకుంటేనే డైరెక్టర్ అయిపోతే పెద్దపెద్ద డైరెక్టర్ల దగ్గర అసిస్టెంట్లుగా చేస్తున్నవాళ్ళంతా కూడా ఈపాటికే పెద్ద డైరెక్టర్లయిపోవాలిగా?

"ఈ విషయం తెల్సుకోవటానికి నాకు రెండేళ్ళు పట్టింది.

"ఎవ్వరిదగ్గరా అసిస్టెంట్‌గా చేయకుండా డైరక్టర్లయిన వాళ్ళు లేరా సార్. వున్నారని మీకు తెలుసు. వాళ్ళే నాకు స్ఫూర్తి, ఆదర్శం.

"ఏకలవ్యుడు ద్రోణాచార్యులవారి విగ్రహాన్ని ప్రతిష్టించి విలువిద్య నేర్చుకున్నట్లుగా ఓ హిచ్‌కాక్‌నీ, ఓ అకిరాకురుసోనానీ,




ఓ రాజ్‌కపూర్‌నీ, ఓ సత్యజిత్‌రేనీ, ఓ బిమల్‌రాయ్‌నీ, ఓ కె.వి. రెడ్డినీ, ఓ మణిరత్నాన్నీ నా గుండెల్లో ప్రతిష్టించుకుని డైరెక్టర్ని అవుతాను.

"ఒకప్పుడు కేవలం లక్ష్యం మాత్రమే వుండేది. ఇప్పుడు కసి కూడా వుంది. నన్ను అవమానించిన వాళ్ళకు సరైన సమాధానం చెప్పాలంటే నేను డైరెక్టర్ని అయితీరాలి. సక్సెస్ పొంది తీరాలి. నేను సాధిస్తాను సార్. సాధించి తీరుతాను. ఈ ప్రపంచంలో ఏ శక్తి నన్ను నా లక్ష్యాన్నుంచి దూరంచేయలేదు. ఇది ఈ దుర్మార్గులూ, మూర్ఖులతో నేను చేస్తున్న ఛాలెంజ్"

శంకర్ ఇంకా మాట్లాడుతూనే వున్నాడు.

నీరు నిండిన కళ్ళతో స్వామీజీ రెప్పవేయకుండా శంకర్‌వైపే చూస్తుండిపోయాడు.

★ ★ ★

పద్దెనిమిది నెలలు గడిచిపోయాయి.

ఈకాలంలో శంకర్ సాధించింది ఏమీ లేదు. సాధించనిది కూడా లేదు. అతని నిరంతర సాధనా, కృషీ కొనసాగుతూనే వుంది. అతను ఇంకా స్వామీజీ ఫ్లాట్‌లోనే వున్నాడు. స్వామీజీ క్షమాపణ చెప్పటంవల్ల ఫ్లాట్ వదిలి వెళ్ళిపోవాలన్న నిర్ణయాన్ని మార్చుకున్నాడు. కానీ స్వామీజీ మీద ఆర్థికంగా ఆధారపడి వుండకూడదన్న నిర్ణయం తీసుకున్నాడు. నెల తిరిగేసరికల్లా తన ఖర్చులకు సంపాదించుకోవటం ప్రారంభించాడు.

అది ఘోస్ట్ రైటింగ్‌వల్ల సాధ్యపడింది.

కొంతమందికి విపరీతమైన దురద వుంటుంది. టాలెంట్ మాత్రం వుండదు. తెరమీద మాత్రం కథ, మాటలు, పాటలు, సంగీతం, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ఇంకా ఏమైనా వీలయితే అవి కూడా తమ పేరు మీద కనపడాలనుకుంటారు. ఇండస్ట్రీలో అటువంటి వాళ్ళ సంఖ్య తక్కువేమీ కాదు కాబట్టి ఘోస్ట్ రైటర్స్ బతుకుతూ వుంటారు. ఘోస్ట్ రైటర్స్ అంటే నిజానికి రాసేది వాళ్ళు. తెరమీద మాత్రం వేరేవాళ్ళ పేరు కన్పిస్తుంది. ఘోస్ట్ రైటర్స్ పేరుకంటే డబ్బుకు ప్రాధాన్యత ఇస్తారు. వాళ్ళ అవసరం వాళ్ళది. వీళ్ళ అవకాశం వీళ్ళది.

శంకర్ సీన్స్ రాసి ఇవ్వగానే ఏ వెయ్యో, రెండువేలో చేతిలో పెట్టేవాళ్ళు. నిజానికి అది చాలా తక్కువ. కానీ తప్పదు. ఎవడి సంపాదన వాడు సంపాదించుకుని బతకటం అనేది జీవితంలో ఎదిగేదశలో ముఖ్యమైన పరిణామం. అందుకే ఘోస్ట్ రైటింగ్ అనేది ఏమాత్రం ఇష్టం లేకపోయినా తప్పలేదు.

ఫ్లాట్ అద్దె తాలూకు తన సగం డబ్బులు శంకర్ ఇచ్చేసరికి స్వామీజీ అంగీకరించలేదు. డబ్బులు తీసుకుంటేనే తను ఫ్లాట్‌లో వుంటానని శంకర్ ఖరాఖండిగా చెప్పేసరికి తీసుకోక తప్పలేదు.

కాలం సాగుతూనే వుంది.

ఘోస్ట్ రైటింగ్‌వల్ల ఇండస్ట్రీలో నలుగురికీ శంకర్ పేరు కొద్దికొద్దిగా తెలీటం మొదలయ్యింది. బాగా రాశాడు. అనుకున్న టైంకల్లా రాసి ఇచ్చేస్తాడు. డబ్బు కోసం హింసించడు. ఎంత ఇచ్చినా తీసుకుంటాడు. నీచమైన రాజకీయాలు నడపటం, చాడీలు చెప్పటం, వెనుక విమర్శించటం లాంటివి చేయకుండా తన పని తాను చేసుకుంటాడన్న పేరుపడింది.

ఏ రంగంలో కూడా అందరూ చెడ్డవాళ్ళే వుండరు. అదేవిధంగా అందరూ మంచి వాళ్ళే కూడా వుండరు. రాజకీయాలు చేస్తూ, ఎదుటివాళ్ళ జీవితాలతో ఆడుకుని సంతృప్తి చెందే శాడిస్టుల సంఖ్య ఎక్కువైనా కొద్దిమందయినా కూడా ఏమాత్రం ప్రతిభ కన్పించినా మెచ్చుకుని ప్రోత్సహించేవాళ్ళు వుంటారు.

శంకర్ సిటీకి వచ్చిన మూడున్నర సంవత్సరాల తర్వాత అటువంటి అవకాశం ఒకటి వచ్చింది.

రామ్మోహనరావు ఓ మోస్తరు నిర్మాత.

భారీ సిన్మాలు కాకపోయినా సంవత్సరానికి ఒకటైనా చిన్న సిన్మా తీస్తాడు. ఆ బ్యానర్‌కు పెద్ద పేరూ లేదు. అలాగని నెగెటివ్ కూడా లేదు. పనిచేయించుకున్నవాళ్ళెవ్వరికీ డబ్బులు ఎగ్గొట్టరు. గతంలో రెండు మూడు సిన్మాలకు శంకర్ ఘోస్ట్ రైటర్‌గా పనిచేశాడు. ఆవిధంగా రామ్మోహనరావు పరిచయమే.

ఓరోజు రామ్మోహనరావు అడిగాడు.

"ఎంతకాలం ఇలా ఘోస్టుగా వుండిపోతావయ్యా? "

"ఏం చేస్తాం సార్... బతకటం కోసం తప్పదుగా"

"నీ దగ్గరేదైనా మంచి సబ్జెక్ట్ వుందా? "

"వుంది సార్... కానీ అవకాశం ఇచ్చేవాళ్ళేరీ? " అన్నాడు శంకర్ నిరాశగా.

"అందరినీ ఒకే గాటన కట్టమాకు. ముందు నీ సబ్జెక్ట్ చెప్పు. నచ్చితే నేనే అవకాశం ఇస్తాను" అన్నాడు రామ్మోహనరావు.

శంకర్‌కు నమ్మకం లేదు.

అటువంటి అనుభవాలు చాలా జరిగాయి. నోరు నొప్పి పుట్టించేలా వాగించటం, ఆ తర్వాత సబ్జెక్ట్‌లోని మంచి పాయింట్లు కొట్టేయటం... ఇదంతా మామూలే. అందుకే ఎవరికైనా సబ్జెక్ట్ చెప్పాలంటే భయం. కానీ రామ్మోహనరావు నోరు తెరిచి అడిగాడు. చెప్పనంటే బాగుండదు. అందుకే ఇష్టం లేకపోయినా సబ్జెక్ట్ చెప్పాడు.

చెప్పటం అయిపోయిన తర్వాత రామ్మోహనరావు ఓ పేపర్ శంకర్ ముందు పెట్టి "సంతకం పెట్టు..." అన్నాడు.

"ఎందుకు సార్? " శంకర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"అంటే ఎగ్రిమెంట్ లేకుండానే సబ్జెక్ట్ ఇచ్చేస్తారా? " అన్నాడు.

"ఎగ్రిమెంటా? " మరింత ఆశ్చర్యంగా అడిగాడు.

"అవునయ్యా... ఇంకా అర్థం కాలేదా? నీ సబ్జెక్ట్ నేను తీసుకుంటున్నాను. కథ, మాటలు నువ్వే... యాభైవేలు ఇస్తాను. నీకు చెక్ కావాలా, క్యాషా? "

శంకర్ నోటివెంట మాటలు రానట్లుగా వుండిపోయాడు.

"నీకు బ్యాంక్ అక్కౌంటుందా? "

"లేదు సార్? "

ఆయన అర్థమయినట్లుగా నవ్వి జేబులోంచి పెద్ద నోట్ల కట్టతీసి నోట్లు లెక్కపెట్టి "ఇది అడ్వాన్సు..." అంటూ ఇచ్చాడు.

శంకర్ వణుకుతున్న చేతులతో తీసుకున్నాడు.

నలభై కొత్తనోట్లు తళతళమంటూ మెరుస్తున్నాయి. ఐదువందల రూపాయల నోట్లు...

ఇరవైవేలు.

అప్రయత్నంగా అతని కళ్ళవెంట నీళ్లొచ్చాయి. సబ్జెక్ట్ తీసుకుంటారా? పెడతారా అన్న అపనమ్మకంతో కథ చెప్పాడు. అది ఓకే అయింది. రక్తం పెట్టి చెప్పిన సబ్జెక్టులు విని జనం పెదవి విరిచారు. అందుకే అంటారు ఎప్పుడు ఏం జరుగుతుందో తెలీదని. తన కథ సిన్మాకు తీసుకున్నారు. ఇరవైవేలు అడ్వాన్స్ ఇచ్చారు.

రెక్కలు కట్టుకుని ఆకాశంలో ఎగరాలనిపించింది శంకర్‌కు ఆ క్షణంలో.

"ఈరోజునుంచీ సబ్జెక్ట్ బాగా వర్కవుట్ చేయి. డైరెక్టర్‌తో కూర్చున్నాక షూటింగ్ షెడ్యూల్స్ ప్లాన్ చేద్దాం..." అన్నాడు రామ్మోహనరావు.

అలాగేనన్నట్లు తల ఆడించి ఆయనకు నమస్కారం పెట్టి ఆఫీసులోంచి బైటకు వచ్చి నేరుగా ఫ్లాట్‌కు వెళ్ళాడు. స్వామీజీ లేడు. కాసేపు ఆనందంతో ఫ్లాట్‌లో అటూ ఇటూ తిరిగాడు. మనస్సు ఆనందంతో పరవళ్ళు తొక్కుతోంది. ఇంతకాలానికి మంచిరోజులు రాబోతున్నాయి. తన కథ సిన్మాగా తెరమీద కనబడబోతోంది. కథ, మాటలు శంకర్... తల్లిదండ్రులూ, చెల్లెలూ, చందూ




అందరూ ఎంత సంతోషిస్తారో? ఈ కథ తప్పకుండా హిట్టవుతుంది. తనకా నమ్మకం ఉంది. ఒక్క సిన్మా హిట్టయితే చాలు పెద్ద నిర్మాతలు తనను గుర్తిస్తారు"

ముందు కథకుడిగా... ఆ తర్వాత డైరెక్టర్‌గా.

అసలు ఇదంతా నిజమా లేక తను కలగంటున్నాడా?

జేబులోంచి కొత్త నోట్లు తీసి పదేపదే చూసుకున్నాడు. ఇరవైవేలు. వెయ్యి, రెండువేలే కానీ తన జీవితంలో స్వశక్తితో, టాలెంట్‌తో ఇంత పెద్ద మొత్తం సంపాదించటం ఇదే మొదటిసారి. సక్సెస్ తాలూకు ఆనందం, సంతృప్తి ఎంత అద్భుతంగా వుంటుందో అతను అనుభవిస్తున్నాడు.

సాయంత్రం స్వామీజీ ఫ్లాట్‌కు రాగానే విషయం చెప్పాడు.

"నిజంగానా?" స్వామీజీ అంతా విని ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును సార్... ఇరవైవేలు అడ్వాన్సు కూడా ఇచ్చారు. కావాలంటే చూడండి..." అంటూ పెళపెళమంటూ మెరుస్తున్న నోట్లు తీసి చూపించాడు. స్వామీజీ చాలా ఆనందించాడు. "కంగ్రాచ్యులేషన్స్ శంకర్. నీకు మంచిరోజులు స్టార్ట్ అయ్యాయి. ఇక నిన్ను ఎవ్వరు ఆపలేరు" అన్నాడు మనస్ఫూర్తిగా.

సిన్మా ఇండస్ట్రీలో ఎదుటివాడి సక్సెస్ చూసి ఏడ్చేవాళ్ళే కానీ ఆనందించి అభినందించేవాళ్ళు తక్కువ.

శంకర్ పదివేలు లెక్కబెట్టి స్వామీజీకి ఇవ్వబోయాడు.

"ఎందుకు?"

"ఇంతకాలం మీకు చాలా ఋణపడ్డాను సార్. ఆ ఋణం తీర్చుకోనివ్వండి. తీసుకోండి..."

"వద్దు. నీ దగ్గరే వుంచు" అన్నాడు స్వామీజీ నవ్వుతూ, "డబ్బులొస్తే దాచుకునే వాళ్ళనూ, మజా చేసేవాళ్ళనూ చూశాను కానీ నీలాంటివాడిని చూళ్ళేదు. అవసరం అయితే అడిగి తీసుకుంటాను. ఆల్ ది బెస్ట్"

ఆరోజునుంచీ శంకర్ తదేక దీక్షతో స్క్రిప్ట్‌మీద కూర్చుని వర్క్ చేయటం ప్రారంభించాడు. రచయితగా ఇది తనకు సువర్ణ అవకాశం. సబ్జెక్ట్ ఎంత బాగా డీల్ చేస్తే సిన్మా సక్సెస్ అంత ఖాయమవుతుందన్న పట్టుదలతో సీన్స్, సంభాషణలు రాయటం ప్రారంభించాడు.

★ ★ ★

నాలుగు రోజుల తర్వాత.

సాయంత్రం ఆరున్నరయింది. చలికాలం కావటాన అప్పటికే బాగా చీకటిపడింది. శంకర్ ఫ్లాట్‌లో కూర్చుని దీక్షగా స్క్రిప్ట్ రాసుకుంటున్న సమయంలో కాలింగ్‌బెల్ మోగింది. శంకర్ లేచి వెళ్ళి తలుపు తీశాడు.

తలుపు తెరిచీ తెరవటం ఆలస్యం నలుగురు పోలీసులు బిలబిలమంటూ లోపలకు ప్రవేశించి సెర్చ్ చేయటం ప్రారంభించారు. శంకర్ నోటివెంట మాటలు రానట్లుగా చూస్తూ వుండిపోయాడు.

ఈలోగా కానిస్టేబుల్ లోపలనించి నోట్లు తెచ్చి యస్సైకి అందించాడు. యస్సై వాటిని చూడగానే విచిత్రంగా నవ్వి అడిగాడు.

"శంకర్ అంటే నువ్వేనా?"

"అవును సార్... ఇదంతా ఏమిటి?"

"ఆ డబ్బులు నీవేనా?"

"అవును... మీరు దేనికోసం వెదుకుతున్నారు ఇన్స్‌పెక్టర్?"

"అది పోలీస్‌స్టేషన్‌లో తెలుస్తుంది. యువార్ అండర్ అరెస్ట్"

"నేను... నన్ను అరెస్ట్ చేస్తున్నారా? దేనికి?" శంకర్ దిగ్భ్రాంతి చెందుతూ అడిగాడు.

"దొంగనోట్లు చెలామణీ చేస్తున్న నేరం

మీద నిన్ను అరెస్టు చేస్తున్నాను. నడువ్ స్టేషన్‌కి" యస్సై రఫ్‌గా శంకర్ మెడమీద చేయివేసి ముందుకు తోశాడు.

★ ★ ★

"ఏంట్రా నీ పేరు? "

"శంకర్..."

"చూస్తుంటే చదువుకున్నవాడిలాగా కన్పిస్తున్నావు ఈ దొంగనోట్ల రాకెట్ ఎప్పట్నుంచి నడిపిస్తున్నావురా? "

శంకర్ మాట్లాడలేదు.

ఫట్‌మంటూ భుజంమీద లాఠీదెబ్బ పడింది. బాధతో కళ్లవెంట నీళ్లు తిరిగాయి.

"అడుగుతుంటే మాట్లాడవేరా? "

"ఏం మాట్లాడమంటారు? " నిస్సహాయంగా అన్నాడు.

"నిన్నటినుంచీ గొంతు చించుకుని అరుస్తున్నాను. మీరు మళ్ళీ మళ్ళీ అదేప్రశ్న అడుగుతున్నారు. నేను క్రిమినల్‌ని కాను. దొంగనోట్లు చెలామణీ చేసే స్మగ్లర్ని కాను. రైటర్ని... రచయితని. నేను చెప్పిన సిన్మా సబ్జెక్ట్ నచ్చటంతో నిర్మాత నాకు ఇచ్చిన అడ్వాన్స్ అది. ఆ ఐదువందల నోట్లు దొంగనోట్లని మీరు చెప్పేదాకా నాకు తెలీదు"

ఏసీపీ నోరంతా తెరిచి విశాలంగా నవ్వాడు. "బాగుందిరా స్టోరీ... రైటర్వి కదా! బాగా అల్లావు. మాకూ ఓ రైటరున్నాడు. పోలీస్ కేసులు రాస్తాడు. అంతే కాదు. నిన్ను ఐదు నిమిషాలు అప్పగిస్తే నీ నోటివెంట నిజాలు కక్కిస్తాడు. మా రైటర్ని పిలవమంటావా? నిజం చెబుతావా? "

"సత్యప్రమాణంగా నేను చెప్పేది నిజం..."

"భగద్గీతమీద ఒట్టేసి పచ్చి అబద్ధాలు చెప్పే నా కొడుకులు తెలుసు నాకు. నీ ఒట్టు నమ్ముతాననుకోకు. మర్యాదగా మొత్తం అంతా చెప్పేయ్. మీ బాస్ ఎవరు? నోట్లు ఎక్కడ ప్రింటు చేస్తున్నారు? ఇంతవరకూ ఎన్ని ప్రింట్ చేశారు? ఎక్కడ మార్చారు? మీ గోడవున్ ఎక్కడ? "

అప్రయత్నంగా తెలీకుండానే అతనికి నవ్వొచ్చింది.

ఏసీపీ ఆశ్చర్యంగా చూశాడు. "ఎందుకురా నవ్వుతున్నావు? "

"నవ్వక ఏంచేయమంటారు? ఏడిస్తే వదిలేస్తారా? నేను నిర్దోషినని నమ్ముతారా? లేదు... స్క్రిప్ట్ రాసుకుంటున్నవాడిని పట్టుకొచ్చి మీ బాస్ ఎవడు? ఏ టెర్రరిస్ట్ గ్యాంగులతో సంబంధాలున్నాయని అడిగితే నేను ఏం చెప్పగలను? ఏడవలేక నవ్వటం అంటారు. అదీ నా పరిస్థితి..."

ఏసీపీ కనుగుడ్లు పెద్దవి చేసి క్రూరంగా చూశాడు శంకర్‌వైపు. "అంటే నీకేమీ తెలీదంటావా? "

"నిజంగా తెలీదు సార్... నన్ను నమ్మండి. అవి నిర్మాత నాకు అడ్వాన్స్ కింద ఇచ్చిన డబ్బు..."

"అంతేగానీ ఈ దొంగనోట్ల రాకెట్‌తో నీకేం సంబంధం లేదంటావు..."

"నేను ఏవిధంగా చెబితే మీరు నమ్ముతారో నాకు తెలీదు సార్... కానీ నేను చెప్పగలిగింది ఒక్కటే... దీంతో నాకు ఏ సంబంధమూ లేదు. నేను బాధ్యతాయుతమైన పౌరుడిని. బోగస్ ఫిల్మ్ఇన్స్టిట్యూట్ గురించి మీకు సంవత్సరన్నర క్రితం ఫోన్ వచ్చింది గుర్తుందా? "

ఏసీపీ ఒక్కసారిగా షాక్ తిన్నట్లుగా బిగుసుకుపోయాడు. ఆయన చాలా సిన్సియర్ పోలీస్ ఆఫీసర్. ఫోన్ గురించి రిసీవ్ చేసుకున్న ఆయనకు, చేసిన శంకర్‌కూ తప్ప ఎవ్వరికీ తెలీదు. అంటే ఇతగాడేనా ఆరోజు తనకు ఇన్ఫర్మేషన్ అందించింది? అన్న ఆలోచనలో పడ్డాడు. ఇతను కాకపోతే ఫోన్ గురించి ఎవ్వరికీ తెలిసే అవకాశం లేదు.

"నా కళ్లముందు ఎక్కడ అన్యాయం,





అక్రమం జరుగుతున్నా ఎదుర్కునే మన స్తత్వం నాది. అందుకే ఆరోజు నేను మీకు ఫోన్‌చేసి ఇన్ఫర్మేషన్ అందించింది. మీరు నా గురించి అడిగారు. అయినా నేను మీకు ఓ బాధ్యతాయుత పౌరుడిని అనే చెప్పాను. కానీ మీరు ఇచ్చే పోలీస్ అవార్డ్‌కోసం ఆశ పడలేదు. వంచనా, మోసం, ఛీటింగ్ నా రక్తంలో లేదు. అటువంటి నన్ను దొంగ నోట్ల కేసులో ఇరికిస్తారా?" ఆవేదనగా అన్నాడు శంకర్.

"ఏంట్రా కూస్తున్నావ్?" అంటూ యస్సై మళ్ళీ లాఠీ ఎత్తాడు.

ఏసీపీ కంటిసైగతో యస్సైను వారించాడు. "ఏం జరిగిందో మొత్తం అంతా వివరంగా చెప్పు" అన్నాడు.

శంకర్ అంతా చెప్పాడు. సిన్మా సబ్జెక్ట్ తీసుకోవటం, ఇరవైవేలు అడ్వాన్స్ ఇవ్వటం, పోలీసులు రైడ్ చేయటం అంతా చెప్పి అన్నాడు. "జరిగింది జరిగినట్లు చెప్పాను. అంతకుమించి నాకేం తెలీదు సార్..."

ఏసీపీ రెండు నిమిషాలు తీవ్రంగా ఆలోచించి అన్నాడు. "ఇప్పుడు నువ్వు చెప్పిందంతా స్టేట్‌మెంట్‌లాగా రాసి ఇచ్చి సంతకం చేయి..."

శంకర్ స్టేట్‌మెంట్ రాసి సంతకం చేసి ఏసీపీకి ఇచ్చాడు.

"ప్రస్తుతానికి నువ్వు వెళ్ళొచ్చుకానీ ఎప్పుడు పిలిస్తే అప్పుడు స్టేషన్‌కి రావాల్సివుంటుంది. సిటీ వదిలిపెట్టి వెళ్ళటంకానీ తప్పించుకోవాలన్న ప్రయత్నంకానీ చేస్తే జీవితాంతం కటకటాల వెనుకే వుండిపోతావు గుర్తుంచుకో... వెళ్లు" అన్నాడు ఏసీపీ.

స్టేషన్ బయట ఆత్రుతగా ఎదురుచూస్తున్న స్వామీజీ కన్పించాడు.

★ ★ ★

చాలా పెద్ద దొంగనోట్ల రాకెట్‌ని పోలీసులు పట్టుకున్నారు. రామ్మోహనరావు తప్పించుకున్నా అతని అనుచరులు, ప్రింటింగ్ మిషన్స్‌ను పోలీసులు పట్టుకోగలిగారు. ఈ కేసు చాలా సంచలనాన్ని సృష్టించింది. శంకర్‌ను పోలీసులు వదిలేయటం చూసి స్వామీజీ సంతోషించాడు. జరిగిందంతా స్వామీజీకి చెప్పాడు.

"భయపడకు శంకర్... తప్పు చేయనప్పుడు మనం ఎందుకు భయపడాలి? అవసరం అయితే మంచి లాయర్‌ని పెట్టుకుందాం..." అన్నాడు స్వామీజీ ధైర్యం చెబుతూ.

"రామ్మోహనరావుగారు ఇదంతా చేశారంటే నేనింకా నమ్మలేకపోతున్నాను" అన్నాడు శంకర్.

"ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మలేని పరిస్థితి. నిజంగా ఆయనే దొంగనోట్ల సూత్రధారో ఆయన వెనుక ఇంకెవరయినా వున్నారో తెలీదుకానీ అనవసరంగా నువ్వు ఇరుక్కున్నావు..."

"ఏసీపీ పైకి కరోడా మాదిరిగా వున్నా మంచివాడిలాగే వున్నాడు..."

"పోలీసుల మంచితనం ఎంతకాలం వుంటుందో చెప్పలేం... ఏది ఏమైనా మనం జాగ్రత్తగా వుండాలి" అన్నాడు స్వామీజీ సాలోచనగా.

ఇద్దరూ ఫ్లాట్‌కు వచ్చారు. లంచ్ తర్వాత స్వామీజీ వెళ్ళిపోయాడు. పడుకున్నా నిద్ర రావటంలేదు. మనస్సంతా శూన్య స్థితిలోవుంది. ఏవేవో ఆలోచనలు అతలాకుతలం చేస్తున్నాయి.

ఏం జరిగింది?

మళ్ళీ మొదటికే వచ్చింది. ఆనందించినంతసేపు పట్టలేదు. సిన్మా ఛాన్స్ రావటం కాదు, కొద్దిలో దొంగనోట్ల కేసులో జైలుకి వెళ్ళవలసింది తప్పిపోయింది. ఆరోజు తను ఏసీపీకి ఫోన్ చేసిన విషయం చెప్పకపోతే తనను కూడా క్రిమినల్‌గా చూసేవాళ్ళు. జరిగిందంతా తల్చుకుంటుంటే ఒళ్ళు జలదరిస్తుంది.

భగవంతుడా! ఇదంతా ఎందుకు జరుగుతోంది?



తనకు ఎప్పటికీ మంచిరోజులు రానట్లేనా? తన పరిస్థితి ఇంతేనా?

★ ★ ★

జరిగిన సంఘటననుంచి తేరుకోవటానికి వారంరోజులు పట్టింది.

మనస్సు దేనిమీదా నిలవటంలేదు. స్థబ్దంగా, శూన్యంగా వుంది. ఏదైనా రాద్దామని ప్రయత్నించినా అక్షరం కూడా ముందుకు కదలటం లేదు. స్వామీజీ ఫ్లాట్ లో వున్న సమయంలో శంకర్ని ఓదార్చేవాడు. ధైర్యం చెప్పేవాడు. ఎంత మర్చిపోదామనుకున్నా అంత గుర్తుకువచ్చేది. ఇరవైవేలు అడ్వాన్స్ ఇవ్వటం... ధగధగమంటూ రెపరెపలాడుతున్న సరికొత్త ఐదు వందల రూపాయల నోట్లు.

పోలీస్‌స్టేషన్‌లో గడిపిన ముప్ఫైఆరుగంటల కాలం... దెబ్బలూ... దొంగనోట్ల కేసులో ఇరుక్కోవటం... జీవితంలో సర్వం కోల్పోయిన ఫీలింగ్ వచ్చేది.

పదిరోజుల తరువాత ఏసీపీనుంచి పిలుపు వచ్చింది.

శంకర్ వెళ్ళాడు. "నువ్వు ఈ కేసులోంచి బయటపడే మార్గం ఒకటి వుంది" అన్నాడు ఏసీపీ శంకర్ వంక చూస్తూ.

"ఏమిటి సార్ అది? "

"అప్రూవర్‌గా మారిపోవటం. నీకు ఏమీ తెలీదని రామ్మోహనరావే ఇదంతా చేయించాడనీ, నువ్వు అమాయకంగా ఇందులో ఇరుక్కున్నావని చెబితే నీకు శిక్షపడదు..."

"కానీ ఇంతకుముందే నేను జరిగిందేమిటో స్టేట్‌మెంట్ రాసి ఇచ్చానుకదా సార్"

"ఆ స్టేట్‌మెంట్ సంగతి మర్చిపో. ఇందులోంచి నువ్వు ఏ శిక్షా పడకుండా తప్పించుకోవాలంటే రామ్మోహనరావుకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పాలి. ఈ కేసులోంచి తప్పించే పూచీ నాది"

"క్షమించండి సార్..." అన్నాడు శంకర్ స్థిరంగా. "తప్పించుకోవటం అన్న సమస్య ఏముంది సార్ దీంట్లో? నేను ఏ తప్పూ చేయలేదు. అవి దొంగనోట్లన్న విషయం పోలీసులు చెప్పేంతవరకూ నాకు తెలీదు. ఇక అప్రూవర్‌గా మారటం అంటారా! రామ్మోహనరావుగారు దొంగనోట్లు మార్చే వ్యాపారం చేస్తున్నట్లు నాకు తెలీదు. గతంలో వాళ్ళ బ్యానర్‌మీద రెండు సినిమాలకు నేను ఘోస్ట్ రైటర్‌గా పనిచేశాను. ఆయనతో నా పరిచయం అంతవరకే. మీరు నేరం రామ్మోహనరావుగారి మీదకు నెట్టేసి నన్ను అప్రూవర్‌గా మారిపోమంటున్నారు. క్షమించండి. నేను ఆ పని చేయలేను. ఎందుకంటే ఆయనంటే భయమో, గౌరవమో కాదు. నాకు తెలీని విషయాలను, అబద్ధాలనూ అడ్డం పెట్టుకొని ఈ కేస్‌నుంచి బైటపడేందుకు నేను సిద్ధంగా లేను. నేను ఆరోజు ఏంచెప్పానో ఈ రోజూ అదే చెబుతున్నాను. ఆయన నాకు అడ్వాన్ ఇచ్చారు అంతే. మిగిలిన విషయాల గురించి నాకు ఏమీ తెలీదు. మనస్సాక్షిగా వ్యతిరేకంగా నేను దొంగసాక్ష్యాలు చెప్పలేను"

"బాగా ఆలోచించుకో. ఆ కేసులోంచి తప్పించుకునేందుకు నీకిది మంచి అవకాశం"

"సారీ సర్... నేను అబద్ధాలు చెప్పలేను. కోర్టుకు వచ్చి జరిగింది చెప్పమంటే వాస్తవం చెబుతాను"

"మూర్ఖుడిలా మాట్లాడకు. ఎవడికోసమో నువ్వు ఇందులో ఇరుక్కుంటావా? "

"చెప్పానుకదా సార్... నా మనస్సాక్షికి వ్యతిరేకంగా ఏపనీ నేను చేయను. ఇక ఈ కేసు సంగతంటారా? ఓ పోలీస్ అధికారిగా ఏ క్షణంలోనయినా మీరు నన్ను ఏ కేసులోనయినా ఇరికించవచ్చు. నేను బైటపడటం కోసం అబద్ధాలు చెప్పను"

"ఇదే ఆఖరుమాటనా? "

"అవును సార్..."





ఏసీపీ కళ్లు ఆర్పకుండా తదేకంగా శంకర్‌వైపు చూస్తూ వుండిపోయాడు. ఆయన ముఖంలో నమ్మలేని విషయాన్ని చూస్తున్నంత దిగ్భ్రాంతి, దాంట్లోంచి తేరుకుని ఆయన నవ్వాడు.

"వెరీ గుడ్ మిస్టర్ శంకర్. ఐ అప్రిషియేట్ యువర్ సిన్సియారిటీ... ఇదే అవకాశం ఇంకొకళ్ళకు ఇస్తే ఎగిరి గంతేసి ఒప్పుకునేవాళ్ళు. దీన్నిబట్టే నీ నిజాయితీ ఏమిటన్నది తెలుస్తోంది. నిన్ను పరీక్షించేందుకే నేను అలా మాట్లాడింది. గత పదిరోజులుగా నీ గురించి ఇంటలిజెన్స్ ఎంక్వయిరీ జరిగింది. దీంట్లో నీకేమీ సంబంధం లేదనీ, నువ్వు చెప్పిందంతా నిజమేనని తేలింది. ఈ రోజుల్లో కూడా నీలాంటి యువకులు వుండటం నిజంగా గర్వకారణం... కేసులోంచి తప్పించుకునేందుకు అవకాశం వచ్చినా అబద్ధం చెప్పనన్న నీ నిజాయితీకి హేట్సాఫ్... గాడ్ బ్లెస్‌యూ మై బోయ్... ఆల్ ది బెస్ట్... నీకీ కేసుతో ఏ సంబంధమూ లేదు. యూమేగో..."

ఏసీపీ మాటలు వినగానే శంకర్ ముఖం ఆనందంతో వికసించింది. ఆయనకు నమస్కరించి ఛాంబర్‌లోంచి బయటకు నడిచాడు.

కష్టాలు వచ్చినా కూడా నిజాయితీగా వుండటమే రక్షిస్తుందనే దానికి ఈ సంఘటన ప్రత్యక్ష ఉదాహరణ.

★ ★ ★

ఆవిడ భర్తకు మంచినీళ్ల గ్లాసు అందిస్తూ అడిగింది. "ఏం జరిగిందండీ? "

"ఏం జరుగుతుంది? అంతా సర్వనాశనం అయింది. భారతిని చేసుకోవటం ఇష్టంలేదని ముఖంమీదే చెప్పేశారు"

ఆమె నిశ్చేష్టురాలయి బిగుసుకుపోయింది. "తాంబూలాలు తీసుకుందాం. మంచిరోజు చూసి కబురు చేస్తామన్నారుకదండీ... అంతలోనే ఎందుకు మనసు మార్చుకున్నారు? "

ఆయన భార్యపై ఒంటికాలిమీద లేచాడు.

"ఇదంతా నీ సుపుత్రుడి ఘనకార్యం. కన్నావుగా ఓ దరిద్రుడిని. సిన్మాల్లో చేరి భ్రష్టుడయ్యేందుకు ఇంట్లోంచి పారిపోయాడని ఎలాగో వాళ్ళకు తెలిసింది. మాకీ సంబంధం వద్దని వదులుకున్నారు..."

"దాంట్లో భారతి తప్పేముందండీ? "

"తోడబుట్టినందుకు అనుభవించాలే... మనం అనుభవించటంలా..." దుఃఖంతో పురుషోత్తమరావుగారి కంఠం వణికింది. "నాలుగేళ్ళు దాటుతోంది. వాడు ఎక్కడున్నాడో తెలీదు. మనం చచ్చామో బతకామో వాడికి అవసరంలేదు. కొడుకు పుట్టినందుకు ఎంత సంతోషించావే నువ్వు. పుత్రుడంటే పున్నామ నరకంనుంచి చచ్చిన తర్వాత రక్షించేవాడంటారు పెద్దలు. కానీ మనం ఏ జన్మలో చేసిన పాపమో బతికుండగానే వాడు ఈ భూమ్మీదే నరకాన్ని సృష్టించాడు..."

ఆవిడకు కొడుకు గుర్తొచ్చాడు.

మరిచిపోయింది ఎప్పుడనీ? నాలుగేళ్ళనుంచి అనుక్షణం గుర్తొస్తూనే వున్నాడు. ఆమె ఏడుస్తూ వుండేది. భర్త కోప్పడటం మొదలుపెట్టాక రాత్రుళ్ళు కొడుకుని గుర్తుకు తెచ్చుకుని నిశ్శబ్దంగా రోదించేది. 'ఏం పాపం చేశామని మాకీ శిక్ష విధించావయ్యా!' అని మూగగా దేముడిని ప్రార్థించేది. ఆమెకు తెలుసు, పైకి ఎంత అరిచినా లోపల ఎంత కుంగిపోతున్నాడో! ఒకేఒక్క కొడుకు అర్ధరాత్రి ఇంట్లోంచి వెళ్ళిపోవటం అనేది వాళ్ళ జీవితాల్లో శరాఘాతంలాంటిది. అప్పటినుంచీ భార్యాభర్తలిద్దరూ బతికే వున్నప్పటికీ జీవచ్ఛవమైపోయారు.

'ఎక్కడ వున్నావురా కన్నా!' అని కొడుకుని గుర్తుకు తెచ్చుకుని ఆమె భర్తకు నిద్రాభంగం కలగకుండా నిశ్శబ్దంగా రోదించేది. కానీ భర్త కూడా నిద్రించటంలేదని మెలుకువగానే వున్నాడనీ అటువైపు తిరిగి గుండెల్లో అగ్నిపర్వతం బద్దలవుతున్నా దిగమింగు

కుంటున్నాడని ఆమెకు తెలీదు.

భారతి లేకపోయివుంటే వాళ్ళెప్పుడో ఆత్మ హత్య చేసుకునేవాళ్ళు.

పుట్టెడు దుఃఖాన్ని గుండెల్లో దాచుకుని ఆడపిల్లకోసం బతకసాగారు. గత నాలుగు న్నర సంవత్సరాలుగా ఏదో ఓ క్షణంలో కొడుకు తిరిగివస్తాడని నమ్ముతూనే వున్నారు. ఇంతకాలమైనా కనీసం ఉత్తరం కూడా కొడుకునుంచి రాకపోవటం, ఎలా వున్నాడో, ఏంచేస్తున్నాడో తెలీకపోవటం వాళ్ళను కుంగదీస్తూవుంది.



అక్కడ వాతావరణం చాలా వేడిగా వుంది. ఎయిర్‌కండిషనర్ పనిచేస్తున్నా కూడా.

"సో... సుబ్రహ్మణ్యం చెప్పింది మీకు నచ్చలేదన్నమాట..."

"అవును..."

ఎందుకనీ? "

"అందులో వెరైటీ ఏమీలేదు కాబట్టి..."

డైరెక్టర్ సురేంద్ర ఆయనవైపు ప్రశ్నార్థ కంగా చూశాడు. అతని అన్ని సంవత్సరాల కెరీర్‌లో ఓ నిర్మాత అంత నిర్మొహమా టంగా, నిష్కర్షగా అతను బాగుందీ అన్న సబ్జెక్టు బాగోలేదూ అన్న సందర్భాలు లేవు. అందుకే ఇరిటేషన్ అణుచుకుని అడిగాడు.

"ఏం నచ్చలేదు మీకు? "

"ఏముందసలు నచ్చటానికి? " ఆయన తేలిగ్గా చప్పరిస్తూ అన్నాడు "అసలు వెరైటీ లేదు. ఒకటికి వందసార్లు అరిగిపోయిన లైను. ఇదే పాయింట్ మీద ఇప్పటికే వంద సిన్మాలు తీసేశారు. మనం కొత్తగా మళ్ళీ తీయనక్కరలేదు. కొన్ని సంఘటనలు, పాత్రలు మక్కీకిమక్కి చలంగారి కథల్లోంచి పక్కా కాపీ. జస్ట్ క్యారెక్టర్ మార్చేసి అదే సంఘటనలు తీస్తే జనం ముఖంమీద ఉమ్ముతారు..."

సురేంద్ర బలవంతాన తన ఆవేశాన్ని అణుచుకున్నాడు.

తను ఏం చెబితే అది వేదం. తను ఓకే చేసిన సబ్జెక్ట్ సిన్మా తీసేవాళ్ళు. నిర్మాత అనేవాడు నిమిత్తమాత్రుడు. తనదే అన్నిం టిలో ఫైనల్ నిర్ణయం. తనను ఎదిరించే సాహసం హీరో కూడా చేయడు.

కానీ అదంతా గతం.

తను వరుసగా హిట్స్ ఇచ్చినప్పటి సంగతి. ప్రస్తుతం తను ఫ్లాపుల్లో వున్నాడు. సిన్మాలు లేవు. ఈ సిన్మా ఆడితేనే మరో రెండు సిన్మాలు వచ్చేది. అయినా సుబ్ర హ్మణ్యం అనేవాడు తన రచయిత. తను ఏం చెబితే అది చేస్తాడు. అవసరం అయితే సిగ్గు, శరం వదిలేసి తనకు సేవచే స్తాడు. తనకు చెంచాగిరి చేస్తాడు. సంవ త్సరం తర్వాత తను సిన్మా చేస్తూ సుబ్ర హ్మణ్యం కాక వేరే రైటర్ని పెట్టుకుంటే ఎలా ఫీలవుతాడు అనుకుంటూ సుబ్ర హ్మణ్యం వైపు చూశాడు.

సుబ్రహ్మణ్యం ముఖం మాడిపోయి వుంది.

నిర్మాత అంత డైరెక్టుగా చెప్పేసరికి పేడ నీళ్లు ముఖానికి కొట్టినట్లుగా వుంది. తను చాలా తెలివిగా చలం కథని క్యారెక్టర్స్ మార్చేసి చెబితే నిర్మాత పడిపోతాడనుకు న్నాడు. కానీ నిర్మాత పడిపోలేదు. సబ్జెక్ట్





దరిద్రంగా వుందని ఖరాఖండీగా చెబుతున్నాడు. పోనీ డైరెక్టర్ సురేంద్రన్నా తనను ఆదుకునేందుకు మాట అడ్డం వేస్తాడా అనుకుంటే సురేంద్ర అది కూడా చేయటంలేదు' అనుకున్నాడు సుబ్రహ్మణ్యం అనబడే చెంచాగిరి రచయిత.

"మీరేమంటారు స్వామీజీ? " సురేంద్ర స్వామీజీని అడిగాడు. కనీసం స్వామీజీ అన్నా తనను సపోర్ట్ చేస్తాడన్న ఫీలింగ్.

"నిర్మాతగారు చెప్పిందే కరెక్ట్ అన్పిస్తోంది సార్..." అన్నాడు స్వామీజీ.

స్వామీజీని మింగేసేటట్లుగా చూశాడు సురేంద్ర. స్వామీజీ 'దాన్ని కేర్ చేయలేదు. గతంలో చాలాసార్లు అతను మనస్సు చంపుకుని సురేంద్ర చెప్పినదానికల్లా తలూపి డబ్బుకోసం చెత్త సిన్మాలు చేయాల్సివచ్చింది. ప్రస్తుతం అంత అవసరం లేదు. ముఖ్యంగా సురేంద్రకు అంత సీన్ లేదు. కారణం వరుసగా సురేంద్రవి నాలుగు సిన్మాలు అట్టర్ ఫ్లాప్. ఇంతకాలం సురేంద్ర ఇష్టం వచ్చినట్లుగా ఆడాడు. ఇప్పుడు స్వామీజీ టర్న్ వచ్చింది. రాజకీయాల్లో సిన్మా ఫీల్డులో ఇదంతా సహజమే. ఎవడికి సక్సెస్ వుంటే వాడు చెప్పిందే వేదమవుతుంది.

నిర్మాత పీతాంబరం చాలా సిన్మాలు తీశాడు. ఆయనకు, ఆయన బ్యానర్‌కు పరిశ్రమలో మంచి పేరుంది. ఆయన నిక్కచ్చి మనిషి. ఇష్టం లేనిదాన్ని ఇష్టంలేదని చెబుతాడు. సబ్జెక్ట్ పూర్తయితే కానీ షూటింగ్ ప్రారంభించని కొద్దిమంది నిర్మాతల్లో ఒకడు. ఏదో ఒక సిన్మా తీసేసి డబ్బు సంపాదించేయాలన్న తాపత్రయంలేని నిర్మాత కాబట్టి గత ఇరవైఏళ్లలో పన్నెండు సిన్మాలు మాత్రమే తీశాడు. సిన్మాలు లేని పరిస్థితుల్లో సురేంద్ర ఏ స్థాయికయినా దిగటానికి సిద్ధంగా వుంటాడు కాబట్టి పీతాంబరంగారికి ఒకటికి వందసార్లు ఫోన్ చేయటం, కలవటం ప్రారంభించాడు. 'మీ బ్యానర్‌లో సిన్మా చేయటం నా జీవితాశయం సార్...' అంటూ డబ్బా కొట్టడం మొదలుపెట్టాడు. పీతాంబరంకు సురేంద్ర అంటే ఇష్టంలేదు, అయిష్టం కూడా లేదు. ముందుగా ఆయనకు సబ్జెక్ట్ నచ్చాలి.

"బ్రహ్మాండమైన సబ్జెక్ట్ వుంది సార్..." అంటూ సురేంద్ర తన చెంచా రచయిత సుబ్రహ్మణ్యాన్ని ప్రవేశపెట్టాడు.

సుబ్రహ్మణ్యం లిఫ్ట్ ఇరిగేషన్ మాయలు పీతాంబరం దగ్గర పనిచేయలేదు. ఆయన సుబ్రహ్మణ్యం సబ్జెక్ట్ చెప్పటం మొదలుపెట్టిన పది నిమిషాల్లోనే పెదవి విరిచేశాడు. సబ్జెక్ట్ బాలేదని చెప్పేశాడు. 'సుబ్రహ్మణ్యం దగ్గర చాలా సబ్జెక్టులున్నాయి సార్. మంచి రైటర్. వినండి సార్...' అంటూ రికమెండ్ చేసేవాడు సురేంద్ర. సురేంద్ర మాట తీసిపారేయలేక ఆయన వినేవాడు. త్వరలోనే ఆయనకు సుబ్రహ్మణ్యం అనేవాడు. 'విషయం లేని సరుకని' అర్థమైపోయింది. అందుకే స్వామీజీని కథాచర్చలకు ఆహ్వానించాడు. స్వామీజీ రాగానే సురేంద్ర మొదట ఇబ్బందిగా ఫీలయినా గతంలో తనతో పని చేశాడు కాబట్టి 'తనకు వ్యతిరేకంగా మాట్లాడే సాహసం చేయడులే' అనుకున్నాడు.

గత నెలరోజులుగా సుబ్రహ్మణ్యం వంద సబ్జెక్టులు చెప్పాడు. ఏవీ నిర్మాతకు నచ్చలేదు. ఆయన్ని తమకు అనుగుణంగా ట్యూన్ చేయాలని సురేంద్ర, సుబ్రహ్మణ్యం చేస్తున్న ట్రిక్కులు ఫలించటంలేదు. ముందే చెప్పినట్లుగా ఆయన చాలా నిక్కచ్చిగా వుండే నిర్మాత. సబ్జెక్ట్ విషయంలో అంగుళం కూడా రాజీపడే సమస్యేలేదు.

ఎంతకాలానికీ సబ్జెక్ట్ ఫైనలైజ్ కాకపోయేసరికి అందరికీ చికాకుగా వుంది. సురేంద్రకయితే మరీ చికాకుగా వుంది. అప్పటికే పీతాంబరంగారి సిన్మా నేను చేస్తున్నానని ఇండస్ట్రీ అంతా ప్రచారం చేసుకున్నాడు.

"మనం రేపు కలుద్దాం" అని చెప్పేసి పీతాంబరం లోపలకు వెళ్లిపోయాడు.



ఆయనకు బాగా కోపం వచ్చిందని అందరికీ అర్థమయ్యింది. సురేంద్ర, సుబ్రహ్మణ్యం ఇద్దరూ బయలుదేరారు.

"నా అనుమానం మన సబ్జెక్టులు ఓకే కానీకుండా ఆ స్వామీజీగాడు అడ్డుపడుతు న్నాడని నా డౌట్" అన్నాడు సుబ్రహ్మణ్యం అక్కసుగా సురేంద్రతో.

"వాడి ముఖం... నేనేం చెబితే అది వింటాడువాడు" సురేంద్ర కారు స్టార్ట్ చేస్తూ గర్వంగా అన్నాడు. ముసలాడే గట్టి పిండం. అయినా మంచి సబ్జెక్ట్ ఒక్కటీ లేదా నీ దగ్గర? "

"మీరే అలా అంటే ఎలా సార్? "

"సర్లే" అన్నాడు సురేంద్ర విసుగ్గా ముఖం పెట్టి "ఎలాగైనా మనం ముసలాడిని పడేయాలి. లేకపోతే ఇద్దరికీ ఇంకో సిన్మాలే దన్న విషయం మర్చిపోకు"

రెండో రోజు యథావిధిగా కథా చర్చలు ప్రారంభమయ్యాయి.

సుబ్రహ్మణ్యం రాత్రి చూసిన ఇంగ్లీష్, హిందీ తమిళ సిన్మాల కథలు మిక్స్ చేసి చెప్పటం ప్రారంభించాడు. అరగంటకే పీతాంబరానికి విసుగొచ్చేసింది.

"నీ దగ్గర ఇంతకంటే మంచి సబ్జెక్టులు లేవా? "

"ఏం సార్... అలాగంటారు. నే చెప్పిన కథలు బాలేదా? "

"నువ్వు చెప్పిన కథలెట్టి సిన్మా తీస్తే నా కారు డ్రైవర్ కూడా పోన్లే పాపం మా బాస్ కష్టపడి తీసిన సిన్మా అని కూడా నా సిన్మా చూడడు. సిన్మా అంటే ఈ రోజుల్లో కోట్ల రూపాయలతో వ్యవహారం. మీరెందుకు దీన్నింత ఆషామాషీగా తీసుకుంటున్నారో నాకు అర్థం కావటంలేదు"

సురేంద్ర కల్పించుకుంటూ అన్నాడు. "సుబ్రహ్మణ్యం చెప్పిన వాటిల్లో రెండు సబ్జె క్టులు బాగా వున్నట్లుగా నాకు అన్పిస్తోంది. కావాలంటే వాటినే పకడ్బందీగా డెవలప్ చేద్దాం"

పీతాంబరం తల అడ్డంగా తిప్పాడు. "వద్దు, అందులో నాకేం వెరైటీ కన్పించ లేదు"

"అంటే డైరెక్టర్‌గా నా మాటకు విలువే లేదా? " ఒకింత కోపంతో అన్నాడు సురేంద్ర.

"డైరెక్టర్‌గా మీరంటే గౌరవం వుండబట్టే గత నెల రోజులుగా ఇతగాడు ఎన్ని బేవార్సు సబ్జెక్టులు చెప్పినా వింటూ వచ్చాను. అందుకు కారణం కేవలం మీరు అతన్ని రికమండ్ చేశారని. లేకపోతే ఆఫీ సులోకి కూడా అడుగుపెట్టలేడు"

"ఇలా అయితే మనం సిన్మా తీసినట్లే నిర్మాతగారూ! కాలం మారింది. మీరు కూడా మారాలి. ఎంతసేపూ మీ ఓల్డ్ స్కూల్‌నే పట్టుకు వేళ్లాడితే ఎలా సార్? "

"కాలం ఎంతమారినా కథ నచ్చకుండా సిన్మాతీసే మూర్ఖమైన పని నేను చేయను. అవసరం అయితే సిన్మా తీయటమే మానే స్తాను" ఈ విధంగా నిర్మాత, దర్శకుడు మధ్య సంభాషణ వేడిగా జరుగుతున్న సమయంలో స్వామీజీ, మరో కుర్రాడు ఆ గదిలోకి ప్రవేశించారు.

"నమస్కారం సార్! ఇతని పేరు శంకర్. మీకు సబ్జెక్ట్ చెప్పాలని ఉత్సాహపడుతు న్నాడు"

ఆయన విసుగ్గా శంకర్‌వంక ఎగాదిగా చూశాడు. ఆయన మూడ్ పూర్తిగా పాడ యిపోయి వుంది. ఇంత కాలంగా కూర్చున్నా కనీసం పాయింట్ కూడా రాకపోవటం చికా కుగావుంది. అదీ కాకుండా డైరెక్టర్ సురేంద్ర ధిక్కార ధోరణిలో మాట్లాడటం కారణంగా ఆయన లోపల్లోపల మండిపడుతున్నాడు. ఇప్పుడీ కుర్రనాకొడుకెవరో వచ్చి కథ చెబుతా నంటున్నాడు. సిన్మాకి కథ చెప్పటం అంటే ప్రతి ఒక్కడికీ తేలికయిపోయింది. స్వామీజీ వెంట తీసుకురాకపోతే బాయ్‌ని పిలిచి బైటకు గెంటించేవాడు.

"సర్లే.. మొదలెట్టు" అన్నాడాయన




విసుకు, చికాకు, హేళన మిళితమైన స్వరంతో.

శంకర్ చెప్పటం మొదలెట్టాడు.

కాలం స్థంభించింది. వాళ్లంతా తేరుకోవటానికి గంటన్నర పట్టింది. తన కథతో వాళ్లందరినీ ఓవిధమైన ట్రాన్స్‌లోకి తీసుకెళ్లిపోయాడు శంకర్. తన కెరీర్‌లో అరవై సిన్మాలు తీసిన సురేంద్ర వళ్లు కూడా ఎగ్జయిట్‌మెంట్‌తో జలదరించింది.

ఎంత అద్భుతమైన నేరేషన్?

సిన్మా కథ చెబుతున్నట్లుగా లేదు ఏకంగా కళ్లముందు సిన్మానే చూస్తున్నట్లుగా వుంది. ఎవడు వీడు? సుబ్రహ్మణ్యం అయితే నోరు తెరుచుకుని వెర్రిముఖం వేసుకుని "సిన్మా కథ ఇలా కూడా చెప్పొచ్చా" అన్నట్లు వింటున్నాడు.

పీతాంబరం లేచి నిలబడి శంకర్‌ను ఆనందం పట్టలేక వాటేసుకున్నాడు.

"శభాష్. ఇదీ సబ్జెక్ట్ అంటే. వంద రోజులు గ్యారంటీ. మట్టిలో మాణిక్యాలుంటాయంటారు. ఇపుడు చూస్తున్నాను. డైరెక్టర్‌గారూ మనం ఈ సబ్జెక్ట్ చేస్తున్నాం" అన్నాడు.

అప్పటికి తేరుకున్నాడు సురేంద్ర.

నెల రోజులుగా తాము సబ్జెక్టులు విన్పిస్తుంటే నచ్చలేదన్న నిర్మాత ఎవడో బచ్చా నాకొడుకు వచ్చి సబ్జెక్టు చెప్పగానే దాంతో సిన్మా తీయాలనుకుంటే అంతకంటే ఘోరమైన అవమానం వేరే వుంటుందా? సబ్జెక్ట్ బాగుండచ్చు అది వేరే విషయం. కానీ డైరెక్టర్‌గా తాను ఓకే చేయకుండా నిర్మాత ఎలా సిన్మా తీస్తాడు.

"సారీ నిర్మాతగారూ! నాకు ఈ సబ్జెక్ట్ ఏమాత్రం నచ్చలేదు"

"నచ్చలేదా? " పీతాంబరం ఆశ్చర్యంగా డైరెక్టర్ వంక చూస్తూ అన్నాడు "సరిగ్గా విన్నారా. మళ్లీ చెప్పమంటారా"

"అక్కరలేదు... సబ్జెక్ట్‌లో అంత దమ్ము లేదు, బాలేదు"

"ఏమిటి మీకు నచ్చలేదు"

"అసలు సబ్జెక్టులో ఏమీలేదు"

పీతాంబరం ముఖం ఎర్రబడింది. "మూర్ఖంగా మాట్లాడకండి. అంత అద్భుతమైన సబ్జెక్ట్ బాలేదంటారా? పోనీ ఏం బాగోలేదో చెప్పమంటే చెప్పచ్చుగదా! ఇది డెఫినెట్ హిట్"

"ఆ విషయం డైరెక్టరుగా నేను చెప్పాలి"

"నా అనుభవంతో చెబుతున్నాను ఈ సబ్జెక్ట్‌లో వెరైటీవుంది"

"వుండచ్చు" నిర్లక్ష్యంగా అన్నాడు సురేంద్ర. "డైరెక్టర్‌గా ముందు నేను సబ్జెక్ట్‌ను విజులైజ్ చేసుకోవాలి. టేకింగ్ పరంగా ఏవిధంగా తీయాలని ప్లాన్ చేసుకోవాలి. ఈ సబ్జెక్ట్‌లో విజువల్ బ్యూటీ లేదు"

"విజువల్ బ్యూటీ అంటే ఏమిటో చెప్పండి డైరెక్టర్‌గారూ! నాకు తెలీక అడుగుతాను"

"ఫ్రేమ్స్ రిచ్‌గా అందంగా వుండటమే విజువల్ బ్యూటీ..." మరింత నిర్లక్ష్యంగా అన్నాడు సురేంద్ర. ఎటువంటి పరిస్థితుల్లోనూ నిర్మాతకు నచ్చినా ఈ సబ్జెక్ట్ ఓకే చేయకూడదు. ఇది తన ప్రిస్టేజ్ క్వశ్చన్.

"అంటే మీరేమంటారు డైరెక్టరుగారూ? "

"ఈ సబ్జెక్ట్‌తో సిన్మా చేయటం చాలా కష్టం. డైరెక్టర్‌గా ఇది నా అభిప్రాయం"

"అయితే చేయటం మానేద్దాం"

పీతాంబరం మాటలకు సురేంద్ర ముఖం వికసించింది. దాన్ని గమనించి ఆయన చెప్పాడు.

"మానేద్దామంటే సిన్మా చేయటంకాదు. మీరు డైరెక్షన్ చేయటం" తాపీగా అన్నాడు పీతాంబరం.

ఈడ్చి ముఖం మీద గుద్దినట్లుగా సురేంద్ర ముఖం నల్లబడింది.

"డైరెక్టర్ని నా కంటే ఓ బచ్చాగాడే మీకు ఎక్కువన్నమాట"

"అతను బచ్చాగాడా, తల నెరిసిన పెద్ద



వాడా అన్నది నాకు ముఖ్యంకాదు. సబ్జెక్ట్ ముఖ్యం. అతను చెప్పిన సబ్జెక్టలో వెరైటీ వుంది. లేదని మీరంటున్నారు. ఎందుకు బాలేదని అడిగితే మూర్ఖంగా నాకు నచ్చ లేదు అంటున్నారు. డైరెక్టర్‌గా మీకు నచ్చని సబ్జెక్ట్ ఇచ్చి మీ చేత బలవంతంగా డైరెక్షన్ చేయించలేనుగా డైరెక్టర్‌గారూ!"

"అందుకని నన్ను డైరెక్టర్‌గా తొలగిస్తు న్నారన్నమాట"

"ఈ సబ్జెక్టతో సిన్మా చేయనని మీరే అన్నారు"

"అవును... ఇంక సబ్జెక్టులే లేనట్లుగా ఈ సబ్జెక్టే ఎందుకు చేయాలి?"

"ఎందుకు చేయకూడదు? సబ్జెక్టలో ఏం నచ్చలేదో చెప్పండి. నన్ను కన్విన్స్ చేస్తే మానేద్దాం"

నిర్మాతా, దర్శకుడి మధ్య జరుగుతున్న వాగ్వివాదాన్ని స్వామీజీ, శంకర్ మౌనంగా చూస్తుండిపోయారు. స్వామీజీకి అసహ్యమే సింది. ఇటువంటి ఇగో ప్రాబ్లమ్స్ వల్లే దరిద్రమైన సిన్మాలు బైటకు వస్తున్నాయి. మంచి పాయింట్ చెబితే రిసీవ్ చేసుకోవ టానికి విశాలమైన హృదయం కాదు కనీస లాజిక్ వుండాలి. సిన్మా హిట్ అయితే అందరూ లాభపడతారు. లేకపోతే నాశన మైపోతారు. అంత చిన్న విషయం అర్థం చేసుకోకుండా మూర్ఖంగా వాదిస్తున్న సురేంద్ర మీద అసహ్యమేసింది.

మరో పదిహేను నిమిషాలు తీవ్రమైన వాగ్వివాదం జరిగిన తర్వాత సురేంద్ర ఏమాత్రం తగ్గకుండా అన్నాడు. "సరే ఇంత జరిగిన తర్వాత నేను లేకుండా మీరు ఏవి ధంగా సిన్మా తీస్తారో చూస్తాను. అసోసి యేషన్‌లో పెడతాను"

"నిరభ్యంతరంగా పెట్టుకోండి"

"మీరు చెప్పినంత తేలిక కాదండీ నిర్మాత గారూ. మా డైరెక్టర్స్ అసోసియేషన్స్‌లో దీన్ని ఇష్యూ చేశానంటే మీ సిన్మాకు డైరె క్టర్ దొరకడు. మీరెంత డబ్బు ఇస్తానన్నా ఏ డైరెక్టరూ అసోసియేషన్‌ను ధిక్కరించి డైరెక్షన్ చేయడు"

"సంతోషం" పీతాంబరం తాపీగా అన్నాడు. "మీరేం చేయదల్చుకున్నారో అది చేసుకోండి. నన్ను ఎవ్వరూ బెదిరించలేరు. మొదటినుంచీ మీ ధోరణి నచ్చకపోయినా గౌరవిస్తూ వచ్చాను. ఆ గౌరవానికి మీరు తగరని తేలిపోయింది. ఇక డైరెక్టర్ విషయం అంటారా! ఇపుడే నిర్ణయం తీసు కున్నాను. చెబుతాను వినండి. ఈ సబ్జెక్ట చెప్పిన శంకరే నా సిన్మాకు డైరెక్టర్"

"వెరీగుడ్... ముక్కూ ముఖంతెలీని బాక్‌గ్రౌండ్‌లేని ఈ ఫ్లాట్‌ఫారంగాడిని మీ సిన్మాకు డైరెక్టర్‌గా పెట్టుకుంటున్నారన్న మాట. మిమ్మల్నీ, మీ బ్యానర్‌నూ దేవుడు కూడా రక్షించలేడు" అవమాన భారంతో శరీరం అంతా కంపిస్తుండగా సుబ్రహ్మణ్యం వంక చూసి చివాలున కుర్చీలోంచి పైకి లేస్తూ "ఇంకా కూర్చున్నావే పద... డైరెక్షన్ అంటే ప్రతి నా కొడుక్కి ఆటయిపోయింది" అంటూ విసురుగా గదిలోంచి బైటకు నడి చాడు సురేంద్ర. సుబ్రహ్మణ్యం హడావు డిగా సురేంద్రను అనుసరించాడు.

"ఒక్క నిమిషం సురేంద్రగారూ" స్వామీజీ పిలిచాడు.

గుమ్మం దాటబోతున్న సురేంద్ర వెనుది రిగి చూశాడు.

"ఈ కుర్రవాడు ఎవరో తెలుసా మీకు?"

"నాకెలా తెలుస్తుంది? ఎవడో ఫ్లాట్‌ఫా రంగాడు" సురేంద్ర ఉక్రోషంగా అన్నాడు.

"కాదు శంకర్. శంకర్ అంటే ఎవరో తెలుసా! మీ ఇంటి గూర్ఖాలు మెడ పెట్టి బైటకు నెట్టిన కుర్రవాడు. మీ దగ్గర అసి స్టెంట్‌గా చేర్చుకోండి అని మూడున్నర సంవత్సరాల క్రితం వినయంగా అడిగితే మీరు బండబూతులు తిట్టిన శంకర్. ఇది చెప్పేందుకే మిమ్మల్ని ఆపింది. ఇక మీరు వెళ్లచ్చు" స్వామీజీ కూల్‌గా అన్నాడు.

విషపు చూపొకటి చూసి సుబ్రహ్మ




ణ్యంతో కలిసి వెళ్లిపోయాడు సురేంద్ర.

"చూడు శంకర్. చిన్నవాడివి కాబట్టి నువ్వు అనే అంటాను.ఫీల్ కావద్దు. అంతా మనమంచికే అనుకుందాం. నీకేం అనుభవం వుందో నాకు తెలీదుకానీ నువ్వు కథ చెప్పిన విధానం విన్న తర్వాత నువ్వు నీ సబ్జెక్టను డైరెక్ట్ చేయగలవన్న నమ్మకం కుదిరింది. సర్వం మర్చిపో. ఈ క్షణం నుంచీ నువ్వూ, నీ సిన్మా అంతే. నీకు ఏం కావాలో నన్ను అడుగు. సురేంద్రలాంటి మూర్ఖుల కళ్లు తెరిపించేలా మనం బ్రహ్మాండమైన హిట్ సిన్మా తీయాలి. ఇది నీకు ఓ ఛాలెంజ్. నువ్వు దాన్ని సాధించగలవని నా అనుభవం చెబుతోంది"

పీతాంబరం మాటలకు షాక్ అయినట్లుగా బిగుసుకుపోయాడు శంకర్. ఏం జరుగుతోంది? తనకు డైరెక్టర్‌గా ఛాన్స్ వచ్చిందా? ఇదంతా నిజమేనా లేక భ్రాంతా?

"నిర్మాతగారు చెప్పింది అక్షరాలా నిజం శంకర్. ఇది నీకో సవాల్. నీ జీవితలక్ష్యం డైరెక్టర్ కావటం. పీతాంబరంగారి ద్వారా భగవంతుడు నీకు ఓ అద్భుతమైన అవకాశాన్నిచ్చాడు. దాన్ని నిలబెట్టుకో"

శంకర్ షాక్‌లోనుంచి తేరుకోవటానికి అరగంట పట్టింది.

★ ★ ★

"నేను డైరక్టర్ని కాబోటం నిజమేనా లేకుంటే కలకంటున్నానా? "

స్వామీజీ నవ్వాడు, "అక్షరాలా నిజం... నువ్వు చెప్పిన సబ్జెక్ట్ బాగా నచ్చి సురేంద్ర ఆ సబ్జెక్ట్ చేయనని బెదిరిస్తే వళ్ళుమండిన పీతాంబరం ఏకంగా నిన్నే డైరెక్టర్ని చేశాడు. అందుకే పెద్దలంటారు మంచి జరిగే కాలం వస్తే ఎవ్వరూ ఆపలేరని..."

ఇద్దరూ స్వామీజీ కెనిటిక్ హోండామీద ఫ్లాట్‌కు బయలుదేరారు. శంకర్ మనస్సు ఆనందంతో పరవళ్ళు తొక్కుతోంది...

"మీరెంత చెప్పినా ఇంకా నమ్మకం కలగటం లేదుసార్"

"అది సహజం... డైరెక్షన్ ఛాన్స్‌వస్తే ఎవరికైనా అలాగే వుంటుంది. ఓ విధంగా సురేంద్ర మనకు చాలా మేలుచేసినట్లు..."

"కానీ మీరు సురేంద్రగారితో అలా ఎందుకు మాట్లాడారు సార్? "

"ఆవేశాన్ని కంట్రోల్ చేసుకోలేకపోయాను శంకర్... నిన్ను ఫ్లాట్‌ఫారంగాడు అనే హక్కు, అర్హత అతనికి ఎక్కడున్నాయి? ఆ ఫ్లాట్‌ఫారంగాడే నిన్ను ఫ్లాట్‌ఫారం మీదకు గెంటాడు అని చెబుదామనుకున్నాను. ఎంత ఇగోనో, ఉక్రోషమో చూడు. అప్పటికీ పీతాంబరంగారు మర్యాదగా ఏం నచ్చలేదో చెప్పమని అడిగారా! ఆయన్ని బెదిరిద్దామనుకుని డైరెక్షన్ ఛాన్స్ పోగొట్టుకున్నాడు. పీతాంబరంగారు చాలా గట్టి మనిషి. ఆయన ఏదైనా అనుకుంటే చేసి తీరతాడు. ఆయన బ్యానర్‌లో నువ్వు డైరెక్టర్‌గా పరిచయం కావటం మంచి స్టార్టింగ్. దానికోసం మనం చాలా హార్డ్ వర్క్ చేయాలి"

ఆరోజు నుంచే స్వామీజీ, శంకర్ ఇద్దరూ ఇరవై నాలుగు గంటలూ స్క్రిప్ట్‌మీద కూర్చోవటం ప్రారంభించారు. సీన్స్ రాయటం డైలాగ్ వెర్షన్ రాయటం, ఇద్దరూ నిరంతరం చర్చించుకోవటం చేసేవాళ్లు. పీతాంబరంగారికి చూపించి ఆయన సూచనలకు అనుగుణంగా మార్పులు చేసేవాళ్లు. సీన్స్ షాట్ డివిజన్ చేసి తాను ఏవిధంగా తీయబోతున్నదీ లొకేషన్స్, కాస్ట్యూమ్స్, ఆర్టిస్టులు తదితర విషయాల గురించి శంకర్ ఆయనతో డిస్కస్ చేసేవాడు. వారం రోజులు తిరిగేసరికల్లా పీతాంబరంగారికి కాన్ఫిడెన్స్ బాగా పెరిగింది. తను ఏదో ఆవేశంలో శంకర్ని డైరెక్టర్ని చేశానేమో అన్న ఫీలింగ్ పోయింది. శంకర్ నూటికి నూరుపాళ్ళ టాలెంటెడ్. అతన్ని డైరెక్టర్ చేయటం అనాలోచిత నిర్ణయం కాదని ఆయనకు అర్థమైంది.

నెల రోజుల తర్వాత పీతాంబరంగారు ప్రెస్‌మీట్ ఏర్పాటు చేసి తను తీయబోతున్న సిన్మా గురించి వివరించి డైరెక్టర్‌గా శంకర్‌ను ప్రెస్‌కు పరిచయం చేశారు. "ఏ అనుభవంలేని కుర్రాడిని డైరెక్టర్ చేయటం రిస్కకాదా!" అని విలేఖరులు అడిగితే ఆయన "ఖచ్చితంగా రిస్కే కానీ శంకర్ విషయంలో మాత్రం రిస్కకాదు. ఎందుకనేది సిన్మా రిలీజ్ అయ్యాక మీరే రివ్యూల్లో రాస్తారు చూడండి" అన్నారు సరదాగా. అన్ని పత్రికల్లోను శంకర్ డైరెక్టర్ అన్న వార్త ప్రముఖంగా వచ్చింది.

ఇదంతా జరుగుతున్నది తనకేనా? తను డైరెక్టర్ నిజంగానే అయ్యాడా? అనుకుంటూ పత్రికలన్నీ ముందు పెట్టుకుని చూస్తూ వుండిపోయేవాడు. స్వామీజీ, శంకర్ అహోరాత్రులూ ఈ సిన్మామీదే ఏకాగ్రతతో వర్క్ చేస్తూ వుండేవాళ్లు. ఇది ఇద్దరికీ గొప్ప బ్రేక్‌కాబట్టి దాన్ని శాయశక్తులా హిట్ చేయాలని నిరంతరం కష్టపడేవాళ్లు. మరో ఇరవై రోజులు గడిచాయి.

తెల్లవారితే సిన్మా ప్రారంభపు ముహూర్తం.



ఆ గదిలో ఇద్దరు కూర్చుని తాగుతున్నారు. వాళ్ల ముందున్న టేబుల్‌మీద వివిధ పత్రికలు పేర్చివున్నాయి.

"చూశారా గురువుగారూ! మనకు ఎంత అవమానం జరిగిందో. ఆ పీతాంబరంగాడిని అంత తేలిగ్గా వదిలిపెట్టకూడదు"

"ఏం చేయమంటావు? "

"డైరెక్టర్స్ అసోసియేషన్‌లో పెట్టండి గురువుగారూ? "

"అసోసియేషన్ వాళ్లు నా ముఖానే ఉమ్ముతారు"

సురేంద్ర అప్పటికే బాగా తాగేసివున్నాడు. మనిషి తూలుతున్నాడు. కళ్లు బాగా ఎర్రబడి వున్నాయి. "అసలు ఇదంతా జరగటానికి ఆ స్వామీజీగాడు, శంకర్‌గాడు కారకులు" కసిగా అన్నాడు.

"వాళ్ల ముఖం గురువుగారూ!" సుబ్రహ్మణ్యం డిష్‌లోని ద్రవం గటగటా తాగేసి అన్నాడు. "ఆ శంకర్ గాడు డైరెక్టరంట. ఆ సిన్మా అట్టర్‌ఫ్లాఫయి తీరుతుంది చూస్తూ వుండండి"

"కాదు ఆ సిన్మా హిట్టవుతుంది. డైరెక్టర్‌గా నేను చెబుతున్నాను. వాడి సబ్జెక్ట్‌లో వెరైటీవుంది"

సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంగా సురేంద్రవైపు చూశాడు. వీడికి మందు పూర్తిగా తలకు ఎక్కిందా ఏమిటీ? శత్రువుల్ని పొగుడుతున్నాడు.

"మనం ఏం చేయలేమా గురువుగారూ? ఇలా వెర్రి వెధవల్లా చేతులు కట్టుకుని కూర్చోవాల్సిందేనా? "

"ఏం చేద్దాం"

"గూండాల్ని పంపించి వాళ్లిద్దరినీ మర్డర్ చేయిస్తే"

"నీలాంటి బేవార్సు సలహాలిచ్చేవాడిని నమ్ముకున్నందుకే అంత పెద్ద బ్యానర్ సిన్మా వదులుకోవాల్సి వచ్చింది. రేపే ముహూర్తం. మనం ఏమీ చేయలేం. ఇలా మందుకొడుతూ కూర్చోవాల్సిందే"

"మీరుకూడా ఏమీ చేయలేరా గురువుగారూ! నా కడుపు మండిపోతోంది. నా వళ్లు మంటెత్తిపోతోంది. వాళ్లు సర్వనాశనం అయిపోవాలి. రేపువాళ్లు ముహూర్తం చేశారంటే ఇంక మనం ఆపలేము. ఆ శంకర్ గాడు హీరో అయిపోతాడు. మీలో పౌరుషం చచ్చిపోయిందా ఏమిటీ? ఎన్ని రాజకీయాలు నడిపేవాళ్లు? శత్రువుల్ని నాశనం చేసేందుకు ఎన్ని కుట్రలు పన్నేవాళ్లం? అదంతా గుర్తుకు తెచ్చుకోండి"

సురేంద్ర కళ్లు మరింత ఎర్రబడ్డాయి. వరుసబెట్టి రెండు పెగ్గుల విస్కీ ఆపకుండా తాగేశాడు.

"నువ్వు చెప్పింది కూడా నిజమే. వీళ్లను




ఇలా వదిలేస్తే ప్రతిచోటా మనకు అడ్డం అయిపోతారు. వాళ్లను సర్వనాశనం చేసేయాలి. ఆ పీతాంబరంగాడు రోడ్డుమీద పడి అడుక్కు తినాలి. రేపే ముహూర్తం కాబట్టి డబ్బు తెచ్చి ఇంట్లో పెట్టుకుంటాడు. వాడింట్లో దొంగలుపడి దోచుకెళ్లిపోవాలి" కసిగా శాపనార్థాలు పెడుతున్న సురేంద్ర మెదడులో అకస్మాత్తుగా ఓ నీచపథకం పురివిప్పింది. ఆ ఆలోచన రావటం ఆలస్యం పక్కనే వున్న ఫోన్ అందుకుని నెంబర్స్ ప్రెస్ చేయటం ప్రారంభించాడు.

ప్రస్తుతం సురేంద్ర ముఖంమీద శాడిజంతో కూడిన వికృతమైన నవ్వు కదలాడుతోంది.

★ ★ ★

శంకర్ లేచి గడియారం వంక చూశాడు.

రెండున్నర. టైం చాలా మెల్లగా కదులుతున్నట్లుగా వుంది. టైం చూడటం అప్పటికి ఇరవై రెండోసారి. నిద్రమాత్రం రావటం లేదు. ఇంతకుముందే డైరెక్టర్లయిన వాళ్లంతా ఇలాగే నిద్రపట్టక ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందాని ఆత్రుతపడి వుంటారా? తెల్లవారితే షూటింగ్ మొదలవుతుంది.

తన సిన్మా ప్రారంభం అవుతుంది. తనది... ఆ సిన్మాకు డైరెక్టర్ తనే. మనస్సంతా ఓ విధమైన ఎగ్జయిట్‌మెంట్‌తో నిండివుంది. తను డైరెక్టర్ కాబోతున్న సంగతి అమ్మానాన్నకు తెలిసివుంటుందా? చందు పేపర్లలో చదివివుంటాడా? తమ వూరిలో దాని గురించి చర్చించుకుంటూ వుంటారా? ఏమో తెలీదు.

నాలుగున్నర సంవత్సరాలు...

సుదీర్ఘమైన నాలుగున్నర సంవత్సరాల కష్టం. హేళనలు, డిప్రెషన్, నిద్ర లేని రాత్రుల తర్వాత తను డైరెక్టర్ కాబోతున్నాడు. ఇన్ని సంవత్సరాల తన కల రేపటికి ఫలిస్తుంది. తనను చూసి తల్లిదండ్రులు గర్విస్తారా? చెల్లెలు ఆనందపడుతుందా? తను దాచుకున్న రెండు వేలు ఇచ్చి ధైర్యం చెప్పి పంపించిన చందు 'శంకర్ నా స్నేహితుడు... వాడు సాధించాడు. పెద్ద డైరెక్టర్ అయ్యాడు' అంటూ ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అవుతాడా? శంకర్ మళ్లీ టైం వంక చూశాడు. రెండూ నలభై. ఏమిటి ఎంతసేపయినా కాలం గడవదేమిటి?

శంకర్ అవస్థ అంతా గమనిస్తున్న స్వామీజీ మంచంమీద అటు తిరుగుతూ అన్నాడు, "కాసేపు పడుకో శంకర్. అలారం పెట్టాంగా ప్రశాంతంగా నిద్రపో. రేపు చాలా పనులు వుంటాయి"

శంకర్ నిద్రపోయేందుకు ప్రయత్నించాడు.

కానీ నిద్ర వస్తేకదా! ఆలోచనలు కెరటాల్లాగా ఉధృతంగా వస్తూనే వున్నాయి. ఎప్పటికో నిద్రపట్టింది.

ఎంతసేపు నిద్రపోయాడో తెలీదు. ఒక్కసారిగా అలారం మోగేసరికి ఉలిక్కిపడి లేచాడు. తెల్లవారుఝాము నాలుగున్నర గంటలు. మంచంమీద నుంచి లేవకుండా అలాగే కూర్చుని కళ్లు మూసుకుని భగవంతుని ప్రార్థించాడు.

"దేవ దేవా! నాకు ధైర్యాన్ని ఇవ్వు. నా లక్ష్యాన్ని సాధించే శక్తినివ్వు"

స్నానం తదితర కార్యక్రమాలు పూర్తి చేసుకుని గుడిని చేరుకునేసరికి అప్పుడే సుప్రభాతం మొదలయ్యింది.

ప్రశాంతమయిన మనసుతో గుడిలో అరగంటసేపు కళ్లు మూసుకుని కూర్చున్నాక శరీరం, మనసు ఏదో కొత్త శక్తితో నిండినట్లుగా అన్పించింది.

ఫ్లాట్‌కు చేరుకునే సరికి స్వామిజీ నిద్రలేచి పేపర్ చూస్తున్నాడు. శంకర్ని చూడగానే తమాషాగా నవ్వుతూ "గుడ్మార్నింగ్ డైరెక్టర్‌గారూ! గుడి కెళ్లొస్తున్నారా?" అన్నాడు.

"ఏంటిసార్ జోకులేస్తున్నారు?"

"జోకేంటీ! ఈ రోజు నుంచీ నువ్వు డైరె



# ఆణిముత్యాలు

★ అనేక సుగుణాలు ఉన్నంత మాత్రాన ప్రయోజనంలేదు. వాటిని జీవితానికి అన్వయించుకోవడం ముఖ్యం.

– రోబ్

★ సాహసం లేనివాడి కత్తి సరిగా తెగదు.

– టానిల్

★ ఆగ్రహం మోతాదు మించనప్పుడు వివేకానికి భూషణం అవుతుంది.

– విక్టర్ హ్యూగో

★ మేధస్సుకు అర్థం కాకమునుపే హృదయం వ్యక్తపరిచేది ప్రేమ.

– ఇలియట్

★ అసంభవమైన గొప్ప వాగ్దానం కంటే చిన్నచిన్న మంచిపనులు మెరుగైనవి.

– మెకాలె

★ సవాళ్ళు జీవితపు సౌందర్యం.

– రోస్‌పాల్

★ మన కీర్తి పరాజయాన్ని పొందకుండా ఉండడంలో లేదు. కానీ ప్రతి పరాజయం తరువాత మళ్ళీ ప్రయత్నించడంలోనే ఉంది.

– కన్‌ఫ్యూషియస్

★ మోసం చేయడంకంటే ఓటమిని పొందడమే గౌరవదాయకమైన విషయం.

– అబ్రహాంలింకన్

★ కలకాలం నిలిచిపోయే పనులను చేయడంలో ఖర్చు అయిన జీవితమే చాలా ఉపయోగకరమైన జీవితం.

– విలియం జేమ్స్

★ ఒక పౌండు చదువుకంటే ఒక ఔన్స్ విచక్షణా జ్ఞానం మంచిది.

– ఆడమ్స్

★ సూర్యుడివైపు ముఖం ఉంచండి. అప్పుడు మీరు నీడలు చూడలేరు.

– హెలెన్ కెల్లర్

★ అన్ని గొప్ప పనులు చిన్నవిగానే ప్రారంభమవుతాయి.

– సిసిరో

★ చదువు మంచిరోజుల్లో ఆభరణంగా ఉంటూ, చెడురోజుల్లో ఆశ్రయాన్ని కల్పిస్తుంది.

– అరిస్టాటిల్

సేకరణ: వాకాడ శ్రీనివాసరావు

క్టర్వి. నీ సిన్మా హిట్టయితే నాలాంటివాళ్లె వ్వరికీ నీ అప్పాయింట్ మెంట్ కూడా దొరకదు"

"అంతమాట అనకండి సార్... ఇదంతా మీరు పెట్టిన భిక్షే"

"అబ్బా! చాలా భారీ డైలాగేశావే! సర్లే నువ్వు పేపర్ చూస్తుండు. ఈలోగానేను రడీ అవుతాను" అంటూ స్వామీజీ లేచి బాత్రూంలోకి వెళ్లాడు. ఇద్దరూ రడీ అయ్యి ఇరానీ హోటల్ కెళ్లి టీ తాగి తిరిగి వచ్చేసరికి టైం ఏడుంబావు అవుతుంది.

"ఇంకా కారు రాలేదేమిటి? " స్వామీజీ అడిగాడు.

"ఏమో సార్ తెలీదు"

నిన్న సాయంత్రం పీతాంబరంను కల్సినప్పుడు ఏడుగంటలకల్లా కారు పంపిస్తానని చెప్పాడు.

మరో అరగంట గడిచింది కారు మాత్రం రాలేదు. టైం దాదాపుగా ఎనిమిదవుతోంది. ముహూర్తం తొమ్మిది గంటలకు. ఇంకా కారు రాకపోవటంతో ఇద్దరికీ టెన్షన్గా వుండి ఆఫీస్కు ఫోన్ చేశారు. ఎంగేజ్ సౌండ్ వస్తోంది. ఎన్నిసార్లు ఫోన్ చేసినా ఎంగేజ్ సౌండ్ వస్తోంది. పీతాంబరం ఇంటికి ఫోన్ చేశారు. ఫోన్ మోగుతోంది కానీ ఎవ్వర్హూ లిఫ్ట్ చేయటంలేదు.

ఇద్దరికీ టెన్షన్ మరింత పెరిగింది.

ఏం జరిగింది? కారు ఎందుకు రాలేదు? ఫోన్ ఎవ్వరూ ఎందుకు లిఫ్ట్ చేయటం లేదు? ముహూర్తం టైం దగ్గరపడుతోంది.

స్వామీజీ కెనెటిక్ హోండా తీశాడు. "పద ముందు, పీతాంబరంగారింటికి వెళ్లి చూద్దాం"

ఇద్దరూ వేగంగా జూబ్లీహిల్స్లో వున్న పీతాంబరంగారి ఇంటికి చేరుకునేసరికి ఎనిమిదిన్నర అయ్యింది. ఇంటి దగ్గర చాలా నిశ్శబ్దంగా వుంది. గేట్లు మూసి వున్నాయి. షూటింగ్ తాలూకు హడావుడి ఏమీ కన్పించటంలేదు. గూర్ఖా గుర్తుపట్టి సెల్యూట్ చేశాడు.

"ఏమయ్యా ఇంకా ఎవ్వరూ రాలేదా? తొమ్మిదింటికల్లా ముహూర్తం షాట్ తీయాలని నిర్మాతగారు అన్నారు" స్వామీజీ గూర్ఖాను అడిగాడు.

గూర్ఖా ఇద్దరివంకా ఆశ్చర్యంగా చూశాడు.

"మీకు ఇంకా తెలీదా సార్! రాత్రి ఇంటి మీద ఇన్కమ్ టాక్స్ రైడ్ జరిగింది. గుండెనొప్పొస్తే అయ్యగార్ని హాస్పిటల్లో చేర్చారు"



అతను శూన్యంలోకి చూస్తున్నాడు.

ఏమిటీ జీవితం? క్షణంలో ఆనందం మళ్లీ లిప్తమాత్రకాలంలో విషాదం. ఇదేనా జీవితం అంటే? చలికాలం కాబట్టి వేగంగా సాయంత్రాన్ని చీకటి కబళిస్తుంది. చుట్టూ చీకట్లు ముసురుతున్నాయి. అతను మాత్రం వంటరిగా దుర్గం చెరువుగుట్టల దగ్గర శూన్యంలోకి చూస్తూ కూర్చుని వున్నాడు.

మంచులో పెట్టినట్లుగా మనసు స్థబ్దంగా వుంది.

అదృష్టం అడుగులేసుకుంటూ వస్తే దరిద్రం పరిగెత్తుకుంటూ వచ్చిందట. ఇదంతా దురదృష్టం కాక ఇంకేమిటి?

తన కథ సిన్మా తీయాలనుకున్న నిర్మాత దొంగనోట్ల కేసులో జైలుకెళ్లాడు.

తనను ఏకంగా డైరెక్టర్ని చేద్దామనుకున్న నిర్మాత హార్ట్ ఎటాక్‌తో ఆస్పత్రిపాలయ్యాడు.

తను దురదృష్టజాతకుడు అన్న విషయం క్లియర్‌గా తేలిపోయింది.

ఇంకో పధ్నాలుగు గంటల్లో సిన్మా ప్రారంభం కాబోతుందనగా నిర్మాత ఇంటి మీద ఇన్‌కమ్‌టాక్స్ రైడ్ జరిగింది. భారీ మొత్తంలో డబ్బూ, ముఖ్యమైన డాక్యుమెంట్స్ దొరికాయంటున్నారు. అకస్మాత్తుగా విరుచుకుపడ్డ ఉపద్రవాన్ని తట్టుకోలేక పీతాంబరం గారికి గుండెనొప్పి వచ్చింది. హాస్పిటల్లో ఆయన్ని అలా చూస్తుంటే గుండె నలిపేసినట్లుగా అన్పించింది. ఆ పరిస్థితుల్లో ఆయన్ని మన సిన్మా ఎప్పుడు తిరిగి మొదలవుతుంది? అని అడగలేకపోయాడు.

అసలు మొదలవుతుందా? ఏమో? తనకు నమ్మకంలేదు.

స్వామీజీ ధైర్యం చెప్పాడు. "ఈ ప్రాజెక్ట్ ఆగిపోదు. పదిహేను రోజుల్లో ఆయన కోలుకుని ఇంటికి రాగానే తిరిగి సిన్మా మొదలుపెడతాడు. పీతాంబరంగారి పట్టుదల సంగతి నాకు బాగా తెలుసు. నువ్వేం వర్రీకావద్దు" అన్నాడు.

కేవలం తనను ఓదార్చేందుకే స్వామీజీ అలా చెప్పాడని తనకు తెలుసు.

దరిద్రదేవత తన నెత్తిన నర్తిస్తూ వుంటే ఎవరు మాత్రం ఏం చేయగలరు?

మళ్లీ మొదలు... ఈసారి మరింతగా హేళనలూ... కామెంట్లు... "ఐరన్‌హేండ్ డైరెక్టర్‌రోయ్.. ముహూర్తంరోజే నిర్మాతకు హార్ట్ ఎటాకొచ్చింది"

"వీడు అడుగుపెడితే నిర్మాతలు మటాష్"

"డైరెక్టర్‌గారు వస్తున్నార్రోయ్.. ఆ ఫేస్ చూడండి.... హ్హహ్హహ్హ"

రక్తం మరిగేది. అయినా కంట్రోల్ చేసుకునేవాడు. ఇదివరకయితే విరగతీసి వుండేవాడు. ఇరానీ కేఫుల దగ్గర ఫ్లాట్‌ఫారం మీదా కూర్చుని కాలక్షేపం చేసేవాళ్లు కూడా కామెంట్లు చేస్తుంటే బాధేసేది.

స్వామీజీ మాత్రం లోకం పోకడ గురించి చెప్పేవాడు.

"నిండా పళ్లున్న చెట్టుకే రాళ్ల దెబ్బలు తప్పవు శంకర్. ఎండిపోయిన చెట్టుమీద ఎవ్వరూ రాళ్లేయరు. నువ్వు సక్సెస్ అయితే ముందుగా వీళ్లే జయజయధ్వానాలు చేస్తారు"

ఎంత సర్ది చెప్పుకున్నా మనసు గాయం పచ్చిపచ్చిగానే వుండేది.

పడుకున్నా నిద్రపట్టేదికాదు. నిద్రపట్టినా లోకం అంతా తన చుట్టూ చేరి పరిహసిస్తున్నట్లుగా కలలు వచ్చేవి. ఏదైనా రాసుకుందామన్నా మనసు నిలిచేదికాదు.

ఇది తన పరాజయం కాదని తెలుసు.

పరిస్థితుల ప్రభావం. ఇందులో తన తప్పు, అసమర్ధత ఏమీలేదు. అయినా తనను విమర్శిస్తున్నారు. తన గురించి చిలవలు, పలవలు సృష్టించి నవ్వుకుంటున్నారు.

రెండు నెలల నరకం తర్వాత అతనికి సాంత్వన చేకూరింది.

ఓ ఆదివారం ఉదయం కోటీ ఫ్లాట్‌ఫారాలమీద నిర్లక్ష్యంగా పడేసివున్న బాగా శిథిలమైపోయిన ఓ పుస్తకం అతనిని ఓదార్చింది. అందులో...

విజయం అంటే ఏమిటి?

ఇతరులు సాధించలేని దాన్ని నువ్వు సాధించటమే విజయం అంటే... విజయాన్ని సాధించటానికి కావాల్సిన శక్తి సామర్థ్యాలు నీకు వున్నాయా? లేవనుకో! సాధన... నిరంతర సాధన చేసి సాధించుకో. వున్నాయా... వాటిని మరింత పదును పెట్టుకుని ముందుకు సాగు.

ప్రయత్నించావా! అయినా ఓటమి ఎదురయ్యిందా? అందులో అసహజం




ఏముంది?

మొదటి ప్రయత్నంలోనే తేలిగ్గా విజయం దొరికేటట్లయితే నువ్వేంటీ! ఈ ప్రపంచంలో నూటికి తొంబైమంది ఎప్పుడో విజయం సాధించి వుండేవాళ్లు. చాలామంది ప్రయత్నించరు. కొంతమంది ప్రయత్నించి ఫెయిల్‌కాగానే వదిలేస్తారు. చివరకు విజయం సాధించేవాళ్లు ఎవరో తెలుసా! మళ్లీ మళ్లీ ప్రయత్నించేవాడు. ఎన్ని కష్టాలు, పరాజయాలు, హేళనలు ఎదురైనా ముందుకు సాగేవాడే శిఖరం చేరుకుంటాడు. చరిత్ర సృష్టిస్తాడు.

ఎ విన్నర్ నెవ్వర్ క్విట్స్...

ఎ క్విట్టర్ నెవ్వర్ విన్స్...

ఇదే విజయరహస్యం..."

పుస్తకం తీసి యధాలాపంగా పేజీలు తిప్పుతున్న శంకర్ వెన్నెముకలోంచి విద్యుత్ ప్రవహించినట్లుగా అతని శరీరం జలదరించింది.

ఎంతటి సూక్ష్మమైన విషయం?

విజయానికి దారి నేరుగా మనకళ్లముందే కన్పిస్తూ వుంటుంది. కానీ మనం...

ఆలోచనల్నీ, ఫీలింగ్స్‌నూ కాంప్లికేట్ చేసుకుంటూ సమస్యల్ని సృష్టించుకుంటూ నిరంతరం దుఃఖిస్తూ వుంటాము...

అది అర్థంచేసుకోగలిగితే అంతా సంతృప్తే... ప్రశాంతతే...

వందరూపాయల నోటిచ్చి చిల్లర కూడా తీసుకోకుండా ఆ చినిగిపోయిన సెకండ్ హేండ్ పుస్తకాన్ని అపురూపమైన నిధి దొరికినట్లుగా గుండెలకు హత్తుకుని వెళ్లిపోతున్న శంకర్‌వంక ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు ప్లాట్‌ఫారంమీద పుస్తకాలు అమ్మే ఆ వ్యక్తి...

★ ★ ★

"విశ్వనాథంగారున్నారా?"

"మీరెవరు?"

"శంకర్..."

"ఏమిటి పని?"

"పర్సనల్‌గా వారితోనే మాట్లాడాలి"

"కుదరదు"

"ఎందుకనీ?"

"ప్రస్తుతం ఆయన జపాన్‌లో వున్నారు కాబట్టి" అవతల వ్యక్తి నిర్లక్ష్యంగా ఫోన్ పెట్టేశాడు.

శంకర్ భారంగా నిట్టూర్చాడు. ఎనభైనాలుగోసారి ఫోన్ చేయటం. సెక్రటరీలు యజమానికన్నా ఎక్కువ దర్పాన్నీ, నిర్లక్ష్యాన్నీ ప్రదర్శిస్తారు. సెక్రటరీల ప్రవర్తనను బట్టి యజమానిని అంచనావేయలేం.

విశ్వనాథం బిజినెస్ టైకూన్.

ఆయనకు చాలా వ్యాపారాలున్నాయి. శంకర్ ఆయన్ని కలుసుకోవాలనుకుంటున్నది మాత్రం సిన్మా పనిమీదే. ఆయన రెగ్యులర్ నిర్మాత కాకపోయినా ఇప్పటికి రెండు సిన్మాలు తీశాడు. రెండూ ఘోరమైన ఫ్లాప్‌లు. కానీ ఆ సిన్మాలు చూసినపుడు నిర్మాతకు మంచి అభిరుచి వుందనిపించింది. అప్పటినుంచీ ఆయన్ని కలవాలని ప్రయత్నిస్తున్నా కుదరటంలేదు శంకర్‌కు. ఎందుకో తెలీదు కానీ మనసు కూడా పదేపదే ఆయన్ని కలవమని చెబుతోంది. మళ్లీ అందులో ఏ లాజిక్కూలేదు జస్ట్ చెబుతోందంతే.

పది రోజుల తర్వాత మళ్లీ ఫోన్ చేశాడు.

అదే నిర్లక్ష్యమైన సమాధానం. ఇదివరకయితే క్రుంగిపోయేవాడు కానీ ప్రస్తుతం రాటు తేలుతున్నాడు కాబట్టి అడ్రస్ కనుక్కుని ఆయన ఇంటికి బయలుదేరాడు.

గూర్ఖా లోపలకు వదల్లేదు.

శంకర్ నిస్సహాయంగా ఆయన ఇంటి ముందున్న ప్లాట్‌ఫారం మీద నిలబడి ఆయన కారులో వెళ్లిపోవటం చూశాడు. భరించలేనంత నీరసం వచ్చింది. అదీ క్షణకాలం మాత్రమే.

'ఎవరేమన్ననూ... ఎదురేమున్ననూ... ఒంటరిగానే పోరా బాబూ పో... నీ దారి నీదే... సాగిపోరా... నీ గమ్యం చేరుకోరా' అని మనసులో పాడుకుంటూ ముందుకు

సాగాడు.

అది మొదలు... ఉదయాన్నే వచ్చి ఆయన ఇంటి ముందు నిలబడేవాడు. గూర్ఖా మాత్రం లోపలకు పంపటానికి ఇష్ట పడేవాడుకాదు. ఇరవై నాలుగు రోజుల తర్వాత అతని నిరీక్షణ ఫలించింది.

ఉదయం తొమ్మిది గంటలకు గేటులోంచి బైటకు వెళుతున్న కారును అదే నిస్సహాయ తతో అతను చూస్తుండగా ఆశ్చర్యంగా కారు రివర్స్‌లో వెనక్కు వచ్చి అతని పక్కన ఆగింది. పవర్‌విండో కిందకు దిగుతుండగా వెనుక సీట్లో కూర్చుని వున్న విశ్వనాథం కన్పించేసరికి ఆయనకు నమస్కరించాడు. ఆయన ఆశ్చర్యంగా శంకర్‌వంక చూస్తూ

"ఎవరు మీరు? చాలా రోజులనుంచీ చూస్తున్నాను. మా ఇంటి ముందు నిలబ డుతున్నారు? "

ఎదురు చూసిన క్షణం ఎదురయ్యేసరికి శంకర్ తడబడ్డాడు. "మిమ్మల్ని కలుసుకు నేందుకు ఎప్పటినుంచో ప్రయత్నిస్తున్నాను సార్" అన్నాడు నమ్రతగా.

"నాతో ఏంటీ పని? "

"మీరో ఐదు నిమిషాలు టైమిస్తే అంతా వివరంగా చెబుతాను"

ఆయన మరింత ఆశ్చర్యంగా శంకర్ వంక చూశాడు. ఏమిటీ కుర్రవాడికి తనతో పని? ఉద్యోగం అడుగుతాడా? చందా కోసం వచ్చాడా? ఆయనకు ఇదంతా మామూలే. ఏదో ఒక పనిమీద డొనేషన్ల కోసం జనం వెంటపడటం. అతని కళ్లలోని కాంతీ, ముఖంలోని చురుకుదనం, పట్టుదల గమనించాక ఆయన కుదరదని చెప్పలేకపో యాడు. "వచ్చే సోమవారం ఉదయం పది న్నరకు నన్ను ఆఫీసులో కల్సుకోండి" అనేసి గ్లాస్‌పైకి ఎత్తేశాడు. కారు వేగంగా దూసు కుపోయింది.

సోమవారం వచ్చేందుకు కాలం చాలా భారంగా గడిచింది.





ఓవిధమైన జంకుతో ఉదయం పది గంటలకే ఆయన ఆఫీస్‌లో అడుగుపెట్టాడు శంకర్. ఆ విషయం స్వామీజీకి కూడా చెప్పలేదు. ఏదైనా అవకాశం రాగానే ఎగిరి గంతేసి స్వామీజీతో చెప్పటం, ఆ తర్వాత అది వికటించి ఇద్దరూ బాధపడటం, ఈమాత్రం దానికి స్వామీజీని కూడా ఎందుకు బాధించటం అనేది అతని ఫీలింగ్.

మనసంతా తీవ్రమైన ఉద్విగ్నంగా వుంది. బైట కూర్చున్న సెక్రటరీ పలకరిం చాడు.

"ఎవరు కావాలి? "

"విశ్వనాథంగారు"

"నీ పేరేంటీ? " ఏకవచన ప్రయోగంతో నిర్లక్ష్యంగా అడిగాడు.

"శంకర్"

"ఓహో నువ్వేనా! మొత్తానికి సాధిం చావు. నీకు సరిగ్గా ఐదు నిమిషాల టైం మాత్రమే ఇవ్వబడింది. ఆయన్ని హింసించ కుండా ఆ తర్వాత నోర్మూసుకుని వెళ్లిపో వాలి. అర్థమైందా? " అనేసి వంకరగా నవ్వుతూ వెళ్లిపోయాడు.

అప్రయత్నంగా శంకర్ పిడికిళ్లు బిగుసు కున్నాయి. అంతలోనే వివేకం హెచ్చరిం చింది. విశ్వనాథంగారు కూడా తనను ఏక వచన ప్రయోగంతో సంబోధించలేదు. కానీ సెక్రటరీ... అవును అంత సంస్కారం, మానవత్వం లేదు కాబట్టే యాభై ఏళ్లు దాటుతున్నా ఎవరికో సెక్రటరీగా మిగిలి పోయి తన శాడిజంతో సంతృప్తిపడుతు న్నాడు. ఇటువంటి మూర్ఖులతో గొడవ వ్యర్థం.

అరగంట తర్వాత పిలుపొచ్చింది.

"కూర్చోండి.... ఇప్పుడు చెప్పండి. ఏమిటీ మీరు నాతో పర్సనల్‌గా మాట్లాడా లనుకుంటుంది? "

"నా దగ్గర చాలా మంచి సబ్జెక్టు వుంది సార్"

"సబ్జెక్టా? " ఆయన ఆశ్చర్యంగా, అర్థం

కానట్లుగా శంకర్ వైపు చూశాడు. "సబ్జెక్టే మిటి? దేని గురించి మీరు చెప్పేది? "

"సిన్మా సబ్జెక్ట్ సార్" శంకర్ నమ్రతగా అన్నాడు.

"సిన్మా సబ్జెక్ట్ నాకెందుకు? నేనేం సిన్మా తీయాలనుకోవటంలేదే!"

నిరాశా, నిస్పృహలు సుడిగాలిలాగా ఒక్కసారిగా అతన్ని చుట్టుముట్టాయి. ఎంత మూర్ఖుడు తను? రెగ్యులర్‌గా సిన్మాలు తీయని వ్యక్తి దగ్గరకు వచ్చి సిన్మా కథ చెబుతానంటుంటే, ఆయన తనకు సిన్మా తీసే ఉద్దేశ్యమేలేదంటున్నాడు. తనకంటే మూర్ఖుడు ఈ భూప్రపంచంలో వుంటాడా? అసలు తను ఏం చేస్తున్నాడో కనీసం తనకయినా తెలుస్తోందా?

"రెండు సిన్మాలు తీసి చేతులు కాల్చుకున్నాను. డబ్బు సంగతి కాదు నేను చెప్పేది. పరువు సంగతి... అదిగో ఫ్లాపుల నిర్మాత అంటూ పార్టీల్లో జనం చాటుగా నన్ను చూసి నవ్వుకోవటం నాకు తెలుసు. నా కెరీర్‌లో సక్సెసే తప్ప ఫెయిల్యూర్స్‌లేవు. అటువంటిది రెండు సిన్మాల దెబ్బకు లాఫింగ్ స్టాక్ అయిపోయాను. అందుకే జీవితంలో చచ్చినా మళ్లీ సిన్మా తీయకూడదని ఒట్టుపెట్టుకున్నాను"

ఆయన చెబుతున్నదేమీ వినపడటం లేదు. మనసులో హోరుమంటూ శబ్దం అయిపోయింది. ఎంతో ఆశపెట్టుకుంటూ ఎదురుచూసింది కూడా మొగ్గలోనే బూడిదయిపోయింది. అసలు సిన్మానే తీసే ఆలోచనలేని ఆయనకు ఏం సబ్జెక్ట్ విన్పిస్తాడు తను? ఎందుకు జరుగుతుంది ఇలా? ఎక్కడకు వెళితే అక్కడ ఫెయిల్యూర్స్ బ్రహ్మారాక్షసిలా నోరు తెరుచుకుని తనను మింగేస్తూ...

"మిస్టర్ శంకర్"

ఆయన పిలుపుతో తేరుకున్నాడు.

"సారీ మిస్టర్ శంకర్... మీరు చాలా డిసప్పాయింట్ అయినట్లున్నారు. కానీ చెప్పానుగా నాకు సిన్మా తీసే ఆలోచనలేదు"

"సార్ ప్లీజ్ సార్. ఒక్కసారి సబ్జెక్ట్ వినండి సార్. మీకు తప్పకుండా నచ్చుతుంది సార్" శంకర్ ప్రాధేయపడుతున్నట్లుగా అన్నాడు.

ఈలోగా ఛాంబర్ తలుపు తెరుచుకుని సెక్రటరీ వచ్చి వినయంగా "సార్... పవర్ ప్రాజెక్ట్ విషయం డిస్కషన్ కోసం బైట ఇంజనీర్లు, వెయిట్ చేస్తున్నారు" అని చెప్పాడు.

విశ్వనాథం తల తిప్పి శంకర్‌వైపు చూశాడు.

'ఇంక మీరు వెళ్లొచ్చు' అన్నది ఆ చూపుల అర్థం. కానీ ఎందుకో తెలీదు అకస్మాత్తుగా శంకర్‌మీద ఆయనకు జాలేసింది. ముప్పై సంవత్సరాల క్రితం తను కూడా గుండెల నిండా ఆశలు నింపుకుని "ప్లీజ్ సార్... చిన్న ఉద్యోగం సార్" అంటూ అందరినీ ప్రాధేయపడటం గుర్తొచ్చింది. ఆయనకు తన గతం గుర్తుకు వచ్చిన క్షణమే చాలాచాలా గొప్పది. ఆ క్షణమే శంకర్ జీవితాన్ని మలుపు తిప్పింది.

సెక్రటరీ వైపు చూసి "పది నిమిషాలు వెయిట్ చేయమను" అని సెక్రటరీ వెళ్లిపోయాక "సిన్మా కాకుండా ఇంకేదైనా సహాయం... ఐమీన్ ఉద్యోగం లేదా ధన సహాయం కావాలంటే అడగండి" అన్నాడు.

"సార్ నేను చెప్పే సబ్జెక్ట్ వినండి. మీకు నచ్చకపోతే నేను వెళ్లిపోతాను. నాకు ఇంకే సహాయమూ అక్కర్లేదు" అన్నాడు.

ఆయనకు ఎందుకో శంకర్‌ని చూస్తే ముచ్చటేసింది.

ఇంకొకళ్లయితే డబ్బు సహాయం అనగానే ఎగిరిగంతేసేవాళ్లు. ఇతను మాత్రం సబ్జెక్ట్ చెబుతానంటున్నాడు. వింటే నష్టం ఏముంది? విన్న తర్వాత ఎటు తిరిగీ నచ్చలేదని చెప్పొచ్చు

"సరే... త్వరగా చెప్పండి. నాకు చాలా

ముఖ్యమైన మీటింగ్స్ వున్నాయి" అన్నాడా యన ఛెయిర్‌లో వెనక్కువాలుతూ.

గుండెల నిండా ఊపిరితీసుకుని శంకర్ చెప్పటం ప్రారంభించాడు.

పీతాంబరానికి చెప్పిన సబ్జెక్ట్‌కాదు. సురేంద్ర ఆల్ రెడీ కసికొద్దీ ఆ సబ్జెక్ట్‌ను కని పించిన వాళ్లకల్లా చెప్పేశాడు. సీన్స్, డైలాగ్స్ కూడా కాపీకొట్టేసి సిన్మాలు చుట్టే శారు. అందుకే వేరే సబ్జెక్ట్ చెప్పటం మొద లుపెట్టాడు.

అరగంట గడిచింది. గంటయ్యింది...

విశ్వనాథం కోట్లాది రూపాయల విలువ చేసే ప్రాజెక్టు విషయాలు పక్కనపెట్టేసి శంకర్ చెబుతున్నది వింటూ వుండిపో యాడు. శంకర్ చెప్పటం పూర్తిచేశాక ఆయన అడిగాడు.

"ఎంత బడ్జెట్‌లో చేస్తారీ సిన్మాని? "

"డెబ్బై లక్షలు..."

"వ్వాట్" అన్నాడాయన విశ్వసించలేన ట్టుగా. "స్టార్స్ రెమ్యూనరేషన్స్ ఆకాశంలో వున్న ఈ రోజుల్లో డెబ్బై లక్షలతో ఈ సిన్మా తీస్తారా? "!

"స్టార్స్ అవసరంలేదు సార్! ఆర్టిస్టులు కావాలి. వీలయితే ఎక్కువమంది కొత్తవా ళ్ళను తీసుకుంటే ఇంకా బెటర్. స్టార్స్ మీద కంటే టెక్నిషియన్స్‌మీద ఎక్కువ ఖర్చుపె డదాం. అంటే అనుభవంవున్న కెమేరామెన్, ఎడిటర్, మ్యూజిక్ డైరెక్టర్ని వేసు కుందాం... కొత్తవాళ్ళతో టెక్నికల్‌గా బాగా తీద్దాం..."

ఆయన నవ్వాడు. "మొత్తానికి మీరు చాలా అసాధ్యులు శంకర్... ఈ జన్మలో మళ్ళీ సిన్మా తీయకూడదనుకున్నవాడిచేత సిన్మా తీయిస్తున్నారు..."

"అంటే మనం ఈ సిన్మా చేస్తున్నామా సార్? "

"అవును... మీ ఆత్మవిశ్వాసం, పాజిటివ్ అప్రోచ్ నాకు బాగా నచ్చింది. మీ సమర్థత మీద నాకు నమ్మకం కలుగుతోంది. సిన్మాకు సంబంధించి ఇదే నాకు ఆఖరి అవ కాశం... ఫ్లాపుల నిర్మాత అనే అపప్రధ నాకు రాకుండా చేస్తారనే ఆశిస్తున్నాను. ఆల్ ది బెస్ట్ మిస్టర్ శంకర్. లెటజ్ స్టార్ట్ ఎ గుడ్ సిన్మా టు గెదర్..."

★ ★ ★

రహస్యంగా వర్క్ మొదలయింది...

పబ్లిసిటీలేదు, ప్రెస్‌మీట్‌లేదు. అసలు ఈ ప్రాజెక్ట్ సంగతే ఎవ్వరికీ తెలీదు. స్వామిజీ, శంకర్ కొత్తవాళ్లను ఇంటర్వ్యూ చేసి క్యారక్టర్‌కు సరిగ్గా సూటబుల్ అన్నవా ళ్లను తీసుకున్నారు. వాళ్ళకు సీన్స్ ఇచ్చి ట్రైనప్ చేయటం మొదలయింది. రాత్రింబ వళ్ళూ అదో యజ్ఞంలా చేసుకుంటూ ముందుకు సాగారు.

మూడు నెలల తరువాత ఎక్స్‌పీరియ న్స్‌డ్ టెక్నీషియన్స్ అనుకున్నారు.

ఆర్టిస్టుల్ని, టెక్నీషియన్స్‌ను కూర్చోబెట్టి కథ అంతా విన్పించి సలహాలు తీసుకుని ప్రాక్టికల్‌గా బాగుందన్న చోట్ల మెరుగులు దిద్దారు. సీన్స్, పాత్రలు క్యారక్టర్స్ బిహేవి యర్, లైటింగ్, కెమేరా యాంగిల్స్, మ్యూజిక్ మొదలైన విషయాలన్నింటి గురించీ కూలంకషంగా చర్చించారు. తనకు ఏం కావాలో ఏవిధంగా కావాలన్నది శంకర్ ఒకటికి పదిసార్లు ఓపిగ్గా టెక్నీషియ న్స్‌కు వివరించాడు. తనకు తెలీని విషయా లనూ, సందేహాలనూ టెక్నీషియన్స్‌తో డిస్కస్‌చేసి క్లారిఫై చేసుకున్నాడు.

రేపు షూటింగ్ మొదలవుతుందనగా ముందురోజు టెక్నీషియన్స్, ఆర్టిస్టులతో మీటింగ్ ఎరేంజ్ చేశాడు.

ఇది కేవలం సిన్మాకాదు. మన జీవితం, మన ప్రాణం. ఇది సక్సెస్ అయితే మనం దరి భవిష్యత్తూ ఉజ్వలంగా ఉంటుంది. ఫెయిలయితే అందరం సర్వనాశనం అయి పోతాం. ఇక్కడ ఇగోలకు స్థానంలేదు. ఎవరూ ఎక్కువాకాదు తక్కువాకాదు. మనం సర్వశక్తుల్నీ ధారపోసి విజయం




సాధించేందుకు కృషి చేద్దాం. ఎవరికి ఏ సందేహాలు, సమస్యలు వచ్చినా నిరభ్యంతరంగా నాతో చర్చించవచ్చు. అర్థంలేని అసూయలూ, రాజకీయాలకు మన యూనిట్‌లో స్థానంలేదు. మనం సక్సెస్ అయి తీరాలి. ఫెయిలయితే మన సర్వనాశనం అయిపోవటంతోపాటుగా చాలా సంవత్సరాలు కొత్త వాళ్లకు అవకాశాలిచ్చేందుకు నిర్మాతలు ధైర్యం చేయలేరు. సో ఇట్స్ ఛాలెంజ్ టు క్రియేట్ హిస్టరీ ఇన్ సిన్మా ఇండస్ట్రీ" వింటున్న అందరి ముఖాల్లోనూ పట్టుదల తొంగిచూసింది.

★ ★ ★

షూటింగ్ ప్రారంభం అయ్యింది.

పబ్లిసిటీలేదు. వున్నా కూడా ఎవ్వరూ పట్టించుకునేవాళ్లు కారు.

తెలిసిన కొద్దిమంది నవ్వుతున్నారు.

వింటే ఆత్మహత్య చేసుకునేంత ఘోరమైన నీచమైన కామెంట్లు చేశారు.

"వాడు డైరెక్టరేమిటి? వాడిదసలే ఐరన్ హేండ్... ఈ దెబ్బతో విశ్వనాథం ఎగిరిపోతాడు చూస్తూ వుండండి" అంటూ జోస్యాలు మొదలయ్యాయి.

శంకర్ దీన్నంతా పట్టించుకోకుండా తన పని తాను చేసుకుంటూ పోయాడు.

విశ్వనాథంగారు ఒక్కసారి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చాక ఇక దేంట్లోనూ వేలుపెట్టలేదు. శంకర్ అడిగింది సమకూర్చేవారు... ఆయనకంత తీరిక కూడా లేదు. ఆయన వ్యాపార వ్యవహారాల్లో ఆయన బిజీ.

ఎనిమిదిరోజుల షూటింగ్ తర్వాత అవాంతరాలు మొదలయ్యాయి.

యాక్షన్ సీన్స్ షూట్ చేస్తున్నపుడు హీరో కాలు విరిగింది.

సింగిల్ షెడ్యూల్‌గా అరవైరోజుల్లో పూర్తిచేయాలనుకున్న ప్లానింగ్ దెబ్బతింది.

ఈలోగా విలన్ క్యారెక్టర్‌కోసం తీసుకున్న కుర్రాడు మధ్యలో చెప్పాపెట్టాకుండా మాయంఅయిపోయాడు. దాని వెనుక ఇండస్ట్రీలో వున్న కొన్ని శక్తుల రాజకీయం వుందని తెలుసు. అయినా సరే సహనంతో కొత్త ఆర్టిస్టును తీసుకువచ్చి మళ్ళీ కాంబినేషన్ సీన్స్ అన్నీ రీషూట్ చేశాడు.

నిద్రహారాలు మానేసి షూటింగ్ పనుల్లో బిజీగా వుండటంవల్ల శంకర్‌కు మలేరియా ఎటాక్ అయ్యింది. జ్వరంతోనే షూటింగ్ చేసేవాడు. స్వామీజీ, విశ్వనాథంగారు ఎంత చెప్పినా వినేవాడు కాదు.

అతని కళ్ళముందు ఒకటే లక్ష్యం మెదులుతుండేది. దానికోసం తన ప్రాణాల్ని పణంగా పెట్టాలని అతను ఎప్పుడో నిర్ణయించుకున్నాడు. ఓటమికంటే పోరాడుతూ చచ్చిపోవటం ఉత్తమం అనేది అతని ఫిలాసఫీ.

★ ★ ★

రాత్రి పదయ్యింది.

హార్స్‌లీహిల్స్ కొండల్లో చలి ఎక్కువగా వుంది. శంకర్ రేపు తీయబోయే పాట తాలూకు స్క్రిప్ట్ కంపోజిషన్, షాట్ డివిజన్ చూసుకుంటున్నాడు. కొండమీదున్న కాటేజీల్లో యూనిట్ విడిది చేసింది.

అరగంట తర్వాత తలుపుమీద తట్టిన శబ్దం అయితే శంకర్ లేచి వెళ్ళి తలుపు తీశాడు.

హీరోయిన్ ఛార్మిల లోపలకు వచ్చింది.

"డైరెక్టర్‌గారు ఫుల్ బిజీ అనుకుంటానే!" అంటూ నవ్వుతూ వెళ్ళి సోఫాలో కూర్చుంది.

"ఏం లేదు చెప్పండి"

"నిద్రపట్టటంలేదండీ డైరెక్టర్‌గారూ! మీరు కంపెనీ ఇస్తారేమోనని వచ్చాను" టెమ్టింగ్‌గా నవ్వుతూ వళ్ళు విరుచుకుంటూ అంది. పల్చటి నీ్రతూ డ్రస్‌లో నుంచి ఆమె అందాలు బహిర్గతం అవుతున్నాయి.

"రేపు తీసే సాంగ్‌లో మీరు ఫ్రెష్‌గా కన్పించాలంటే బాగా నిద్రపోవాలి. వెళ్ళి మీ రూమ్‌లో కళ్ళుమూసుకుని పడుకోండి. నిద్ర

# ఏరినముత్యాలు

* అర్హతలేని వానిని ప్రశంసించడం గాడిదకు సిల్కుజీను తొడగటం వంటిది.

– కుర్దిష్ సామెత

* డబ్బు విలువ మరి దేనికీ లేదు ఏ మాత్రం విలువలేని వ్యక్తికికూడా విలువ కలిగించేది ఆ డబ్బే

– బెర్నార్డ్ షా

* సత్యపాలన వల్ల ధర్మం, నిరంతర అధ్యయనంవల్ల విద్య, శుచిత్వంవల్ల రూపం, మంచి నడవడికవల్ల జాతి రక్షింపబడతాయి.

– రాజాజీ

* చెడు గుణం, పేదతనం నుండి పని మనకు విముక్తిని కలిగిస్తుంది.

– అబ్రహాంలింకన్

* అసహాయుడు కోరని వస్తువూ, అసూయపరుడు చెప్పని మాటంటూ అసలు ఉండదు.

– సంస్కృత సూక్తి

* అధికారం సంపాదించటం, నిలబెట్టు కోవటం, దాన్ని చెలాయించటం అనే కళ రాజకీయం

– జార్జిఆర్వెల్

* మీ కోరికలు అంతులేనివి అయితే, మీ చింతలూ, భయాలూ కూడా అంతులేనివే.

– థామస్ ఫుల్లర్

* బుద్ధిమంతుడు అటు పుస్తకాల్ని, ఇటు జీవితాల్ని కూడా చదువుతాడు.

– లిన్ యుటాంగ్

* ఒక పనిని ఎందుకు తప్పుగా చేశానని వివరించడానికి పట్టే సమయంకన్నా ఆ పనిని చేయడానికి తక్కువ సమయం పడుతుంది.

– లాంగ్‌ఫెలో

* మనిషి హృదయంలో ఔదార్యం, కరుణ అనేవి ఏ కోశానా లేకుంటే అంతకు మించిన గుండెజబ్బు ప్రపంచంలోనే ఉండదు.

– బాబ్‌హోప్

సేకరణ : ముద్దంశెట్టి అండమ్మ

అదే వస్తుంది"

హీరోయిన్ బోరింగ్‌గా ముఖం పెట్టింది.

"ఎంతసేపూ వర్క్... షూటింగ్ తప్పితే ఎంజాయ్‌మెంట్స్ లేకపోతే ఎలాగండీ డైరెక్టర్‌గారూ! మీరు కూడా రిలాక్స్ కావాలి కదా. అందుకే వచ్చాను. మరీ ప్రవరాఖ్యుడిలాగా మాట్లాడతారేంటీ" అంది విసుగ్గా.

ఆమె ఉద్దేశ్యం ఏమిటో అతనికి అర్థమైంది.

వళ్ళు మండింది... కానీ ఫీల్డులో ఇదంతా నిత్యకృత్యమైన వ్యవహారంలా మారింది కాబట్టి హీరోయిన్ తనను ఆవిధంగా రెచ్చకొట్టాలనుకోవటంలో ఆమె ప్రొఫెషనలిజం కనబడుతుంది.

"చూడండి ఛార్మిలీ... డైరెక్టర్ని ఆకట్టుకోవటం అంటే శారీరకంగా సుఖపెట్టటం కాదు. మీకు ఇచ్చిన పాత్రను అద్భుతంగా పోషించి మెప్పించండి. అది అందరికీ మంచిది. అంతేకానీ వేరే మార్గాల్లో సంతృప్తి పర్చటం ద్వారా తాత్కాలికమైన ఆనందం తప్ప ఏమీ దొరకదు. ఇప్పుడే మీ కెరీర్ మొదలవుతోంది. మీలో నిజమైన టాలెంట్ వుంటే ఎవ్వరూ ఆపలేరు. ఒకవేళ టాలెంట్ లేకుండా కేవలం శారీరకంగా డైరెక్టర్ని సంతృప్తిపర్చినంతమాత్రాన మీరేమీ పెద్దహీరోయిన్ అయిపోరు. శరీరంతో కాకుండా నటనతో, టాలెంట్‌తో ఎదుటివాళ్ళను ఆకట్టుకునేందుకు ప్రయత్నించండి. వెళ్ళండి... ఇప్పటికే ఆలస్యమైపోయింది. వెళ్ళి నిద్రపోండి"

ప్రపంచంలోని అద్భుతాన్ని మొట్టమొదటిసారిగా చూస్తున్నట్లు హీరోయిన్ దిగ్భ్రాంతిగా డైరెక్టర్ వంక చూసింది.

★ ★ ★

ఇటువంటి ప్రలోభాలు ఎన్నో...శంకర్ని అవేమీ ప్రభావితం చేయలేకపోయాయి.

సిన్మా...సిన్మా...సిన్మా... నిద్రపోతున్నా సీన్స్ కలవరించేవాడు.

ఆ డెడికేషన్, క్రమశిక్షణ చూసి యూనిట్ వాళ్ళంతా ఆశ్చర్యపోయేవాళ్ళు.

విశ్వనాథంగారు అర్జంటుగా అమెరికా వెళ్ళారు.

వెళ్ళేముందు సెక్రటరీకి అన్నీ వివరంగా చెప్పి వెళ్ళారు. అయినా సరే అవకాశం దొరికేసరికి సెక్రటరీ శాడిజంతో హింసించేవాడు. శంకర్ కావాలనుకున్నవి ఎరేంజ్ చేసేవాడు కాదు. ముఖ్యంగా ఫైనాన్షియల్ మాటర్స్, పట్టించుకునేవాడు కాదు. దాంతో షెడ్యూల్ అప్‌సెట్ అయ్యేది.

సహనంతో పళ్ళబిగువున ఈ రాజకీయాలన్నీ భరించేవాడు శంకర్.

లక్షాతొంభై సమస్యలు... అసూయాగ్రస్థులు సృష్టించే ప్రాబ్లమ్స్... అవాంతరాలు.

మొత్తానికి తొమ్మిది నెలల తర్వాత సిన్మా రిలీజ్ అయ్యింది.

మొదటిరోజు... నాలుగోరోజు... వారం రోజులు... థియేటర్ల దగ్గర జనం లేరు.

అంతకష్టపడి తీసిన సిన్మా ఘోరమైన ఫ్లాప్.

"ఇంక నాలుగు రోజులు చూసి థియేటర్స్‌లో సిన్మా తీసేస్తామంటున్నారు" అన్నాడు స్వామీజీ.

శంకర్ మౌనంగా తల ఆడించాడు. అవును... ఎంతకాలం వాళ్ళు మాత్రం ఖాళీ థియేటర్లతో సిన్మా నడుపుతారు?

స్వామీజీ సానుభూతిగా అతనివంక చూశాడు.

రక్తంపెట్టి సిన్మా తీశాడు. నిద్రహారాలు, ఆరోగ్యం ఫణంగాపెట్టి అహోరాత్రులూ శ్రమించి సిన్మా తీశాడు. కానీ ఎవరికి కావాలి ఇదంతా?

సిన్మా ఘోరమైన ఫ్లాప్.

అది చాలు...అతని జీవితం, లక్ష్యం, ఆశయం సర్వనాశనం కావటానికి.

ఓదార్పుగా భుజంతట్టాడు. "బాధపడకు... మనం చేయగలిగింది చేశాం. సక్సెస్ మన చేతుల్లో లేదు"

అంతా అయిపోయింది అనుకున్న రెండు

రోజుల తర్వాత అద్భుతం జరిగింది.

ఆనకట్ట పగిలి నీళ్లు ముంచెత్తినట్లుగా జనం ప్రవాహంలా థియేటర్లమీద పడ్డారు.

సిన్మా తీసేద్దామనుకుంటున్న ఎగ్జిబిటర్స్‌కు మతిపోయింది.

ఒక్కసారిగా జనం ఎందుకు ఎగబడ్డారన్నది పదిరోజుల తర్వాత అర్థమయ్యింది.

కాలేజీలకు శెలవులిచ్చేశారు. అంతకంటే ముఖ్యంగా టీవీలో అంతవరకూ వస్తున్న క్రికెట్ మ్యాచ్‌ల సీజన్ ముగిసింది. దాంతో థియేటర్లు కిటకిటలాడాయి.

ఇరవై ప్రింట్లు నూట ఇరవై ప్రింట్స్ అయ్యాయి.

వందరోజులు దాటుతున్నా జనం చూస్తూనే వున్నారు.

ఆవిధంగా...

ఏమాత్రం అనుభవంలేకుండా కేవలం దీక్ష, పట్టుదల, క్రమశిక్షణతో ఇరవైఎనిమిదేళ్ళ కుర్రాడు తీసిన ఆ సిన్మా సూపర్‌డూపర్ హిట్టయ్యి చలనచిత్ర చరిత్రలో నిలిచేపోయేలా రికార్డులు బద్దలుకొట్టటం ప్రారంభించింది.



టీవీ చూస్తున్న ఆ అమ్మాయి గట్టిగా అరిచింది.

"అమ్మా... టీవీలో అన్నయ్యను చూపిస్తున్నారే"

పురుషోత్తమరావుగారు, శారదమ్మ గబగబా వచ్చారు... టీవీలో శంకర్ ఇంటర్వ్యూ వస్తోంది.

"ఇంత సూపర్‌డూపర్ హిట్ సిన్మా ఎలా తీయగలిగారు? "

"మంచి సిన్మా తీయాలనుకున్నాను. అదృష్టవశాత్తూ అది హిట్టయ్యింది"

"మీ సక్సెస్‌కు ముఖ్యకారకులెవరు? "

"చాలామంది వున్నారు. నా మిత్రుడు చందు, నన్ను నమ్మి అవకాశం ఇచ్చిన విశ్వనాథంగారు, మిత్రులు స్వామీజీ... మంచి సిన్మా చూసి హిట్ చేసిన ప్రేక్షకులు, నా యూనిట్ సభ్యులు... కానీ వీళ్ళందరికంటే ముఖ్యంగా నా తల్లిదండ్రులు... నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకే ఈ సక్సెస్ చెందుతుంది"

శంకర్ తల్లిదండ్రులు సజలనయనాలతో కొడుకుని టీవీలో చూస్తుండిపోయారు.

"చూశారా! మీరు ఎప్పుడూ వాడిని తిడుతూవుండేవాళ్ళు. కానీ వాడు ఎంత గొప్పవాడయినా నా తల్లిదండ్రులే గొప్పవాళ్ళని చెబుతున్నాడు..." ఆనందభాష్పాలు రాలుస్తూ అంది శారదమ్మ.

పురుషోత్తమరావుగారు మౌనంగా తల ఆడించారు.

పైకి ప్రకటించటంలేదుకానీ ఆయన గుండెల్లో ఆనందం పరవళ్ళు తొక్కుతోంది. వ్యర్థుడైపోయాడనుకున్న కొడుకు చరిత్ర సృష్టించాడు. అది చూసి ఊళ్ళో అందరూ పొగుడుతున్నారు. ఒకప్పుడు హేళనలు చేసినవాళ్ళే నమస్కారాలు పెడుతున్నారు.

ఒక్కసారిగా ఊళ్ళో తను ప్రముఖుడైపోయాడు.

శంకర్ వాళ్ళ నాన్నగారు అంటున్నారు. అందరూ గౌరవిస్తున్నారు. లోకం తీరే

అంత...

విజయం సాధిస్తే నెత్తినెత్తుకుంటారు. లేకపోతే పేడకుప్పలోకి తొక్కుతారు.

అదే సమయంలో ఆ ఇంటిముందు లాన్సర్ కారు ఆగింది.

అందులోనుంచి శంకర్, చందూ దిగారు.

కొడుకుని చూడగానే అదీ ఆరు సంవత్స రాల తర్వాత చూసేసరికి వాళ్ళ ఆనందం కెరటంలా ఎగిసింది. కళ్లలో అప్రయత్నం గానే నీళ్లు నిలిచాయి. మనసు బరువ య్యింది.

శంకర్ తల్లిదండ్రుల కాళ్లకు నమస్కరిం చాడు.

ఆనందం ఎక్కువయి మాటలు రాన ట్లుగా అందరూ మౌనంగా నిలబడిపో యారు. చెల్లెలు భారతి అన్నయ్యవంకే చూస్తూ వుండిపోయింది. చందు గర్వంగా నవ్వుతున్నాడు.

ఆరు సంవత్సరాలపాటు నిశ్శబ్దం, దుఃఖం తాండవించిన ఆ ఇంట్లోకి సరికొత్త వసంతం ప్రవేశించింది. భవిష్యత్తు ఇంద్ర ధనస్సులా అందంగా కనబడుతోంది.

శంకర్ తన వెంట తెచ్చిన పెద్ద బ్యాగ్ లోనుంచి నోట్ల కట్టలను పురుషోత్తమరావు గారి పాదాల వద్ద కుప్పగా పోశాడు.

"కోటి రూపాయలు నాన్నా... కొడుకు సంపాదన అనుకోండి. లేకపోతే ఇంతకాలం నేను పెట్టిన క్షోభకు పరిహారం అనుకోండి మీ ఇష్టం... చెల్లెలు పెళ్ళి చేస్తారో... పొలాలే కొంటారో మీ ఇష్టం..." అన్నాడు.

పురుషోత్తమరావుగారు ఆనందంతో కొడుకుని ఆలింగనం చేసుకున్నారు.

సంతానం ప్రయోజకులు కావటంకంటే ఏ తల్లీదండ్రయినా కోరుకునేది ఏముం టుంది కనుకా!

★ ★ ★

పదినెలలు తర్వాత...

నందీ అవార్డ్ ఫంక్షన్...

ముఖ్యమంత్రి మాట్లాడుతున్నారు.

"సిన్మాలు ప్రజల్ని పక్కదోవ పట్టిస్తున్న నేటిరోజుల్లో పక్కదోవ పడుతున్న యువత రానికి సందేశాన్నిస్తూ ఓ యువదర్శకుడు చేసిన ఈ ప్రయోగం నిజంగా అపూర్వం... కేవలం దర్శకునిగా, కథకునిగా కాకుండా మానవత్వం మూర్తీభవించిన వ్యక్తిగా శ్రీ శంకర్ సూచించిన పరిష్కారం యువతరా నికి తప్పకుండా స్ఫూర్తినిస్తుందని నమ్ముతూ అతను భవిష్యత్తులో మరిన్ని మంచి చిత్రాలు రూపొందిస్తారని ఆశిస్తూ ఉత్తమ కథకుడు, దర్శకునిగా నందీ అవా ర్డును ప్రదానం చేస్తున్నా..."

జనం హర్షధ్వానాలతో ఆ ప్రాంతం దద్ద రిల్లిపోయింది...

సక్సెస్ వుంటేనే ఈ ప్రశంసలు, హర్షధ్వా నాలు, పొగడ్తలు వుంటాయి. లేకుంటే జనం, ప్రపంచం మర్చిపోతారు. తను చరి త్రలో కలిసిపోతాడు. మరో కొత్త కుర్ర వాడు జనం తాలూకు జయజయ ధ్వను లను అందుకుంటాడు.

సక్సెస్ సాధించటం గొప్పకాదు... దాన్ని నిలబెట్టుకునేందుకు నిరంతరం శ్రమించటం గొప్ప...

అదే నిజమైన సంతృప్తి, సాధన...

సక్సెస్ గమ్యం కాదు అది ఓ సుదీర్ఘమైన ప్రయాణం...

జీవితాంతం నిరంతరం సాగుతూనే వుంటుంది.

☆

*మానవత్వం, విద్వత్తుల అరుదైన కలయిక... మా తాతగారు స్వర్గీయ రావ్‌బహదూర్ ఆదెళ్ళ రంగనాయకులు నాయుడు గారి దివ్య స్మృతికి.*

*–శివ*



# ఏరిన ముత్యాలు

* నాకు గట్టిగా నవ్వడం ఇష్టం. ఎందుకంటే దాని వల్ల పెదవులే కాదు, హృదయం కూడా తెరచుకుంటుంది.

– విక్టర్ హ్యూగో సాయల్

* అందరూ అనుకునే విధంగా ప్రపంచంలో మంచివాడనీ, చెడ్డవాడనీ ఎవరూ ఉండరు. మనం చూసే దృష్టిలోనే ఈ భేదం ఉంది.

– షేక్స్పియర్

* బతకటం గొప్ప కాదు. ఆదర్శం కోసం ఆత్మార్పణ చేసుకునే బతుకు గొప్పది.

– పొట్టి శ్రీరాములు

* మనసు క్షోభకు గురైనపుడు దాని ప్రభావంతో తనువు అనారోగ్యానికి గురవుతుంది. మనసు ఆనందంగా ఉంటే వారికి ఆరోగ్యమే ఆరోగ్యం.

– చలం

* మనిషి తోటిమనిషిని ప్రేమించటానికే జన్మించాడు తప్ప, మృగాల మాదిరి ఒకరినొకరు వేటాడుతూ చంపుకోడానికి కాదని మన వేదసంస్కృతి ఘోషిస్తోంది.

– కాళిదాసు

* కాలుతున్న ఇనుపగుండును చల్లని నీటిలో ముంచితే ఆ నీరు సైతం ఎలా వేడెక్కుతుందో అలానే మనసు క్రోధావేశంతో నిండిపోతే ఆ ఆవేశం తాలూకుబాధ శరీరాన్నంతటినీ బాధిస్తుంది.

– చలం

* ప్రమాదం రాకముందే భయపడే వాడు పిరికివాడు. ప్రమాద సమయంలో ఒణికి పోయేవాడు చేతకాని వాడు. కానీ ప్రమాదం గడిచిన తర్వాత కంపించి పోయేవాడే నిజమైన సాహసి.

– రామకృష్ణ పరమహంస

* 'ప్రేమ'లేని జీవితం ... తీయదనం లోపించిన క్షీరాన్నం లాంటిది.

– వార్న్ కోచ్

* చిన్నారి శిశువు దేవదూత లాంటివాడు. ప్రపంచంలోకి అడుగు పెట్టాక అతడి కాళ్లు పెద్దవయ్యేకొద్దీ రెక్కలు తరిగి పోతాయి.

– ఫ్రెంచి సామెత

సేకరణ : **ఆచంట మెహర్‌మణి**

# 'వసుధ' పై సమీక్షలు

## నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన డాక్టర్. కృష్ణ రచన వసుధ పై మాకందిన ఉత్తమ సమీక్షలు

(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)

మనకు నిత్యజీవితంలో తారసపడే వ్యక్తులు ఈ నవలలో మనల్ని పల కరిస్తారు. తమ అంతరంగాలని ఆవి ష్కరిస్తారు. తమ స్వభావాలతో మనపై ప్రభావం చూపుతారు. పాఠ కుల హృదయాంతరాళాల్లో పాత్రలు గాఢమైన ముద్రను వేస్తాయి. ఒక్క 'వసుధకే కాదు, సునిశితంగా పరిశీ లిస్తే మనకీ జీవించడం నేర్పుతాయి. జీవితాన్ని సాధించడం నేర్పుతాయి. నవల చదువుతున్నంతసేపూ మనలో భావావేశాలు ఉత్తుంగ తరంగాలవు తాయి. మనల్ని కదిలిస్తాయి, మన సుని కుదిపేస్తాయి. సాంతం చదివే దాకా పాఠక హృదయాల ఆరాటం ఆగనివ్వని ఉత్తమ నవల "వసుధ".

రచయిత్రి పాత్రలకు జీవం పోయ



## కంటతడి పెట్టించింది

డంలోనూ, వ్యక్తిత్వాలను తీర్చిదిద్దడంలోనూ నిస్సందేహంగా విజయం సాధించారు. ఊహించని మలుపులతో ఆద్యంతం ఆసక్తిక రంగా ఉండటంవల్ల పాఠకుల కళ్లు అక్షరాల వెంబడి పరుగులు తీస్తాయి. బాల్యంనుంచి వసుధ పడ్డ కష్టాలు, మోహన్ ఆమెపై చూపించిన వాత్సల్యం హృదయాన్ని ద్రవింప జేస్తాయి. సిస్టర్ మోడెస్టీనా చనిపోయే ముందు వసుధకు చెప్పిన జీవిత సత్యాలు, ఆమె వసుధపై చూపించే మాతృప్రేమ కంట తడి పెట్టిస్తాయి. ఆమె జీవితం గురించి చెప్పే సత్యాలు వసుధతోపాటు మన హృద యాలలోనూ లయమవుతాయి.

ప్రారంభంనుండి వసుధ పాత్రను మలు చుకుంటూ వచ్చిన తీరు, ప్రౌఢ అయిన తర్వాత ఆమె వ్యక్తిత్వ చిత్రణ సందర్భోచి తంగా, సహజంగా ఉంది. తన జీవితంలో అడుగుపెట్టిన వ్యక్తులు నిష్క్రమించినప్పుడు ఆమె పడే ఆవేదన, తపన హృదయానికి హత్తుకొంటాయి. మోహన్, రవీంద్రల వ్యక్తి త్వాలు మనపై చెరగని ముద్రను వేస్తాయి. నడిసముద్రంలో గమ్యం తెలియని నావకు

చుక్కానిగా మారి గమ్యాన్ని కల్పించిన ధీశాలిగా రవీంద్ర పాఠకుల మన్ననలు అందుకుంటాడు.

కృష్ణ పాత్ర లేకుండా వసుధను రవీంద్రతో ముడిపెట్టినట్లయితే ఇది ఒక సాదాసీదా నవలగా మిగిలిపోయేది. నవలలో అర్థాంతరంగా ప్రవేశించిన కృష్ణ వసుధను ఆకర్షించడం, దగ్గర కావడం మొదట్లో పాఠకులకు కొంత బాధ కల్గిస్తాయి. తనను ఆదరిస్తూ, అండగా నిలబడినవారిని వదిలిపెట్టి ఆమె కృష్ణవైపు ఆకర్షితురాలు కావడం జీర్ణించుకోలేం. కాని నిశితంగా గమనిస్తే, రచయిత్రి కృష్ణ ద్వారా రవీంద్ర గొప్పతనానికి మెరుగులు దిద్దినట్లు కన్పిస్తుంది. అతని ఉత్తమ సంస్కారం, ఉన్నత వ్యక్తిత్వం పాఠక హృదయాలకు అతనిని దగ్గర చేస్తాయి. అతను వసుధపై చూపించే ఆదరణ, అనురాగం, సహనం, సున్నితత్వం మనసులను ఆర్ద్రం చేస్తాయి. అతని గుండెల్లో వసుధకు కన్పించిన భద్రతా భావం నూటికి నూరుపాళ్లు సరైనది అన్పిస్తుంది.

కృష్ణ చనిపోయాడని తెలిసిన తరువాత నవలని మరింతగా సాగతీయకుండా నేర్పుగా ముగించిన తీరు బాగుంది. 'మంచు గోడ కరిగేవరకూ ఎదురుచూడటంకన్నా, దాన్ని ఛేదించటమే ఉత్తమం' అన్న రవీంద్ర అభిప్రాయంతో మనమూ ఏకీభవిస్తాం. ఎందుకంటే అది ఎప్పటికయినా కరిగిపోతుంది. కాని ఈ 'వసుధ' మన హృదయాలలో చాలా కాలం నిలిచిపోతుంది.

–జి. కుమారస్వామి
విజయనగరం-535 002

## శరత్ నవలలా ఉంది

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

నవంబర్ మాసంలో వచ్చిన డాక్టర్ కృష్ణగారి నవల 'వసుధ' శరత్ దేవదాసు నవలవలే మంచి నాటకీయత కలిగివుంది. చాలా ఏళ్ళ తర్వాత అలాంటి కోవకు చెందిన మంచి నవలను ప్రచురించిన విశిష్టత 'చతుర'కే దక్కింది. నాకు మంచి నవలను చదివిన అనుభూతిని మిగిల్చింది. కథాంశం ఆసాంతం ఆహ్లాదకరంగా చదివించింది. హృదయం ద్రవించే పాత్రలను ప్రవేశపెట్టి నిరంతరం కొత్త కొత్త మలుపులకు కథ దారి తీసిన వైనం బాగుంది. ఏ పాత్రలకు ఆ పాత్రలు తమ వంతు పాత్రను పోషిస్తూ అవి మళ్ళీ తారసపడకుండా రచయిత మలచిన తీరు చాలా చక్కగా వుంది. ఏ పాత్రకు ఎంతవరకు గుర్తింపునిచ్చి ముగించాలో రచయిత కనబర్చిన తీరు చాలా బాగుంది. నవల ప్రారంభంనుంచి ముగింపు వరకు 'వసుధ'నే కీలకపాత్రను చేస్తూ సాగిన ఈ నవల చాలా రసవత్తరంగా కొనసాగింది. కలెక్టర్ హోదాలో సూర్యారావు పాత్రను ప్రవేశపెట్టి దాన్ని సంకుచిత మనస్తత్వానికి ప్రతినిధిని చేస్తూ పరమ భయంకరమైన కామాంధునిగా చూపెట్టిన విధానం సమంజసంగా లేకున్నా ఆ పాత్ర అలా ఎందుకు ప్రవర్తించిందో కూడా సవివరంగా అక్షరీకరించటంతో విమర్శకు తావు లేకుండాపోయింది. అలాంటి పరమ నీచుడినుంచి నిర్మల తెలివిగా మసులుకుని తనని తాను రక్షించుకుంటూ అటు మోహన్ కుటుంబాన్ని ఇటు వసుధను సంస్కరిస్తూ సూర్యారావును పరోక్షంగా చెప్పుతో కొట్టినట్లుగా చేసి అదృశ్యం కావడం బాగుంది. మానవతావాద పాత్రలు మోహన్, రవీంద్రప్రసాద్ ఈ నవలకే మూల స్థంభాల్లాంటివి. మారుతున్న ఆధునికతకు చిహ్నంగా శిరీష మోహన్ జీవితంలోనికి ప్రవేశించి అతని ఆదర్శవంతమైన వృత్తి వృత్తంలో నిలబడలేక తన దారిన తాను వెళ్ళింది. కానీ వసుధ తాను ఎదుర్కొన్న అనుభవాల సారాంశాన్ని నెమరు వేసుకుంటూ బలహీన క్షణాల్లో కృష్ణ సమక్షంలో అదుపు తప్పినా రవీంద్ర వంటి మానవతా




వాది పరిష్వంగంలో తన జీవితాన్ని భద్ర పర్చుకుంటూ ఇమిడిపోయింది. ఆధ్యాత్మిక తకు ప్రతినిధిగా వసుధను, కమ్యూనిజం భావాలకు కృష్ణమోహన్‌లను పేర్కొంటూ వారి మధ్య తలెత్తే ప్రశ్నలను సమన్వయప రిచే మానవతావాద మూర్తిగా రవీంద్ర పాత్రను చిత్రించిన తీరు నవలకే మకుటా యమానంగా తోచింది. సన్యాసం అంటే విరక్తి కాదు సత్యాన్వేషణ అనే దృక్పథంలో విశ్లేషిస్తూ జీవితంనుంచి పారిపోవడం కాదు, దానిని ఎదుర్కొనడం అని వసుధ వైరాగ్యాన్ని పోగొట్టి తన జీవిత భాగస్వా మిగా రవీంద్ర ఆమోదించిన నవలా ముగింపు బాగుంది.

**-ఆర్. ప్రకాష్**
హైదరాబాద్-500 018

## అస్తవ్యస్థ పాత్ర చిత్రణ

*(మూడవ బహుమతి రూ. 50/-పొందిన సమీక్ష)*

**డా.** కృష్ణగారి 'వసుధ' నవల సగం నుండి ఊపందుకుంది. తండ్రి చేష్టలు, భావాలు అసహ్యించుకునే మోహన్ నిర్మల విషయంలో అదే తప్పు చేయడం సబబుగా లేదు. అంతేకాకుండా తాను చేసిన తప్పునే తన భార్య శిరీష చేస్తే సహించలేకపోవడం, సూటిపోటి మాటలతో బాధించడం అతని 'మేల్ ఇగో'కి నిదర్శనం.

డాక్టరుగా ప్రాక్టీసు చేస్తున్న రవీంద్రప్ర సాద్ ఒక టీనేజ్ అమ్మాయిని ప్రేమించి, ఆ ప్రేమను వెల్లడించలేకపోవడం, ఆమెలో పవిత్రతను చూడడం, ఆమెను ఆరాధిం చడం- ఒక ఇంటర్ చదివిన అమ్మాయి నిండా ఇరవై సంవత్సరాలు లేని అమ్మా యికి అంతటి పెద్దరికాన్ని ఆపాదించడం హాస్యాస్పదం.

అంతటి పవిత్రత ఉన్న వసుధ, నర్సుగా కృష్ణమోహన్‌ను తాకడానికే ఇష్టం లేదని పెద్ద లెక్చరు ఇచ్చిన వసుధ ఉద్యోగధర్మం కంటే సన్యాసి మీటింగులే ముఖ్యం అను కునే వసుధ హఠాత్తుగా కృష్ణమోహన్‌కు లొంగిపోయి తననుతాను అర్పించుకోవడం ఆ తర్వాత రమణాశ్రమానికి పారిపోవడం చూస్తే ఆమె మాటలకు, చేతలకు పొంతన లేనట్టుగా పాత్ర చిత్రణ ఉంది. నవలలో నిగ్రహం లేని అసంకల్పిత శృంగారం చూప బడింది. ఇది ఎబ్బెట్టుగా ఉంది. పీడిత తాడిత జనం కోసం, అన్యాయాలకు వ్యతిరే కంగా పోరాడే ఒక కమ్యూనిస్టు క్షణికావే శంలో ఒక అమ్మాయిని సమస్యల్లోకి నెట్టి వేయడం కూడా పాఠకులకు ఆ పాత్రపట్ల, కమ్యూనిస్టుల సిద్ధాంతాలపట్ల సదభి ప్రాయం లేకుండా చేసింది. వసుధ బాగా చదువుకుని, ఉద్యోగం చేస్తూ తనకంటూ ఒక ప్రత్యేకత ఏర్పరచుకొని తనలాంటి అనాధలను మరికొందరిని చేరదీసి వారికి మార్గదర్శకంగా ఉన్నట్లు చూపిస్తే, చిన్నప్ప ట్నుండి ఎంతోమంది శిక్షణలో పెరిగినం దుకు ఫలితం ఉన్నట్లు ఉండేది. ఆమెను పెళ్ళాడడానికి నిర్ణయించుకున్న జంటిల్ మెన్ డా॥ రవీంద్ర పాత్ర విషయంలో ఆమె బిడ్డకు తండ్రిగా ఉన్నట్లు చూపించడా నికి ధైర్యం చెయ్యలేకపోయారు రచయిత్రి. అందుకే ఆమెకు అబార్షన్ జరిగినట్లు చిత్రించారు. నిజానికి అబార్షను సీను అంత అవసరమా? ఏదిఏమైనా నవల ఒక సారి చదవడానికి ఫర్వాలేదు.

**-డి. హేమలత**
విజయవాడ

## నిష్ఫలం కాదు

*(నాల్గవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

**డాక్టర్** కృష్ణగారి 'వసుధ' ఫర్వాలేదనిపిం చింది. మొదటుగా చెప్పుకోవలసింది అతిగా



ప్రవేశపెట్టబడిన పాత్రల సంఖ్య. చాలావరకు కనుమరుగయిపోయిన పాత్రలే. ఉదాహరణకు రజనీ, నళినీలు.. వారు కవలలనడం కథకేమంత సంబంధంలేదు. 'వసుధ' అని పేరు పెట్టడం ద్వారా ఆ అమ్మాయి పాత్రకు రచయిత ఎక్కువ సానుభూతిని ఆశించారనిపించింది. అలాగే అందుకనుగుణంగా ఆమెకు కష్టాలను ఆపాదించారు. తనకు బాధ కలిగినప్పుడల్లా క్రైస్తవ మిషనరీలను ఆశ్రయించడం, చిన్మయానంద బోధనలను వినడం, రమణ మహర్షి ఆశ్రమంలో చేరడం వంటి సంఘటనలలో 'ఎస్కేపిజం' కనిపించింది. అంత పద్ధతిగా చదువుకున్న అమ్మాయి, అది కూడా చిన్నప్పటినుండీ ఎవరో ఒకరిచే ఏదోవిధంగా ప్రభావితం కాబడిన 'వసుధ' తనకి కష్టం కలిగినప్పుడు మనసును 'కంట్రోల్' చేసుకోలేకపోయిందా?

మోహన్, డాక్టర్ రవీంద్ర పాత్రల్లో మహోన్నత వ్యక్తిత్వం కనపడి కథకు ఎంతో తోడ్పడ్డాయి. సమాజంలో ఉన్న వివిధరకాల వ్యక్తుల మనోభావాలు, చిత్తచాపల్యాలు రచయిత వివరించిన తీరు బాగుంది. ముఖ్యంగా సూర్యారావు పాత్ర చిత్రీకరణ, సంభాషణలు క్లుప్తంగా ఉండి హృద్యంగా అనిపించాయి. 'వసుధ'ని 'మిషనరీ'లో చేర్పించినప్పుడు వయసును తక్కువవేసి, దాని ఉపయోగం ముందుముందు తెలుస్తుందని చెప్పి, అంతలోనే వయసును ఎక్కువగా నమోదు చేయడం ఎందుకో అర్థం కాలేదు.

ఎంత అనాథగా పెరిగిన అమ్మాయి అయినప్పటికీ, డిగ్రీస్థాయికి వచ్చినా 'చేబ్రోలు' ఒక్కటే ఉంటుందనుకుని ఆ ఊరు వెళ్ళి గుడ్డిగా తన చిన్నప్పటి ఇల్లును వెతటకం హాస్యాస్పదం. అలాగే ఆమె చలంగారి రచనలతో ప్రభావితం కావడం బాగానే వున్నా, వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం ఆమె వయసురీత్యా కాలాన్వయం కుదరలేదు.

ఏమైనప్పటికీ రచయిత్రి శ్రమ నిష్ఫలం కాదు. చిన్న చిన్న ఒడిదుడుకులున్నప్పటికీ కథనం బాగుంది. నవల పూర్తయ్యాక ఒక మంచి రచన చదివిన 'ఫీలింగ్' కలిగింది. అదిచాలు రచయిత 'పాస్' అయ్యారని చెప్పడానికి.

—చివుకుల వరప్రసాద్
రాజమండ్రి-4

## దారి తప్పింది

*(ఐదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

"బిందువులా మొదలై ఎన్నో వొంపులు తిరుగుతూ, ఎన్నో ఉప కాలవలని కలుపుకొంటూ ఓ మహానదిలా 'స్త్రీ' జీవితం సాగుతుంది" అన్న ఉపమానానికి అతికినట్టు అనిపిస్తుంది. 'వసుధ' కథ చదువుతుంటే!

నిర్మల, మోహన్‌ల ఆదరణ లేకుంటే 'వసుధ' ఈ జనారణ్యంలో ఏమైవుంటుంది?

మల్లెపూవులాంటి హృది కలిగిన రవీంద్ర వ్యక్తిత్వం లేకపోతే 'వసుధ' బలిపశువు కాదా?

'వసుధ'మీద ఎంతో పట్టుతో ఆమెని మలిచిన 'కృష్ణ'గారి కలాన్ని మెచ్చుకోవలసిందే!

కానీ...

అమాయకంగా కృష్ణమోహన్ చేతిలో మోసపోవడం, రవీంద్ర మనసు తెలుసుకోకపోవడం, అంతవరకు మోహన్ చెప్పిన జీవన సూత్రాలు టక్కున మరచిపోవడం మాత్రం కథ కథలానే సాగాలనే సూత్రంతో వాస్తవాలకు అద్దంలా సాగుతున్న కథని పక్కతోవ పట్టించినట్లయింది.

—ఐ. రవికుమార్
గూడూరు-524 101

☆





# చతుర కథలు

## దోపిడి బళ్ళు

"పిల్లలకోసం ఓ పాతిక సీతాఫలాలు బేరం చేసి తేగూడదూ. అవంటే వాళ్ళు చెవికోసు కుంటారు" భర్త రామారావుతో అంది రాధమ్మ.

రామారావుకి 'బేరం' అంటే విసుగు, చిరాకు. తనకి సరిగ్గా బేరం చెయ్యడం రాదు. చెప్పిన రేటుకి అటుఇటుగా కొంటాడు తప్ప గీసిగీసి బేరం చెయ్యలేడు. రామారావు భావన!

మీది సత్తెకాలం, వాళ్ళది కలికాలం. అందుకే వాళ్ళు అన్యాయాన్ని కేష్ చేసుకుంటున్నారు. అర్ధరూపాయి అరటిపండు రూపాయికమ్మి జేబులు నింపుకుంటున్నారు. వాళ్ళపై జాలిపడితే నష్టపడేది మనమే అంటుంది రాధమ్మ.

అయినా రామారావు మారలేదు. "ఇలాగైతే వాళ్ళు మీ నెల జీతాన్ని రెండు వారాల్లో లాగేస్తారు. మీకు తెలుసో లేదో. వాళ్ళ వాలకం చూసి పాపం అని ఇద్దైపోన




రాధమ్మకి నచ్చనిది అదే. 'ప్రతీ వస్తువూ బేరమాడాలి. లేకుంటే ఏ వ్యాపారైనా సరే దోచేస్తాడు' అంటుందామె.

పెరిగిపోతున్న ధరలకి మనలాగ వ్యాపారులూ బాధితులే గదా. నాల్గురాళ్ళు కిడితేనేగదా వాళ్ళ సంసారాలు నడిచేది. మరిమనం తడిబట్టపిండేసినట్టు బేరం చేస్తే వారి కడుపులు నిండటం ఎలా? అనేది క్కర్లేదు. తోపుడుబండోళ్ల గురించి చెప్పాలంటే చాలా టైం పడ్తుంది. నాకిప్పుడంత ఖాళీ లేదుగాని వెళ్ళి పట్రండి" అంటూ సంచి తెచ్చి భర్తకిచ్చింది. రామారావు డబ్బు జేబులో పెట్టి సంచితో బయల్దేరబోయాడు.

"మీరు బండి దగ్గిరకెళ్ళి ముందు పళ్ళ నాణ్యత పరిశీలించినట్టు చూశాక ఎంతన డిగి బేరం మొదలుపెట్టండి. ఈలోగా ఎవ రో ఒకరు కొనడానికొస్తారు. వార్ని బేరం చెయ్యమనండి. రేటు ఫిక్సయ్యాక డబ్బిచ్చి తెండి. ఒకవేళ .మీరు వెళ్ళేసరికి బేరం కుది రివుంటే వెంటనే కొనెయ్యండి" మెళుకువలు చెప్పి పంపింది రాధమ్మ.

రామారావు మార్కెట్టు సెంటరుకొచ్చి చూశాడు. ఒకే ఒక బండినిండా అందంగా సీతాఫలాలు పేర్చి కనబడ్డాయిగానీ ఒక్కరు కూడా అక్కడ కొనడంగాని బేరమాడ్డంగాని లేదు. రామారావు బండివద్దకొచ్చి ధర అడి గాడు.

డజను యాభై అన్నాడు బండివాడు.

చిన్నగా కరెంటు షాక్కొట్టినట్టయి దిక్కులు చూశాడు రాధమ్మ భర్త.

అది కనిపెట్టి, "కాయ సైజు చూడండి. పంపరపనసకాయల్లాగున్నాయి. తింటే వది లిపెట్టరు" అన్నాడు.

వ్యాపారి తనమ్మే కాయల విశిష్టతలు ఎంత ఏకరువు పెట్టినా రామారావు ఎటూ నిర్ణయించుకోలేకపోయాడు. పళ్లు కొనాలి తప్పదు.

"సార్. పెద్దవారు కాబట్టి పది తగ్గించి పట్టుకెళ్ళండి" కాసేపు చూసి అన్నాడు బండివాడు.

"ఏమయ్యా! ఇందాక నువ్విప్పుడు వీరికి చెప్పినకాడికి నేనడిగితే యాభైకి ఒక్క పైసా తగ్గనన్నావు. ఏంటీ మనిషికో రేటా?" అంటూ ఒక మధ్యవయస్కుడొచ్చి గయ్యిమ న్నాడు. వెంటనే బండివాడు గబగబా డజను పళ్ళు కేరీ బేగ్‌లో సర్ది 'గొడవెందుకు పట్టుకెళ్లండి' అని ఆయనిచ్చిన నలభై తీసు కుని అందించాడు. అది అందుకుని అతడె ళ్ళిపోయాడు మారుమాటలేకుండా.

కాగల కార్యం గంధర్వులు తీర్చినట్టు, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు, బేరం సమస్య తప్పినందుకు సంతసించి పోయిన రామారావు వెంటనే రెండు డజన్లు పళ్లు తీసుకుని రెండు సంచుల్లో సర్దించి డబ్బిచ్చి రెండు చేతుల్తో పట్టుకుని బయల్దేరాడు. ఈ లోగా నల్గురొచ్చి అదే రేటుకి కాయలు కొంటున్నారు.

పళ్ళమోతకి జడిసి అటూ ఇటూ చూశాడు రామారావు. తెల్సిన రిక్షాడ్రైవరు సూరి కనిపించాడు. ఆయన్ని చూసి రిక్షాతో దగ్గిరకొచ్చాడు. పండ్ల సంచులు జాగ్రత్తగా రిక్షాలో పెట్టి రామారావు కూర్చున్నాడు. తదుపరి సూరి స్లోగా తొక్కుతూ ఒంటిమామిడి సెంటరుకొచ్చాక "ఎలా కొన్నారయ్యా?" అని అడిగాడు. రామారావు చెప్పీచెప్పగానే "ఏంటండీ నల భయ్యా?" అని నోరెళ్ళబెట్టాడు. వెంటనే, "మిమ్మల్ని బుట్టలో పెట్టేసి డబ్బులు గుంజుకున్నాడు" సూరి బాధపడ్డాడు.

"ఆ రేటుకి నాతో పాటు నలుగురైదు గురు కొన్నారు" అన్నాడు రామారావు.

"అయ్యగారూ! బండోడు మీక్కాబట్టి రేటు తగ్గించానంటాడు. అప్పుడొకడు గభాల్న వచ్చి ఇందాక ఆ రేటుకి అడిగితే నా కెందుకివ్వనన్నావు అంటాడు కోపంగా. మీరు చూస్తుండగా ఆడికి పళ్ళిచ్చి డబ్బులిచ్చుకుంటాడు. ఆడెల్లిపో తాడు. ఆడెనక మీరు మీ ఎనక మరో నల్గురూ ఎగబడి అట్టుకెళ్ళిపోతారు. ఇంతకీ ఆడెవరో కాదయ్యా. ఆడి బిగినెస్ పార్టనరే. వాడికి వీధినాటకాల్లో మంచి అనుభవం ఉందిలెండి" అన్నాడు" రిక్షా వాడు.

మర్నాడు ఆ తోపుడుబండివద్ద నిన్నటి వాడుగాక బండివాడితో పోట్లాడి తనతో పాటు నలభైరూపాయలకు కొన్నవాడు కనుపించాడు రామారావుకు.

– మాధవరపు కృష్ణ





# తెలివెవరి సొత్తు

గోపాలకృష్ణ! పేరుకుతగ్గట్టే శృంగార పురుషుడు. కంటికి ఏ అమ్మాయైనా కాస్త నదరుగా కనిపిస్తే చాలు కాపుగాయటం, వలవేయటం, వలపు తీర్చుకుని వదిలేయటం అతనికి అలవాటే.

గోపాలకృష్ణ లేడీవేటలో భాగంగా ఒకసారి 'లేడి'పిల్లకు బదులు పులిపిల్ల పడింది. ఆ పిల్ల పేరు 'రాణి'. ఆ పులిపిల్ల అందరిలా గోపాలకృష్ణ వదిలించుకోవాలనుకోగానే వదిలిపెట్టలేదు. "నీవు లేకుండా నేను బతకలేను, నీవు కాదంటే చస్తాను" అంటూ 'లక్క'లా అతుక్కుపోయింది. దెబ్బతో గోపాలకృష్ణ ఆమె వల్లో చిక్కుకుపోయి విలవిలలాడిపోసాగాడు.

ఆ పిల్లను ఎలా వదిలించుకోవాలో అర్థం కాక తనకు ఏ సమస్య వచ్చినా సలహా ఇచ్చే స్నేహితుడు మదన్‌మోహన్‌కు తన అవస్థను సవిస్తరంగా వెళ్ళబోసుకున్నాడు. అంతా విన్న మదన్‌మోహన్ "రేపు ఉదయం అర్జంట్‌గా హాస్పటల్‌లో జాయిన్ అయిపో. మిగతా కథ నేను నడుపుతాను" అంటూ అభయమిచ్చాడు. ఆరోజు రాత్రే ఓ పావులీటరు 'ఆముదం' తాగేశాడు గోపాలకృష్ణ. తెల్లవారేసరికి విపరీతంగా మోషన్స్ అయి నీరసపడిపోయాడు. అసలు విషయం తెలియని గోపాలకృష్ణ భార్య గొల్లుమని మదన్‌మోహన్‌కు ఫోన్ చేసింది.

మదన్‌మోహన్ ప్లాన్‌లో ఫస్ట్ సీన్ ప్రారంభమయింది. హాస్పటల్ బెడ్‌మీదున్న గోపాలకృష్ణ ఎవర్నీ గుర్తుపట్టే స్థితిలో లేడు. సెలైన్‌బాటిల్ స్టాండ్‌కు వేలాడుతోంది. మదన్‌మోహన్ రస్కులు తింటూ బత్తాయిరసం తీయటంలో నిమగ్నమైవున్నాడు.




సెకండ్ సీన్ ప్రారంభమయింది. కబురు తెలిసి కంగారు కంగారుగా వచ్చింది పులిపిల్ల రాణి "ఏమండీ" అంటూ ఏడుస్తూ.

"ఉష్! మాట్లాడించకు" అన్నాడు మదన్.

"మదన్‌గారూ ఏమయిందండీ మీ స్నేహితుడికి" అంది వెక్కి వెక్కిపడుతూ.

"లూజ్ మోషన్స్. ప్రస్తుతం కోమాలో వున్నాడు. రిపోర్టులొస్తేనే కాని ఎస్సో మిస్సో చెప్పలేమంటున్నారు" అన్నాడు రస్కులు తింటూనే.

"దేవుడో! నా దేవుడు నన్నన్యాయం చేత్తే నాకు దిక్కెవరురో" అంటూ శోకాలు పెడ్తూ పక్కనే వున్న స్టూలుమీద కూర్చుంది పులి పిల్ల!

ఇంతలో కల్పనారాయ్ సిస్టర్‌లా వున్న 'సిస్టర్' ఒకామె వచ్చింది. ఆమె పేరు గజలక్ష్మి. భూమి అదిరేలా అడుగులు వేసుకుంటూ మదన్ దగ్గరకు వచ్చి "ఈ అమ్మాయి ఎవరు? " అంది.

"మావాడి తాలూకు" అన్నాడు.

"తాలూకా? జిల్లా? పెళ్ళాం కాదన్న మాట" అంది వెటకారంగా.

కాదు అన్నట్టు తలూపి మళ్ళీ ఔనన్నట్టు తలూపాడు.

"ఏయ్ పిల్లా ఇలా రా. నీతో మాట్లాడాలి' అంటూ రాణిని తన వెంట తీసుకువెళ్ళింది గజలక్ష్మి.

వారంరోజుల తరువాత!

గోపాలకృష్ణ, మదన్‌మోహన్‌లు 'నిషా' బార్‌లో వున్నారు.

"ఏంప్లాను వేశావు బావా! దెబ్బతో ఆ పులిపిల్ల నన్ను వదిలేసి వాళ్ళ అక్కగారింటికి వెళ్ళిపోయింది" అన్నాడు బీర్ తాగుతూ గోపాలకృష్ణ.

"చాలా సింపుల్ ప్లాన్. సిస్టర్ గజలక్ష్మికి ధనలక్ష్మి అంటే చాలా మోజు. డబ్బులిస్తే ఎంత ఎదవపని చేయమన్నా చేసేస్తుంది. చిన్న అబద్ధమాడితే ఐదొందలిస్తానన్నాను. వెంటనే ఒప్పేసుకుంది"

"నీకు బ్లడ్ టెస్ట్‌లో ఎయిడ్స్ లక్షణాలు కనిపించాయని రాణితో చెప్పమన్నాను అంతే" అన్నాడు సింపుల్‌గా.

"నీ బుర్రే బుర్ర బావా! నీకిలాటి ఐడియాలు ఎలా వస్తాయోకాని... పోతే పోయాయి. రెండు వేలు. రాణి గొడవ వదిలింది..." కిక్ ఎక్కసాగింది గోపాలకృష్ణకు. మాటలు ముద్దగా రాసాగాయి.

మరో వారంరోజులు గతించాయి.

పోస్ట్‌మేన్ ఓ లెటర్ తెచ్చి ఇచ్చాడు గోపాలకృష్ణకు. ఆ లెటర్ చదివిన గోపాలకృష్ణ లబోదిబోమంటూ మదన్‌మోహన్ దగ్గరకు పరుగెత్తాడు. తనకు వచ్చిన లెటర్ చూపించాడు.

"నాయనా! గోపాలకృష్ణా రాణిని వదిలించుకోవడానికి నీ స్నేహితునితో కలిసి నీవాడిన నాటకం నాకు తెలుసు. ఈ రహస్యం రాణికి చెప్పకుండా వుండాలంటే నీవు నాకు నెలనెలా వెయ్యినూటపదహార్లు పంపిస్తూ వుండాలి. ఏ నెల నీవు డబ్బు పంపకపోతే ఆ నెల్లో నీవాడిన డ్రామా రాణికి చెప్పేస్తాను. రాణి సంగతి నీకు తెలుసుగా. నీ బతుకును బస్టాండ్ చేసేస్తాది. తెలివి నీ ఒక్కడి సొత్తే అనుకోకు

గుడ్‌బై
గజలక్ష్మి

మదన్‌మోహన్ "కథ అడ్డం తిరిగింది బామ్మర్దీ" అన్నాడు తల పట్టుకుని.

– హైమవతీ సత్య

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78

# కొందరికి కారం అంటే మమకారం !



ఔను. ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్ళు మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును. ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... **300, 500** గ్రాముల సీసాల్లోనూ, **1** కే.జి., **5** కేజీలు, **20** కేజీల ప్యాకింగులలోనూ లభించును.










**priya**

**Pickles**

ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసిద్ధ

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.**